మిగిలినవి. మిగిలిన పత్రములలోనైనను గ్రంథము చాలకొద్దిగా గ్రాహ్యము. (ఇది చాల వరకు నిరుపయోగమని దలచవచ్చును.)

# ఆంధ్ర మహాభారతము

## యుద్ధ పంచకము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3984 | కాల్ నెం | : టి 3-466 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 342 |
| ప్రతి పరిమాణము | : 45×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

ప్రారంభము :

శ్రీ సంపాదిపదాంబుజ నాసాగ్రనివాస రసిక నాదామృత ధా
రా సార రూప వేద వ్యాస వ్యంజిత విహార హరిహరనాథా!

క. దేవా జనమేజయవసు ధా వల్లభు డధిక వినయ తత్పరుడై సం
భావించి కుతూహలమున దా వైశంపాయనునకు దగ నిట్లనియెన్।

క. ఒండొరుల గెలుచు తలపున బాండవులును గౌరవులును బాహా గర్వో
ద్దండత నెట్లు దొడంగిరి భండన మెప్పాట జెల్లె బరమ మునీంద్రా.

క. అనుటయు వైశంపాయను డనుమోదరసార్ద్ర హృదయుడై యిట్లనియెన్
జనమేజయు మనమున సం జనితంబగు కౌతుకంబు సఫలత బొందన్.

వ. పుణ్య క్షేత్రోత్తమంబైన యాకురుక్షేత్రంబున రెండు దెరంగులవారి కటకంబులును విడిసి కయ్యంబునకు గాలు ద్రవ్వు చున్నట్టి సమయంబునను ధృతరాష్ట్రుండు కొడుకుల దుర్వినయంబునకు నిర్వేదనంబు నొంది సంజయద్వితీయుండై చింతించుచున్నయెడకుం త్రికాల వేదియగు వేదవ్యాసుండు విజయంచేసి యమ్మహీపతి సేయు నర్చనల గైకొని యతని కిట్లనియె।

క. కాలం బగుటయు నృపులకు నాలము సమకూరె దీని కడలకు మది నీ
వాలోకింపగ వలసిన నీకోనికి దివ్య దృష్టి నిచ్చెద బుత్రా!

చ. అనుడు నతండు ఘోరముగ నన్నలు దమ్ములు వోర గ్రూరతం
గనుగొన జాల నేను వినగా వలతుం దదనుగ్రహంబు సే
సిన గడు లెస్స యన్న ముని చిత్తమునం గరుణించి సంజయుం
బనిచె మహారణంబు పరిపాటిమెయిన్ సకలంబు జెప్పగన్,

ముగింపు :

వ. అట్టివి యద్దేవదేవుని దివ్యలీల లతండు గోపించిన భువనంబుల సంహారంబును ప్రసన్నుండైన సుఖిత్వంబును గనునా భూతనాథుండు గురుసుతునకు సన్నిహితుండయ్యె గావున నయ్యోధవరుండు శిబిరంబు ప్రవేశించి యిట్టి పరాక్రమం బాచరించె గానీ యివ్విశేషం బారథికవరుని శక్తి నైనదిగా దవి చిత్తంబున నిడం బనిలేదు। భీష్మ ద్రోణకర్ణ శల్యాదులైన మహావీరులంబోర బరిమార్ప దొరకొనుటకును, దర్ప దుర్దములైన ధృతరాష్ట్ర నందనాగ్రేసరులైన దుశ్శాసన దుర్యోధనులజలంబు నెరయ వక్షో రక్త పానంబున నూరుభంగంబునం బరిభూతులను జేసి ప్రతిజ్ఞాపూరణాచరణ శోభనంబు నొంద సంభావించుటకు గారణంబైన భవదీయ దైవమానుషయోగంబునకు పరమానందంబు నొందుమని యిట్లు గోవిందుండు ధర్మనందనునకు నాశ్వాసంబొనరించెనని జనమేజయునకు వైశంపాయనుండు చెప్పుటయు.

మహాస్రగ్ధర :

సాయం ప్రాతర్హుత ప్రజ్వలితహుతవహ స్వైర నిర్ధూత జాడ్య
స్యాయ చ్చేతః ప్రసాదాస్పద విమలతర ప్రౌఢబోధానుమోదీ
మాయా యోగానుదూరామఖతతి హృతి నిర్మాణ సంపాద్యమానా
శ్రేయోరాజ త్రిలోకాశ్రిత జనదురితక్షేపలీలా విలాసా!

క. సురనికరానందకరా సురారికాంతా విలాసశోభాపహరా
కరుణాసక్త మనస్కా సరిద్వరా బర్హి బర్హ చారు శిరస్కా!

మాలిని। అకలుష హృదయాభి వ్యక్త సర్వోపయుక్తా
సకల నిగమ వేద్యా స్వచ్ఛ విద్యోపపాద్యా
ప్రకృతి వికృతి భాస ప్రాప్త సంపత్ప్రదీప్తా
సుకృతమయి కలాపా సుస్థిరైశ్వర్యరూపా।

గద్య :

ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబున సౌప్తిక పర్వంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు:

ప్రతి విలేఖనము: ప్రభవనామ సంవత్సర ఆషాఢ శుద్ధ ౩ శుక్రవారం మూడు ఝాములవరకు అచ్చు పుస్తకం చూచి వ్రాసిన భారతం యుద్ధ పంచకం.

హిజరి 1284. ప్రతి చక్కనిది. గ్రంథపాత, శైథిల్య దోషములు లేవు. అచ్చు పుస్తకము చూచి వ్రాసిన ప్రతి.

# ఆంధ్ర మహాభారతము
## ద్రోణపర్వము
### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3451 | కాల్ నెం | : టి 3–461 |
| ప్రతి | : తాళ పత్రము ; సమగ్రము | పత్రములు : | 135 |
| ప్రతి పరిమాణము | : 54.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 నుండి 7 |

ప్రారంభము :

శ్రీ సంశ్రయ మంగళగౌ రీ సంగమ విభవ పుణ్య రేఖా సంప
ద్భాసిత వక్షోవామాం గాసూత్రత చిత్ర మహిమ హరిహరనాథా.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

క. మునిజన వల్లభ యివ్విధ మున దేవవ్రతుడు శాంతి బొందిన క్రమ మె
ల్లను ధృతరాష్ట్రి మహేశుడు విని యెయ్యది యాచరించె వినుపింపు తగన్.

వ. అని యడిగిన జనమేజయ్యునకు వైశంపాయను డిట్లనియె.

క. అనిమిష నదీ తనూజుడు చనుటయు విని .... ... యు బోవం
బనిచెం దనయుని కడకు నతని విజయము కాంక్ష తన హృదయమున మొలవన్.

క. పనిచి కృత పడిన గాంగే యుని దెస నుమ్మలిక నాత డుల్లము నానా
ఘనతర చింతా భర మొం దిన గుందుచు నుండ కొన్ని దివసంబులకున్.

క. వ్యాస ప్రసాదమహిమం జేసి యుభయ సైన్య గత విశేషజ్ఞుండై
యాసంజయు డొక నాటి నిశా సమయమునందు కడు వెసం జనుదెంచెన్.

వ. ఇట్లు శిబిరంబున నుండియు సూతనందనుండు కరినగరంబునకు వచ్చి యంతఃపురంబున నున్న ధృతరాష్ట్రు నుచిత ప్రకారంబునం గనిన నమ్మనుజ వల్లభుండు అతనిం దన చేరువ నునిచికొని యాదరించి

చ. అమర నదీ తనూజు సమరావని గోల్పడి నాదు యోధవ
ర్గము మరి యెవ్వరిం గొని పరాక్రమదుర్దమ పాండు పుత్ర సై
న్యమునకు మార్కొ .... .... కౌరవు లేమి చేసి రా
సమయమునం బలప్రచయ సంఘటనం బెటులయ్యె జెప్పుమా.

క. అనిన విని సూత సుతుడి ట్లను నక్కురు నాథు తోడ నవహితమతివై
విను మంతయు జెప్పెద మన మున .... యడిగి .... .. భూపవరేణ్యా.

వ. దేవ వ్రతుండు దేవ భావంబు.... దిన యప్పుడు కురు పాండవు లతని పాలికి వచ్చుట యును। నా సమయంబున బుట్టిన విశేషంబులు.... నాడు నీ కెరింగించితి। నట్లు శర తల్ప గతుండైన శాంతనవుండు చెప్పిన హిత వచనంబు లాదరింపక.... సంరక్త నయను లగుచు యతని వీడ్కొని యట్లు సనిన కౌరవులు నాటి వేకువ నీకడనుండి యేను బోయి శిబిరంబు సొచ్చునవసరంబున.

ముగింపు :

ఉ. నీల గళుండు శంకరుడు నిత్యుడు సత్య....రూపు డుజ్జ్వల
త్కాల మహానల ప్రశమక ప్రచురామృత వృష్టి విస్ఫుర
ద్బాల శశాంక శేఖరుడు దైత్యకుల ప్రవిదారణ క్రియా
లోల పరశ్వధుండు సకలుం దకలంక ప్రియుండు శాంతికిన్.

వ. అని ప్రశంసించి కవ్వడి గనిన వాడు సర్వేశ్వరుండు భర్గుండని తేటపరిచి మఘ మథన త్రిపుర మర్దనాదులగు నద్దేవుని దివ్యలీల లుపన్యసించి, మహాదేవ పశుపతి శివ ప్రముఖంబులగు తదీయ భవ్య నామంబులకు బ్రవృత్తి నిమిత్తంబులగు నర్థంబులు నిర్వచనంబులు చేసి, యిట్టి పరతత్వంబైన పరమేశ్వరుండు నీకు వరదుండై సన్నిధి సేసెంగావున, పెన్నిధి గన్న పెద్దవోలె గృతార్థుండవైతి. వయ్యంధకాసుర భంజను రతంబున గడింది పగర లడంగుదురు. అయ్యాది మధ్యాంత రహితుండగు నాదిమ పరుం డివ్విధంబున వైరి వధం బాపాదింపంగ నీకు .... లుపు గొనుట సుకరంబయ్యె. నా తలంపు పెంపునం దొల్లి నీకు సన్నిహితుండై పాశుపతాది దివ్యాస్త్రంబు లొసంగె. .... .... యిత్తెరంగున భక్తి పరాధీనత్వంబు ప్రకటించె. నీవు పుణ్యాత్ముండ వప్పర మాత్ము నాత్మలో నిలిపి నమస్కరింపు. మాసర్వలోక శరణ్యుని శరణంబు సొరు. మక్కరుణాకరుండు శరణాగతులకు నాయురారోగ్యైశ్వర్యంబులు సకలాభిమతంబులు నిత్యత్వంబులుగా బ్రసాదించునని నిర్దేశించిన నయ్యర్జునుండు ప్రణామ పూర్వకంబుగా భక్తిరసాయత్తంబగు చిత్తంబున జంద్రధరు నెలకొల్పి సాంద్రానందంబనుభవించి, సాత్యపతేయు చరణ కమలంబుల కొరగిన నమ్మునీంద్రుం డయ్యింద్రనందను నభినం దించి. సుఖివిగమ్మని దీవించి, విజయంచేసెనని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రున కెరుంగించెనని జనమేజయునకు వైశంపాయనుడు చెప్పుటయు.

క. మునివర ద్రోణుని వృత్తము విని సంతుష్టుడనైతి వినువేడుక నా
మనమున దొట్రో నొదవెడు వినుపింపుము తగగ మీది వృత్తాంతంబున్.

వ. అని యడుగుటయు.

చ. అమర కిరీట కోటి కలితారుణ రత్న మరీచి మాలికా
సముదయ ఖేదనోల్లసన చారు పదాంబుజకాంతిమర్దదు
ర్దమ దనుసూను సంచయ విదారణ కృత్య విహార
నామహిత ధర్మ న్మాథ... కౌతుక విశ్రుత రక్షితా.

వినుత పద బాద రాయణ మునీంద్ర వాగమృత నిధి సముద్భూతాష్లో
దనకీర్తి సుధా కిరణా వినతాఖిల భద్ర కిరణ విశ్రుత కరుణా.

మాలిని:

అమృత మయ విలాసా యాగభోగాదివాసా
విమల హృదయ రమ్యా వీతరాగాది గమ్యా
కమలభవ నమస్యా గౌరవాధిక్య శస్యా
శమ పరిమళవర్తీ శాశ్వతానందమూర్తీ!

గద్య :

ఇది శ్రీ మదుభయ కవి మిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన ద్రోణ పర్వంబునందు సర్వంబును పంచమాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : క్రోధనామ సంవత్సర శ్రావణ బ. ౩ వరకు అయ్యవారి పల్లె కరుణం బుచ్చన్న కుమారుడు పుల్లయ్య వ్రాసెను.

గ్రంథమునందలి ప్రతి పత్రము క్రిమిదష్టమైనది. అచ్చటచ్చట గ్రంథము శైథిల్యముకలదు. ఇందు ౫ ఆశ్వాసములు గలవు.

సంజయుడు యుద్ధభూమికి పోయి మరలి వచ్చి యందలి వృత్తాంతము ధృతరాష్ట్రునితో జెప్పటతో నారంభమై, వేదవ్యాస మునీంద్రు దర్జునునకు పరమేశ్వరు మహిమ చెప్పటతో ముగిసినది.

# ఆంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2740 | కాల్ నెం | : టి 3—421 |
| ప్రతి | : తాళపత్రము—అసమగ్రము | పత్రములు | : 146 |
| ప్రతి పరిమాణము | : 42.5×3 సెం. మీ. | పత్రపంక్తులు | : 6 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము: విక్రమ సంవత్సర చైత్ర బహుళ ౧౧ ఆదివారం నాటి ఝాము సరికి ద్రోణ పర్వం బుత్తాడ అచ్చుతరాముడు వ్రాసెను.

ప్రతి అలతిగా క్రిమిదష్టమైనది. గ్రంథపాత మధికము. వ్రాత దోషము లధికముగా గలవు.

# ఆంధ్ర మహాభారతము
## ఉద్యోగ పర్వము
## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1585 | కాల్ నెం | : టి 3–475 |
| ప్రతి | : తాళపత్రము-అసమగ్రము | పత్రములు | : 108 |
| పత్ర పరిమాణము | : 37×3 సెం. మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము. నందన నామ సంవత్సర భాద్రపద శుద్ధ ౨ గురువార .... ద్రోణపర్వం బచ్చుగంగులు కొమారు .... శివ్వన్నభట్టు కింకన్నచేత వ్రాయించినాడు.

ప్రతి మిక్కిలి క్రిమిదష్టము. శైథిల్యము కలదు. గ్రంథపాతము కలదు. వ్రాత బాగున్నది. రెండు మూడు పత్రములు సగముభాగమువరకే వ్రాయబడి యున్నవి. 5 ఆశ్వాసములు గలవు.

# ఆంధ్ర మహాభారతము
## ద్రోణపర్వము
## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 263 | కాల్ నెం | : టి 3–450 |
| ప్రతి | : తాళపత్రము - అసమగ్రము | పత్రములు | : 61 |
| ప్రతి పరిమాణము | : 43×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 8 |

**విశేషాంశములు :**

ప్రతియందు గ్రంథపాత మధికముగా కలదు. ఇందు 5 ఆశ్వాసములు గలవు గాని ఏ యొక్క ఆశ్వాసము పూర్తిగా లేదు, వ్రాత దోషములు పెక్కు గలవు. దీనిని

ప్రత్యేక గ్రంథముగా పరిగణించుట కంటె ద్రోణపర్వమునందలి విడి పత్రములుగా పేర్కొనుట యుక్తము.

# ఆంధ్రమహాభారతము

## ద్రోణపర్వము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5888 | కాల్ నెం | : టి 3-481 |
| ప్రతి | : తాళపత్రప్రతి- అసమగ్రము | పత్రములు | : 186 |
| ప్రతి పరిమాణము | : 38×3.4 సెం. మీ | పత్రపంక్తులు | : 7 |

ఈ ప్రతియందు కొన్ని పత్రములు స్వల్పభాగములే మిగిలి యున్నవి. కొన్ని పత్రములు పై భాగము అడుగు భాగములు నశించిపోయినవి. మిగిలిన పత్రములు చాల వరకు క్రిమిదష్టమై చూర్ణమగుటకు సిద్ధముగా నున్నవి.

# ఆంధ్ర మహాభారతము

## ద్రోణ, కర్ణ పర్వములు

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3318 | కాల్ నెం | : టి 3-458 |
| ప్రతి | : తాళపత్రము–అసమగ్రము | పత్రములు | : 177 |
| ప్రతి పరిమాణము | : 45.5×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము: నలనామ సంవత్సర కార్తీక శుద్ధ ౧౦ ప్రారంభం చేసి పింగనామ సంవత్సర ఆషాఢ శుద్ధ ౭ నాడు సాయంకాలం వరకు సంపూర్ణంగా వ్రాయటం ఆయెను. ప్రతి విలేఖన కర్త శ్రీవత్స గోత్రజుడు, వెంకట రాఘవాఖ్యా శేఖర సుతుడు. వేంకటప్పయ నామధేయుడు.

ప్రతి అలతిగా క్రిమిదష్టమైనది. గ్రంథపాత శైథిల్యాది దోషములు లేవు. ద్రోణ పర్వం సంపూర్ణంగాను, కర్ణ పర్వములో ప్రథమాశ్వాసము సంపూర్ణంగాను ద్వితీయాశ్వాసమున సుమారు 50 పద్యముల వరకు గలదు.

# ఆంధ్ర మహాభారతము

## కర్ణపర్వము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 377 | కాల్ నెం | : టి 3-400 |
| ప్రతి | : తాళ పత్రము; అసమగ్రము | పత్రములు | : 74 |
| ప్రతి పరిమాణము | : 46×4 సెం.మీ | పత్రపంక్తులు | : 8 |

ప్రారంభము :

శ్రీ పరిణామ స్థితి వి ద్యా పారీణత్వ కారితా నిరతాపాం
.... రమ నైష్ఠికత్వ వ్యాపార పరాను రక్త హరిహరనాథా॥

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె। నట్లు మహా ప్రాజ్ఞుండగు సంజ.... దండున నుండి హస్తిపురంబున కరుగు దెంచి। ధృత రాష్ట్రి మందిరంబు ప్రవేశించి అంతిపురంబున నున్న యన్నరనాథునకు త .... గృత ప్రణాముండ గుటయు। నతం డాదరించిన నాసీనుండై

క. బల విక్రమములు వినుతం
బులుగా మన మొనలు బాండు పుత్రానీకం
బులు రెన్నాళ్ళు బోరుట
తెలియంగా జూచి వచ్చితిం గురునాథా।

వ. అని పలికి కర్ణు ప్రశంసించి।

చ. సరకు గొనండు పాండు సుత సైన్య నికాయము నించు కేనియున్
గరులు రథంబులున్ హరులు గాల్బల.... .... .... ........
మరలియు దూలియుం బిలుకు మాలియు నల్గడ బారియున్ విය
చ్చరులకు వేడ్కసేయు భుజసారము శౌర్యము జూపె నేర్పునన్।

వ. చూపి యక్కొం తేయుల గలంచి యాడి పదంపడి।

గీ. తనకు మిక్కుటయైన యర్జునుని బాహు లీల నెమ్మెయి ద్రోపంగ లేక తెగియె
నధిప యాబోతు బెబ్బులి కగ్గమైన పగిది యప్పాండవులకును పగయడంగె।

**ముగింపు :**

వ. చూచి తా నప్పుడు క్ర... ....సంపదలకు భాజనంబనై తినని యూరడిల్లి యుల్లాసంబున మరలె। నిట్లు కర్ణ సాగరంబు గడవనిది పాండు నందనులు పరమానంద ..........
జెప్పెనని జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె

చ. అనలుడు భాస్కరుండును సుధాంశుడు నధ్వర సంప్రవర్తకుల్
.... .... .... .... .... .... ....
ర్జునుడును కర్ణుడున్ సమర రూపమునం దగ నీ ప్రబంధ మిం
పొనర పఠించినన్ వినిన పొందుదు రెప్పుడు నెల్ల సౌఖ్యముల్ ।

వ. అనుటయు.

చ. .... .... .... ....
ప్రకర సమంచితా పరమ పావన మంజు జగత్త్రయా విధా
యక పరి రక్షక ప్రసర వారి నిజాంశ పాద ప్రకారమై
.... .... ....

మాలిని। కరు ... త్యాగ ....
... ....
నిరస కరుణాబ్జని ద తా రాజమానా
నిరంత, పరిణాహ నిర్భరానంద దేహా ।

**గద్య :**

ఇది శ్రీ మదుభయ కవి మిత్ర కొమ్మ ....పుత్ర బుధారాధన.... యాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబునందు కర్ణ పర్వంబునందు సర్వంబును తృతీయాశ్వాసము.

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము : కీలకనామ సంవత్సర పుష్య బహుళ యిందువారము మూడు ఘామ్ములవరకు అయినాది.

గ్రంథము క్రిమిదష్టమైయున్నది. పెక్కు పత్రములు శిథిలాస్థలో నున్నవి. మొత్తము 3 ఆశ్వాసములు గలవు. వ్రాతదోషములు గలవు. ఛందో దోషములు కూడ గలవు.

# ఆంధ్ర మహాభారతము

## కర్ణపర్వము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం. | : 1805 | కాల్ నెం. | : టి.3-409 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 160 |
| పత్రపరిమాణము | : 41.5 X 3 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

**ప్రతి విలేఖనము :**

నందననామ సంవత్సర భాద్రపద బహుళ ౧౪ శుక్రవారం సర్వేరాయప్రోలు వేంకటాచలం శ్రీ పొక్లపాడి రామచంద్రరాజుగారి కొమారుడు వేంకటపతిరాజుగారికి కర్ణపర్వం ప్రతినున్న క్రమానను వ్రాసియిచ్చెను.

ప్రతియందలి ప్రతిపత్రము మిక్కిలి క్రిమిదష్టమైయున్నది. గ్రంథపాతము కలదు. ప్రతి శిథిలావస్థలో నున్నది. ఇందు 3 ఆశ్వాసములు గలవు.

# ఆంధ్ర మహాభారతము

## కర్ణపర్వము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 2741 | కాల్ నెం | : టి 3-420 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము | పత్రములు | : 88 |
| ప్రతి పరిమాణము | : 35.5×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

గ్రంథము నందలి ఎడమ భాగము క్రిమిదష్టమై యున్నది. సుమారు పై భాగమున మూడు పంక్తుల భాగము, దిగువభాగమున రెండుపంక్తుల భాగము క్రిమిదష్టమైనది.

మూడవ ఆశ్వాసములేదు. రెండవ ఆశ్వాసాంతమున సుమారు 15 పద్యములు; ఆశ్వాసాంత గద్య లోపించినవి.

# ఆంధ్రమహాభారతము
## కర్ణ-శల్యపర్వములు
## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3286 | కాల్ నెం. | : టి 3-437 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము. | పత్రములు | : 190 |
| ప్రతి పరిమాణము | : 40×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 |

ప్రారంభము :

శ్రీ పరిణామ స్థితి వి ద్యాపరిణత్యుపకారితా నిరతాపాం
గా పరమస్త్రైష్ఠి కత్వ వ్యాపార పరానురక్త హరిహరనాథా॥

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె। నట్లు మహాప్రాజ్ఞుండగు సంజ యుండు దండునుండి హస్తిపురంబున కరుగుదెంచి ధృతరాష్ట్రు మందిరంబు ప్రవే సించి యంతిపురంబున నున్న యన్నరనాథుంగనుంగొని, కృతప్రణాముండగుటయు నతం డాదరించిన నాసీనుండై ।

ముగింపు :

వ. అనవుండు నతండు ప్రీతుండగుచు నగ్గురునందనునకు సేనాధిపత్యాభిషేకం బాచరించిన.

ఉ. అరథిరోత్తముం డధిక హర్షము బొందుచు నమ్మహీశ్వరుం
గారవమొప్ప గ్రుచ్చి యిరిగౌగిట జేర్చియుదాత్తసింహనా
దారవ మ్ముల్లసిల్లగ బ్రియంబుమెయిం గృపయాదవోత్తముల్
జేరి కెలంకులం జనగ జెచ్చెర నేగె నుదగ్రమూర్తియై ।

వ. అశ్వత్థామ కృప కృతవర్మలు మహోద్యోగంబున.

క. అరి నిరవశేష నిరసన, పరమానంద ప్రచరిత పాండవ పుత్రో
త్కర బాంధవ నికర పరి స్ఫురణాఢ్య తదీయ శిబిరమున కభిముఖులై.

వ. చని రట్లు ధృతరాష్ట్రునకు సంజయుం డశ్వత్థామోత్సాహంబు తెరం గెరుంగించెనని వైశంపాయనుండు చెప్పిన విని జనమేజయుం డట మీది వృత్తాంతం బెట్లయ్యెనని యడుగుటయు.

మ. శ్రుతివాక్యార్థమయప్రభాసముని సంస్తుత్యానుభావా శచీ
పతి ముఖ్యానిమిషాభివంద్య నిరసద్భావైక వేద్యా మహో
న్నత హేతుత్వ విరాజమాన చరణా నమ్రాపదుత్తారణా
సతతోన్నిద్ర వివేక భక్తి సులభా సంవిత్ప్రభా వల్లభా!

క. సిత నీలాదికవర్ణో ర్జిత వైకృత దూరమాన సేవ్య తదూరా
శత తర భవ సత్యవతీ సుతాది బుధమతి లతా ప్రసూనాకారా!

మాలిని।
స్ఫురిత వికచనాత్తః పద్మినీ శ్రేణికాసం చరణ పరిణతత్వాల్లాఘ నీయక్రమోద్య
న్మరు దుపగమలీలా మధ్య పూర్ణేందు బింబక్షరదమృత వికారోత్సారణానందరూపా.

గద్య :
ఇది శ్రీ మదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శల్య పర్వంబును ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : ఈ ప్రతి సర్వధారి సంవత్సర ఆశ్వయుజ బహుళ ౭ బుధ వారం రోజ్ను ఆరంభించి సర్వధారినామ సంవత్సర మాఖ శుద్ధ ౧౨ ఆదిత్యవారం సరిక్కి పూర్తయ్యెను. ప్రతి వ్రాసినవారు-పోతులపాటి నాయుడి కుమాళ్లు రాజనాయుడు పూర్వ ప్రతి నున్న క్రమానను ఆచంద్రార్కంగా చదువుకునే టందుకు శ్రీరామలక్ష్మణ భరత శత్రుఘ్న సమేత శ్రీరామచంద్రార్పణగా వ్రాసుకొనెను.

ప్రతి బాగుగా నున్నది. శైథిల్య పాతములు లేవు. వ్రాతదోషము లత్యల్పములు. ఇందు కర్ణ పర్వమున ౩ ఆశ్వాసములు, శల్యపర్వమున 2 ఆశ్వాసములు గలవు. ఈ రెం డాశ్వాసములు సంపూర్ణముగా గలవు.

# ఆంధ్ర మహాభారతము

## శల్య-సౌప్తిక పర్వములు

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 139 | కాల్ నెం | : టి 3-451 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము | పత్రములు | : 59 |
| ప్రతి పరిమాణము | : 41×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 |

ప్రారంభము :

క. పూనుము సేన పతిత్వము నా నమ్మినవారు నేను నరవరబల సం
తానంబుతోడ బరిజన మై నడచెద మాక్రమింపు మరి వర్గంబున్. (శ.1-83)

చ. అన విని శల్యు డిట్టులను నమ్మను జేంద్రున కిప్పు డింత ప్రా
ర్థన మొనరింపనేల వసుధావర యే నిను జేరినప్డు నా
ధనమును బ్రాణమున్ బలవితానము నీకు సమర్పణంబు చే
సిన యదిగాదె నీ పనుపు చేసెద కౌరవసేన గాచెదన్. 84

మ. భుజ వీర్యంబుల నచ్యుతార్జునులు నన్ బోరంగ లే రల్క వ
చ్చి జయింపంగ గణంగినన్ సురలునాచే నొత్తు రే నేచి య
క్కజపున్ జేవయు లావు జూపువడికిన్ గౌంతేయులున్ నోర్తు రా
ప్రజయు న్నిప్రజయున్ గలంగ చెలగం బాటింతు నాటోపమున్. 85

ముగింపు :

వ. ఇట్లు నకులసూనుండు సమసిన.

మహాస్రగ్ధర :

క్షతసేనుం డప్డు క్రోధస్ఫుర దరుణ మరీచుల్ దలిర్పంగ చక్షు
ర్ద్వితయంబుల్ గెంపునంబొందిన చెలువము.... ఘోరంబుగా బె
ట్టితనిం జంచద్గదన్ వ్రేయగ నురక రదాస్యచ్ఛదాస్ఫార కేళీ
చతురుండై యక్కుమారున్ జముకడ కనిచెన్ చండదోర్దర్పమొప్పన్. సౌ.1-187

వ. ఇత్తెరంగున వికృతాననుండైన సహదేవ సుతునిం జూచి రోషంబు పెంచి. 188

మహాస్రగ్ధర :

వితత జ్యానాద మాశావితతి నిలిచి దోర్వీర్య మేపార బాణ
ప్రతతిం దన్ముంప వీకన్ బలక జడియుచున్ బల్విడిన్ దంతి హేలా
తతి నశ్వంబుల్ పదాతుల్ దళన తర మృగేంద్ర క్రమస్ఫూర్తి దోపన్
శ్రుతకీర్తిన్ గట్టి కంఠత్రుటన విలసనారూఢి నవ్విప్రు డొప్పెన్. 189

వ. ఇట్లు ద్రౌపదీతనయ పంచకంబునం బంచత్వంబు నొందించిన క్రోధాతిరేకంబున ప్రభద్రకులును శాంతనవాంతకుండును ధృష్టద్యుమ్నాంతకుం జుట్టు ముట్టి. 190

చ. శరముల దోమరంబులను జక్రములన్ వెసగప్పి చేరి ము
ద్గర కరవాల కుంతముఖ దారుణ హేతుల నొప్ప నాత డు
ద్ధుర గతులం ప్రభద్రకుల ద్రుంచుచు కేలి యొనర్ప నా శిఖం
డి రుచిర మార్గణంబు భ్రుకుటీస్థలి నాటి వమద్భటోద్ధతిన్. 191

క. గురుసుతుడు క్రోధమయమగు
ఒరవసమున గదిసి యా....
.... .... ....
.... .... .... 192

**విశేషాంశములు :**

గ్రంథము శిథిలమై యున్నది. గ్రంథపాత మధికము. ఇందు రెండు పర్వములు గలవు. ఆ రెండు పర్వములు కూడ సంపూర్ణముగా లేవు. శల్యపర్వము, సౌప్తిక పర్వము రెండేసి ఆశ్వాసములు గలవు. ఈ ప్రతియందు శల్యపర్వములోని పత్రములలో గ్రంథపాత మధికముగా నుండుటచే రెండాశ్వాసములతో ప్రత్యేకించి గుర్తించుటకు వీలులేదు. ( గుర్తించిన సంఖ్య ఉ.వి.వి. ప్రతి లోనిది. )ఈ పర్వమునకు ఆద్యంతములు లేవు. ఇట్లే సౌప్తిక పర్వములో ప్రథమాశ్వాసమునకు సంబంధించిన పత్రములు కొన్ని గలవు. మిగిలిన పత్రములు లేవు. అందుచే ఈ ప్రతిని ప్రత్యేక గ్రంథముగా పేర్కొనుటకంటె ''శల్యసౌప్తిక పర్వములకు సంబంధించిన కొన్ని పత్రములు'' అనిన బాగుండును.

# ఆంధ్ర మహాభారతము

## సౌప్తికపర్వము

### తిక్కనసోమయాజి

ఆక్సెషన్ నెం. : 1804. కాల్ నెం. : టి.3-402

ప్రతి : తాళపత్రము; సమగ్రము పత్రములు : 92

ప్రతి పరిమాణము : 41 × 3.5 సెం.మీ. పంక్తులు : 6 నుండి 7వరకు

**ప్రారంభము :**

శ్రీ మత్కౌస్తుభరత్నో ద్దామారుణ రశ్మి భూత ధవళ మరీచీ
స్తోమ పరభాగ రమ్య మ హామహి మస్ఫురిత వక్ష హరిహరనాథా !

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె ।

గీ. సంజయుని చేత గురుసుతోత్సాహమిట్లు వినిన ధృతరాష్ట్రి డిట్లను వీరవర్య
డనగజాలు నశ్వత్థామయును సహాయ రథికులను విక్రమించిన క్రమము చెపుమ ।

వ. అనుటయు సూతసుతుం డమ్మనుజ పతికిట్లను । నివ్విధంబున గురుపతి యశ్వత్థామ నభిషేకంబు సేయించినం గృపాచార్యుండు గృతవర్మయు నా గురు పుత్రుతుత్సా హంబునకును ప్రోద్బలంబగు నుద్యోగంబునం బొదల నమ్మువ్వురు నమ్మహీపాలుండు పాండవులం బరిమార్చుటకు ... .... .... .... పనిపూని దక్షిణంబున ముట్టి, పడమట నున్న పాండవ శిబిరంబున కభిముఖులై చని రిత్తెరంగున నరిగి యివ్విట కనతి దూరంబుగా జని యారథికవరు లో.... .... ....

**ముగింపు :**

క. అమరులు భక్తిని గ్రతు భా గము నప్పరమేశ్వరునకు గల్పించి రతం
డు మనంబున బ్రీతుడై సమాహితుండయ్యె జగము సంతోషించెన్।

వ. ఇట్టి వద్దేవు....వ్య లీలలు యతండు గో .... భువనంబులు విధ్వంసంబు.... న్నుండైన సుఖత్వంబులు నగు। నబ్భూత నాథుండు గురుసుతునకు సన్నిహితుండయ్యె గావున నయ్యోధవరుం డొక్కరుం....శిబిరంబు సొచ్చి యి....న ప రాక్ర... రించెగాని...ఆరథి.

కుని శక్తి ప్రతాపంబుననైనదిగాదు, ఇది నీచిత్తంబున నిడం బనిలేదు. భీష్మ ద్రోణకర్ణ శల్యాదులైన మహావీరులం బోరుల బరిమార్పం దొరకొనుటయు, దర్ప దుర్దములగు ధృతరాష్ట్రి నందనాగ్రేసరులైన దుశ్శాసనుని, దుర్యోధనుని, బలంబు మెరయు వక్షోరక్త పానంబున, నూరుభంజనంబులం, బరిభూతులంజేసి ప్రతిజ్ఞా కరణ శోభనంబు నొంద సంభవించుటకు గారణంబైన భవదీయ మానుష యోగంబునకు, పరమానందంబు నొందుమని, యిట్లు గోవిందుండు ధర్మనందనునకు నాశ్వాసం బొన రించెనని జనమేజయునకు వైశంపాయనుడు చెప్పుటయును ।

మాలిని

అకలుష హృదయాభివ్యక్త సర్వోపయుక్తా సకల నిగమవేద్యా స్వస్తివిద్యోపవేద్యా
ప్రకృతి వికృతి తాపాప్రాప్త....ప్రదీప్తా ...తమయ విలాసా సుస్థిరానంద భాసా,

గద్య:_

ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమ యాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబునందు సౌప్తికపర్వంబు సర్వమున్న ద్వితీయాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతివిలేఖనము : మన్మథనామసంవత్సర భాద్రపద బహుళ ౬గురువారం సరికి ప్రతిలో నున్నక్రమంగా పెండేకట్ల వేంకట చలపతి వ్రాసెను.

ప్రతియందలి ప్రతిపత్రము క్రిమిదష్టమైనది. గ్రంథము కొలదిగా శిథిలమైనది. వ్రాత బాగున్నది. వ్రాతదోషములు స్వల్పము.

# ఆంధ్ర మహాభారతము
## స్త్రీ పర్వము
## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 709 | కాల్ నెం. | : టి. 3-401 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము | పత్రములు | : 55 |
| ప్రతి పరిమాణము | : 42×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 8 |

ప్రారంభము :

శ్రీ సాంగత్య విధాయి వి కా సోల్లాలిత కటాక్ష కరుణామయ మూ
ర్తీ సార బోధ పరిత వ్యాసాదిమనోవికాస హరిహరనాథా.

క. దేవా జనమేజయ జగ తీ వరుడు గుతూహలము మతిని ఖిలతేరం
గా వైశంపాయను వదనా వేశిత దృగ్విలాసుడై యిట్లనియెన్.

వ. తన సుతుండును మనసైన్యంబును బాండుసుతులచేత నట్లగుట సంజయువలన విని ధృత రాష్ట్రిం డెఖ్బంగి వర్తించె, నశ్వత్థామ కృప కృతవర్మ లా రాత్రిచేసిన పరాక్రమంబు తెరంగు దుర్యోధనున కెరింగించి పోయిరని వింటి, పదం పడి కరినగరంబు దెసకరిగి మగుడి రనుటయు నాకర్ణించితి వారలట యెవ్వ లనికిం జని రేల మగుడి రశ్వత్థామ కృష్ణ ద్వైపాయ నాశ్రమంబునకు బోవం దక్కిన యిరువురు నెందెందు పోయి రెవ్వి ధంబున ధర్మనందనుం డేమి యాచరించె నంతయుం బరిపాటిం దేటపడం జెప్పుమనిన నమ్మునివరుం డిట్లనియె.

ముగింపు :

అతడు మాకు నన్నయని మున్ను యెరుగంగ
గన్న గురుబలంబు గలగకుండ
మనము నట్టులైన మనుజ లోకమునన
కాదు నాకు నెదురు గలదె యెందు.

వ. అని విలాపంబు చేసి, విషాదాయత్త చిత్తంబున గోత్రనామంబు లుగ్గడించుచు, నమ్మార్తాండ నందనునకుం దిలోదక ప్రదానంబు చేసె తదనంతరంబ భీమార్జుననకుల సహదేవులు వివర్ణంబులగు వదనంబులతో నట్లు....వ్విధంబున గర్ణుండు పాండవాగ్ర జుండగుట యెరింగి వధూజనంబులు హాహాకారంబు లెసంగ నాక్రందించిరి। ధృత రాష్ట్రి....గాంధారీ కుంతీ పూర్వకంబుగా నతనికి నుదక కర్మం బాచరించె. అయ్యా జాత శత్రుండు రవిపుత్రు వలన సౌభ్రాత్రత్వంబునం బరిచారికా సమేతంబుగా దద్భార్యల రావించి యాతనికై యనేక విధ పుణ్యకర్మంబులు బ్రాహ్మణులకు భూరి దక్షిణలు ననుష్ఠించి కృతకృత్యతానందంబు నొంది సకలబంధు సహితంబుగా గంగా సముత్తరణం బాచరించె....యిట్లఖిల జనాభినందితుండగుచు ధర్మనందనుండు కర్ణుండు దమ యన్నయని యెరింగిన తెరంగు వైశంపాయనుండు జనమేజయున కెరింగించిన నజ్జనపతి యఖిల ధర్మ పరుండును, గురువంశవర్యుండును నగు నయ్యుధిష్ఠిరు నుత్తర వర్తనం బటు మీద నెట్లు చెల్లెనని యడుగుటయు—

మందాక్రాంతము :

వీణానాద ప్రతిమ నిగమావిర్భవత్పాద పుణ్య
శ్రేణీసంపాదిత సువిమలాశ్లేషనిర్లేప చిత్త
త్రాణ క్రీడా సకల సతతోత్సాహ వదివ్య ప్రభాగా
ప్రాణా పానాహరణ నిపుణ ప్రావణీయాను భావా।

క. త్వంతాహంతా నిరసన శాంతాంతఃకరణ యోగిజన విజ్ఞేయా।
చింతా సాగర మగ్న భ్రాంత జనానన్య పరమ భక్త విధేయా।.

మాలిని: భరిత వినయ చేతః పద్మ విజ్ఞానకేలీ
పరిమళ పరిపాక ప్రౌఢ సంకల్ప శాలీ
పరిణత కృత దూష్యద్భంగి భూతా విశాలీ
కరుణ భృత జగత్సంస్కర్తృతా నందశాలీ।.

గద్య :

ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ పర్వంబు నందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

ప్రతి విలేఖనము :

పరాభవ నామ సంవత్సర ఆశ్వీజ బహుళ ౧౦ ఆదివారం నాడు స్త్రీ పర్వం వ్రాసినాడు. గ్రంథ మంతిగా శిథిలమైనది. ఒక పత్రము మాత్రము పూర్తిగా శిథిలమైనది.

# ఆంధ్ర మహాభారతము

## స్త్రీపర్వము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 252. | కాల్ నెం | : టి3-425 |
| ప్రతి | : తాళపత్రము : సమగ్రము. | పత్రిపంక్తులు | : 7 నుండి 8 |
| ప్రతి పరిమాణము | : 45.5×3.5 సెం.మీ. | పత్రములు | : 24 |

విశేషాంశములు :

ఈ ప్రతి కొంత క్రిమి దష్టమై కొంత శిథిలమై యున్నది. ఇందలి లిపి చిన్నదిగ అస్పష్టముగ నున్నది. ప్రతి విలేఖనమున దోషములు, పాఠాంతరములు కలవు.

# ఆంధ్ర మహాభారతము

## స్త్రీపర్వము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5002. | కాల్ నెం | : టి3-428 |
| ప్రతి | : తాళపత్రము, అసమగ్రము | పత్రములు | : 11 |
| ప్రతి పరిమాణము | : 45X4 సెం. మీ. | పత్రి పంక్తులు | : 8 |

విశేషాంశములు :

ప్రతి యంతయు క్రిమి దష్టమై కొంత విషయ నష్టము జరిగినది. చివరి పత్రము తునుకలైనది. ప్రతి శిథిలావస్థకు దగ్గరగ నున్నది. ప్రతి విలేఖన దోషములు, కొన్ని అక్షర పద చ్యుతములు గలవు.

# ఆంధ్ర మహాభారతము

## శాంతిపర్వము

### తిక్కన సోమయాజి



ప్రారంభము :

శ్రీ సంక్రామణ నిపుణ వి లాస కటాక్షా నివృత్త లంపట చిత్తో
ల్లాసన దక్షా వేద వ్యాసవచో విభవ లక్ష్య హరిహరనాథా.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె। నట్లు సకల బంధుమిత్ర జనంబు లకు నుదకకర్మం బాచరించి, పాండవులు గంగాతీరంబున నశౌచిత్వంబపనయించుట కై యొక్క సమస్థలంబున బటకుటీర సంవిధానంబు సేయించి ధృతరాష్ట్ర విదుర సర్వ భరత భార్యా సమేతంబుగా నచ్చట మాసత్రయంబు నిలిచి రట్టియెడం గృష్ణ ద్వైపా యన నారద దేవల స్థాణు కణ్వులు మొదలుగా మునీంద్రు లనేకులు శిష్యవర్గ సమే తంబుగా ధర్మనందను సందర్శనంబునకుం జనుదెంచిన నజ్జననాథుండు ప్రత్యుత్థాన ప్రణామ పాద్యాసన కలనంబులం దత్కాలోచితార్చనంబులను నమ్మహాత్ములం ప్రీతులంగావించి కృష్ణానుజ యుక్తంబుగా వారల నుపాసించి యుండ వారలు బహు విధంబులగు ప్రియవచనంబుల నక్కురు వంశసత్తము సంభావించిరి। నారదుం డమ్మహ నీయ ద్విజులం గనుంగొని యక్కౌంతేయాగ్రజు తోడం దాను కుశలప్రశ్నంబులగు మాట లాడంగలవాడగుట వారి కెఱింగించి యమ్మహీపతి యాననం బాలోకించి।

శా. గోవిందుం డనిశంబు. . . . ....గోరంగ పార్థుండు ద
ర్పావేశోజ్జ్వల బాహుసార మహనీయస్ఫూర్తి సంశోభి గాం
డీవోల్లాస విభాసియై సమర పాండిత్యంబు పాటింప సం
భావింప న్జగమెల్ల రాజ్యమిటు లొప్పన్గొంటి రాజోత్తమా।

ముగింపు :

వ. ఆనిన విని భృగుండు పద్మిని కిట్లనియె ।

తే. భోగి వరయిది యిట్టిద భూతములును నీవు నేనును సర్వగతా విశిష్ట
విధములము వేది తవ్యంబు విదితమయ్యె యిట్టి సందర్శనము వ్రత మింక నాకు ।

క. ఈ విధమునె........ భావింపం గంటి నీ కృపారతివలనన్
నీవు కృతార్థుడవు సుజన సేవిత యామంత్రణంబు చేసినవాడన్ ।

వ. అని పలికి నవ్విధంబున కృత నిశ్చయుండై భృగుండు భుజంగ విభుని పీడ్కొని దీక్షావిశేషకాంక్షజేసి భార్గవ ........ నందనునిం గాంచి నిజవృత్తాంతంబు చెప్పి తత్కృత సంస్కారంబున కృతకృత్యుండయ్యె । నీపుణ్యకథ భార్గవుండు జనక సదనంబున నారదునకు వివరించె। నద్దేవమునివరుండు దేవతావరునికి వినిపించె। నమ్మహాత్ముండు వసువులకుం జెప్పె। .... .... సంగ్రామంబున నుద్దామ చిత్తుండైన నన్నుం దేర్చుటకై వసువులు సకల భూత సమాదరంబైన యా యితిహాసంబు నాకుం జెప్పిరి। నీవు పరమ ధర్మం బెయ్యదియని యడిగిన నేను నీకుం జెప్పితి। సర్వసమతా సముపహితంబైన ........తమంబు। నిరతిశయానందంబునకు నిధానంబయ్యె।

క. అని యిట్లు ధర్మసుతునకు ననిమిష తటినీ తనూజుడధిక ప్రమదం
బున జెప్పుట వైశంపా యనుండు జనమేజయున కర్థిన్ జెప్పెన్.

వ. అనినవిని జనమేజయుండు వైశంపాయనునితో నిత్తెరంగున పితామహుండు హితోప దేశంబు చేసిన నమ్మహీశుం డెవ్విధంబు దశావిశేషంబులం బొందె। మునీంద్రా చెప్పవే యనుటయు.

ఉ. ఆగమ పుష్పసౌరభ శుభాంగ నిదాన బుధాంతరంగ వి
ద్యా గృహమేధితా సుభగతామహనీయ ....నీయ ని
ర్భోగ సుబోధ సంపద నిరూప్య సుసంవిదవాప్య భక్తి ల
క్ష్మీ గురు నిత్యయోగి జనసేవిత శాంతి సుఖైక భావితా ।

క. అభిమత ఫల సంపాదన విభవ మహీయః ప్రసాద విస్మృత వేదా
బుభు విభవ లోచనాంబుజ శుభతర చిత్వామతిత్వ శుభగహరిత్వా.

మాలిని: వరబుధజనుత వేదవ్యాస విశ్వాత్మ భాసా
నిరుపమ తనులీలా నిత్యసత్యానుకృత్యా
నిరతిశయ సమత్వోన్నిద్ర కారుణ్యభద్రా
భరిత భువన వర్గా భాస్వరానంద మార్గా।

గద్య. ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శాంతి పర్వంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

**విశేషాంశములు:**

గ్రంథము స్వల్పముగా క్రిమి దష్టమైనది. ప్రతి చక్కనిది. వ్రాతదోషము లల్పములు.

# ఆంధ్రమహాభారతము

## శాంతి పర్వము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 427 | కాల్ నెం | : టి3-474 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 377 |
| ప్రతిపరిమాణము | : 42×3.7 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము : ఈ శాంతి పర్వం మహారాజ రాజాధిరాజ శ్రీ రాజా భైరి సవ్వాయి జనంపల్లి రామకృష్ణరాయ భూపాలునకు గడివేముల రామన్న వ్రాసినది.

గ్రంథము క్రిమిదష్టమై ఎడమభాగము కొంత శిథిలమైనది. గ్రంథపాతము లేదు. వ్రాతబాగున్నది.

# ఆంధ్ర మహాభారతము

## శాంతిపర్వము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 612 | కాల్ నెం | : టి 3-435 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము | పత్రములు | : 148 |
| ప్రతి పరిమాణము | : 46×4 సెం. మీ. | పత్రి పంక్తులు | : 8 |

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము :– శార్వరి నామ సం॥ జ్యేష్ఠ బ ౩ గురువారం రోజు సరిక్కి శాంతిపర్వం సంపూర్ణంగా వ్రాయనయ్నిది.

ఈప్రతి కొంత క్రిమిదష్టమై అటనట కొన్ని యక్షరములు లోపించినవి. లిపి స్పష్టము. ప్రతివిలేఖనమున స్వల్పదోషములు గలవు.

# ఆంధ్రమహాభారతము

## శాంతిపర్వము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 428 | కాల్ నెం | : టి 3-412 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము | పత్రములు | : 191 |
| ప్రతి పరిమాణము | : 44×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు ౧౭౩౭ ఏవం ప్రవర్తమాన వ్యవహారిక చాంద్రమానేన మన్మథనామ సంవత్సర ఆశ్వీజ శుద్ధ ౧౦ గురువారం

వరకు మహారాజ రాజశ్రీ జనంపల్లి సర్వాయిరాయకిసమ్మదేశాయిగారి............పోష్య వర్గుడు ముంగర నర్సన వ్రాసి యిచ్చిన శాంతిపర్వం.

గ్రంథము అలతిగా క్రిమిదష్టమైనది. గ్రంథాంతము శిథిలావస్థలో నున్నది. ఇందు 6 ఆశ్వాసములు గలవు.

## ఆంధ్ర మహాభారతము

### శాంతిపర్వము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 474 | కాల్ నెం | : టి 3-431 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పుటలు | : 67 |
| ప్రతి పరిమాణము | : 35.5×3 సెం. మీ. | పత్ర పంక్తులు | : 9 |

విశేషాంశములు :

గ్రంథము మిక్కిలి శిథిలావస్థలో నున్నది. గ్రంథపాత మధికము. పెక్కు పత్రములు శిథిలములై యున్నవి. గ్రంథము మొత్తమెంత భాగము కలదో పేర్కొనుట కష్టము. గ్రంథాద్యంతములు లేవు. ఏ ఒక్క ఆశ్వాసము సంపూర్ణముగా లేదు.

## ఆంధ్ర మహాభారతము

### శాంతిపర్వము

### తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 731 | కాల్ నెం. | టి. 3-418 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 127 |
| ప్రతి పరిమాణము | : 46.5× 4 సెం.మీ | పత్రపంక్తులు | : 10నుండి 11 |

విశేషాంశములు :

గ్రంథము క్రిమిదష్టమై అధికభాగము శైథిల్యము పొందినది. పెక్కు పత్రములు ఎడమభాగమున విరిగియున్నవి.

ఇందు 5 ఆశ్వాసములు పూర్తిగా పైన పేర్కొనిన లక్షణములతో నుండి 6వ ఆశ్వాసమున సుమారు 300 పద్యములవరకు గలదు. వ్రాత దోషము లధికము. ఒక్కొక్క పత్రమునకు సుమారు 10 పంక్తులు వ్రాయబడి యుండుటచే చదువుట కొంచెము కష్టము.

# ఆంధ్రమహాభారతము

## శాంతిపర్వము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | . 3977 | కాల్ నెం | : టి3-464 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 156 |
| ప్రతిపరిమాణము | : 38.5×3.8 సెం.మీ | పత్ర పంక్తులు | : 8 |

**విశేషాంశములు :**

**ప్రతివిలేఖనము :**

సిద్ధార్థినామ సంవత్సర పుష్యశుద్ధ 10 వరకు సమాప్తిగా వ్రాసిన శాంతిపర్వంబు.

గ్రంథమునందు పెక్కుపత్రఖండములు లోపించినవి. అచ్చటచ్చట శిథిలమైయున్నది. వ్రాతదోషము లంతగా కానరావు.

# ఆంధ్ర మహాభారతము

## శాంతి, ఆనుశాసనిక పర్వములు

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 366 | కాల్ నెం | : టి. 3-397 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 96 |
| ప్రతి పరిమాణము | : 49×4 సె.మీ. | పత్ర పంక్తులు | : 7 నుండి 8 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు రెండు పర్వములు గలవు.

1. శాంతిపర్వము 2. ఆనుశాసనిక పర్వము. శాంతిపర్వమునందు 2 ఆశ్వాసములు గలవు. అవి, 5. 6 ఆశ్వాసములు. 5వ ఆశ్వాసము అసమగ్రము.

ఆనుశాసనిక పర్వమునందు 5 ఆశ్వాసములు గలవు. కాని అన్నియు అసమగ్రములే.

ప్రతియంతయు క్రిమిదష్టమైనది. గ్రంథపాత మధికముగా గలదు. అచ్చటచ్చట గ్రంథశైథిల్యము గలదు. వ్రాత స్పష్టతలేదు. వ్రాత దోషము లధికము.

# ఆంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 426 | కాల్ నెం | : టి 3-415. |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 166 |
| ప్రతిపరిమాణము | : 35×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

ప్రారంభము :

క. శ్రీమత్కటాక్ష రోచి స్తోమ సముల్లాస విహిత సుస్థిర లక్ష్మీ
భూమానందిత భక్త వ్యామోహ విదూరయుక్త హరిహరనాథా !

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దివ్య పరిజ్ఞాన దేదీప్య మానుండైన దేవవ్రతుండు వివరింప వివిధంబులగు ధర్మంబు లాకర్ణించి యజాతశత్రుండు సభక్తిక ప్రణామం బాచరించి వినయ విశేషభాషితుండై

సీ. అనఘ నా దగు చిత్తమునకు శమంబు గావించుటకై నీవు వివిధ విశద
భంగుల బరమ కృపా నిరతుండవై సకల ధర్మోపదేశముల జేసి
తిమ్మెయి జెప్పగా నించుక యేనియు శమము లేకున్నది సకలము కొని య
నేక బంధుల వధియించితి యొక్క తలయు నీ కలిగిన దారుణత్వ

ఆ॥ మొక్క తలయులైన యుగ్ర కరంబులు చిత్త వృత్తి దవిలి యుత్తలంబు
చేయు శాంతియెట్లు సిద్ధించు ముని మాన నీయమింక నేమిసేయువాడ !

వ. దుర్యోధనుం డతి లోభంబున నాతో బంచి కుడువ నోడం బడడయ్యె! యేనును చెట్టి
చేసితి !....బున నతనికి రాజ్యం బిచ్చి తొలంగి నిలువక మాయిద్దరి కతంబున నింత
వుట్టె బశ్చాత్తాపం బే పాటను ద్రావుపడదయ్యెడు.

ముగింపు :

గీ॥ అంతవాడు శిఖండిచే నట్టులగుట గనియ బెక్కు వరయులుగా కరయ నునికి
కతన చేసి వజ్రమయంబుగా నోపు నని దలంచెదనా చిత్త మన్నలార.

వ. అనిన విని యద్దేవకీనందనుం డిట్లనియె !

తే॥ నీవు శోకంబు దక్కుము నీ సుతుండు పరమ గతినొంది శాపాను ప్రాప్తి చేసి
.... నీవు మర్త్యుడై వర్తించె నసదృశ ప్రభావు డాతండు వగపేల దేవి నీకు ।.

చ। అతని శిఖండి యేల యమరాధిపుడున్ సమయింప చాలునె
యతడు నిజేచ్ఛ చేసి నరు నంచిత దివ్య శరంబు లంగసం
గతముగ చేసి పాన్పుగ సుఖస్థితి మృత్యువు మాన్చి యుండి కీ
ర్త్యతిశయ మొంది తావలచినప్పుడు పోయె విషాద మేటికిన్ ।.

వ. అని యూరడిల్లం బలికిన కృష్ణద్వైపాయన మునివరుండును, పరమాదరణీయ
తత్పర వచనంబుల నద్దేవికి నానందం బాపాదించె। తదను.... యాత్మీయ సలిల
సాంగత్యంబు నొందు నమ్మందాకినిచేత కృష్ణాదులగు నందర జనపతులు ననుజ్ఞాతులు
నాశీర్వాద ప్రీతులై మునుల తోడ నడవనది వెడలినని యిట్లు భీష్మవృత్తాంతంబు
వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పిన నత్తాతకు వలయు వాదానం బాచరించి
చరితార్థుండైన, యెడ పాండవ ముఖ్యుండు మరియెట్టి.... రితంబునం ప్రవర్తించె
మునీంద్రా యెరింగింపవే యనియడుగుటయును ।.

చ. సకరుణ దివ్య చిత్త పరిశాంతి మహత్వని ధాన విత్తని
ర్వికృతి విలాసహృద్య....విస్తరీ విస్ఫురణైక వేద్యపా
వక బహు భవ్యనామ పరివర్ధన సంక్షయ దూరధామవి
శ్వకలిత పోషణా శుభగ సాత్యవతేయ వచో విభూషణా ।

క। సత్సేవ్య చరణ శమవ ద్వాత్సల్యాభరణ ధర్మతత్వోద్ధరణా
హృత్సంభవ భక్తిక దురితోత్సారణ ధుర్య దృఙ్మయూఖాస్త్రరణా ।.

మాలిని :

స్మయవిరహిత పూజ్యా మంత్ర గీతాది రాజ్యా
నయన హిమగు సూర్యా నైష్ఠిక క్షేమధుర్యా
దయిత భువన రక్షా దాంతి సిధ్యత్సమక్షా
నియమ నికట వర్తీ నిష్కళానందమూర్తీ !

గద్య :

ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజిత తిక్కన సోమయాజి ప్రణీతంబైన యనుశాసనిక పర్వంబునందు సర్వంబును పంచమాశ్వాసం॥.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : ఏవం ప్రవర్తమానస్య వ్యవహారిక చాంద్రమాన క్రోధి నామ సంవత్సర మాఘ బహుళ ౧౭ గురువారం వరకు ముంగర అప్పయ పౌత్రుడు నర్సియ పుత్రుడు సీతారాముడు సవ్వాయి భైరి రాయ కోసం దేశాయి బహదరు గారికి అనుశాసనిక పర్వం వ్రాసి యిచ్చినది.

ప్రతి చక్కనిది. వ్రాత బాగుగానున్నది. క్రిమిదష్ట గ్రంథ శైథిల్యాది దోషములు లేవు.

ఇందు 5 ఆశ్వాసములు గలవు.

# ఆంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 353 | కాల్ నెం | : టి. 3–416 |
| ప్రతి | : తాళపత్రము, అసమగ్రము | పత్రములు | : 218 |
| ప్రతి పరిమాణము | : 47.5×3.5 సెం.మీ. | పత్రి పంక్తులు | : 5. |

**విశేషాంశములు :**

గ్రంథము బాగుగానున్నది. వ్రాతదోషములు కలవు. ఆఖరి పత్రము రెండుగా విరిగియున్నది. ఇందు 5 ఆశ్వాసములు కలవు.

ఇందు భారత కథ గౌతమీలుబ్ధక సర్పమృత్యుకాల సంవాదమునుండి భీష్ముని మరణముచే దుఃఖితయగు గంగను కృష్ణ ద్వైపాయను డోదార్చుటవరకు గలదు.

# ఆంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక-అశ్వమేధపర్వములు

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1801 | కాల్ నెం | : టి 3-417 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము | పత్రములు | : 183 |
| ప్రతిపరిమాణము | : 45.5×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 8 |

**విశేషాంశములు :**

ఈ ప్రతి యందు రెండు పర్వములు గలవు.

గ్రంథము శిథిలావస్థలో నున్నది. గ్రంథము నందలి ప్రతి పత్రము, ప్రతి పంక్తి ఇంచుమించుగా ప్రతి అక్షరము క్రిమిదష్టమై యున్నది. అందువలన ఈ గ్రంథము ప్రయోజనకారిగా తోపదు. వ్రాత దోషములు గలవు.

# ఆంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 2742 | కాల్ నెం | : టి.3-422 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 85 |
| ప్రతి పరిమాణము | : 44×4 సెం.మీ | పత్రపంక్తులు | : 8 నుండి 10 |

**ప్రారంభము :**

క. శ్రీనామక పార్వత్యభి ధానక మాదు .... .... తత్త్వాశ్లే....
పానిరత నిరంత .... .... ద్రానంద ప్ర .... .... హరిహరనాథా

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు మరనదీనం....ను....కునుదక కర్మంబాచరించి ధర్మనందనుండు ధృతరాష్ట్రపురస్సరంబుగా భాగీరథి యుత్తరించి తత్తీరంబున.

ఉ. ఉమ్మలికంబునన్ బొగులు నుల్లములో బరి లోచనంబులన్
గ్రమ్మగ నశ్రు వారి ధృతిగౌరవమేది మహోగ్ర పాత పా
తమ్మున మ్రొగ్గు....నిక విధంబున నేలకు వ్రాల బట్టె వే
గమ్మ వృకోదరుండు మురఘస్మహు పంపున నమ్మ....శ్వరున్ !

పట్టియతడు....నదుపై చీరయాస్తర ణంబుగాగ భూతలంబు నందు
బెట్టె మానసములు పెద్దయు నలుదురి యర్జునాది సోదరాలి బొదివె।

వ. కృష్ణుం డుచిత వచనంబుల నాభూపాలు ప్రబోధించి నప్పుడు ధృతరాష్ట్రుండు గదిసి గూర్చుండి యక్కురు పతితోడ

సీ. క్షత్ర ధర్మంబున గై కొంటి మేదిని యుమ్మలికింపక లెమ్ము వత్స
యనుజ వర్గము నీవు ననుభవింపుము శోక కాలంబుగా .... యేలవగవ
నని పల్కి విదుర హితాలాపములు దను వినకుండుటయు సుయోధనుని కీడు
నా దుష్టబుద్ధి దా ననుచరింపగ ధర్మ మెడలిన కతమున నింతపు....

ఆ. ఆనియు దెలియనాడి తనకు గాంధారికి వగల మిగుల బొగల వలయుటయును,
నుగ్గడించి మమ్ము నొంటి వగవగనుం గొనక వంత దీర్పుమనియె నధిపా ।.

ముగింపు :

నీ వేమి....ప్పు చేసితి ద్రోవుమ శంకా భయంబు దొల గగసంక
ల్పావిలతకు నలుగుట పితృ దేవతలకు గలుగు బొమ్ము దిగ్గన ననుడున్ ।

వ. ప్రీతి నా భూతంబతర్థానంబు చేసె దదనంతరంబున జమదగ్ని నిజపితృ దేవతలు గోపించి పొడ చూపిన యతనితో నీవు శ్రార్థంబునకు సంకల్పించియుండి తద్వైకల్యంబు- బుట్టిన నూరకుండితని పలికి ముంగిపై బుట్టుమని శపించిన నతండు వారలకు దండ ప్రణామంబు చేసి తపస్వికి నలుకం దగదనియ....ధం బల్పంబని క్రోధాది దైవ తంబునకు నలుగనైతి.

గీ. తప్పు సైరించి నన్నుదయ జూచి శాపమో క్షము ననుగ్రహింపు డమిత తేజు
లారయ....నీ తలం పటుండగుచు ప్రా ర్థించుట....వా....దెలివి నొంది ।

వ. విదగ్ధ విప్రసమూహంబుతోడంబడునట్టి యుచిత వాక్యంబుల యెన్నండేని మహా ధర్మంబు గీడని యాడితినా.... నీకు శాపమో.... గునని నిర్దేశించి రత్నకులంబును, సక్తుప్రస్థుని కతంబునం దగిన మాటల నత్తెరంగున సదస్యులతో ధర్మనందను నశ్వమేధంబు నాక్షేపించి విగత శాపత్వా వందం .... .... ర్థితుండయ్యెనని యిట్లు జనమేజయునకు వైశంపాయనుండు పాండవాగ్రజు నశ్వమేధంబు విస్తార ప్రస్తాప- నీయంబుగా వివరించుటయు,

శా. భక్తిస్మేర మునీంద్ర చిత్తకమల ప్రస్ఫీత సౌరభ్యసం
యుక్తా గూఢతర ప్రకాశతనుతాపోల్లా....రాగాది ని
ర్ముక్తైకాంతజనైకతారసిక చిన్ముద్రా....వోన్నిద్ర ధీ
శక్తిస్వైర విహార దూరలసితా సద్భావనోన్మిలితా ।

క. అజరామర పదకరపద భజనా సంసార జలధి పారీణస్తో
త్రజనా సమూర్తి దైవిక యజనా పర్యాంతనాది కార్థవ్యజనా ।

మాలిని: త్రియుగ కమలపీఠీ దీప్తి సంచారలీలా
నియమిత పవనాత్మాగ్మి ప్రభాస్నిగ్ధ సంగా
స్మయవికచ మహాబ్జస్ఫార మాధ్వీకధారో
దయ....మధుకత్వా ద....తానందితాత్మా ।

గద్య :

ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమహా....రతంబు నశ్వమేధ పర్వంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము.

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము :

ఈ ప్రతిని శ్రీపూసపాటి సీతారామరాజు గార్కి నడిమించి చిన్న నరసింహులు భారత అశ్వమేధ పర్వం వ్రాసి యిచ్చెను.

గ్రంథమందలి ప్రతిపత్రము మిక్కిలి క్రిమిదష్టమైయున్నది. ఇందు 4 ఆశ్వాసములు గలవు.

ఈ ప్రతి, శోక తప్తుడైన ధర్మరాజును కృష్ణాదులు ప్రబోధించుటతో ప్రారంభమై జమదగ్ని మహాముని పితృదేవతల శాపంబునకు గురి అగుట, శాపమోక్ష ప్రకారము వరకు గలదు.

# ఆంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము

## తిక్కన సోమయాజి

| | | |
|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 356 | కాల్ నెం :టి 3-399 |
| ప్రతి | : తాళపత్రము, అసమగ్రము | పత్రములు : 61 |
| ప్రతి పరిమాణము | : 43×4 సెం.మీ | పత్ర పంక్తులు : 8 |

విశేషాంశములు :

ఇందు అశ్వమేధ పర్వమునందలి మొదటి 96 పద్యములు, చివరి 80 పద్యములు నష్టమైనవి. ప్రతి 10 వ పత్రము నుండి ప్రారంభమైనది. ఇందు నాలుగు ఆశ్వాసములు ఉన్నవి, కాని అవి పూర్తిగాలేవు.

ప్రతి క్రిమిదష్టమై, కొంత శిథిలావస్థయు నొందినది. లిపి స్పష్టముగ లేదు. అక్షరములు సరిగా దృగ్గోచరములగుటలేదు. భాషాదోషములును గలవు.

# ఆంధ్ర మహాభారతము

## అశ్వమేధ,ఆశ్రమవాసపర్వములు

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 357 | కాల్ నెం : | టి 3—398 |
| ప్రతి | : తాళపత్రము,అసమగ్రము. | పత్రములు : | 51 |
| ప్రతి పరిమాణము | : 45.5×4.5 సెం.మీ | పత్రపంక్తులు : | 10 |

విశేషాంశములు :

ప్రతి అంతిగా క్రిమిదష్టమైనది. కొంత భాగము శిథిలావస్థలో నున్నది. గ్రంథాది లుప్తమైనది. గ్రంథపాతముగలదు.

అశ్వమేధపర్వము మొదటి ఆశ్వాసమున సుమారు 31 పద్యములు లోపించినవి. తక్కిన 3 పర్వములు సమగ్రము. ఆశ్రమవాస పర్వమున రెండవ ఆశ్వాసములేదు.

# ఆంధ్ర మహాభారతము

## సౌప్తిక, స్త్రీ, అశ్వమేధ ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు

## తిక్కనసోమయాజి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 3297 | కాల్ నెం : | టి 3-438 |
| ప్రతి | : తాళ పత్రము ; సమగ్రము | పత్రములు : | 248 |
| ప్రతి పరిమాణము | : 40.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు : | 7 |

**ప్రారంభము :**

శ్రీ నామక పార్వత్యభి ధానక మాధుర్య ధుర్య తత్వాశ్లేషో
పానిరతనిరంతరసాంద్రానంద ప్లావితాత్మ హరిహరనాథా।

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె। నట్లమరనదీ నందనునకు నుదక కర్మం బాచరించి ధర్మనందనుండు ధృతరాష్ట్రి పురస్సరంబుగా భాగీరథి యుత్తరించి తత్తీర ప్రదేశంబున.

**విశేషాంశములు:**

ప్రతివిలేఖనము :

[అశ్వమేధ పర్వ ప్రారంభము] బహుధాన్య నామసంవత్సర కార్తీక బహుళ ౨ వ్రాత ఆరంభమై, [స్వర్గరోహణపర్వం వరకు] బహుధాన్య నామ సంవత్సర పుష్య శుద్ధ ౧౩ శనివారం సర్కి పోతుల పాత్రినాయుడు కుమాళ్ళ రాజన్న వ్రాసెను.

సౌప్తిక పర్వం, స్త్రీ పర్వములు, మార్గశిర బహుళ ౧ బుధవారం వరకు పోతుల పాత్రినాయుడు కొమాళ్ళ రాజన్న శ్రీకృష్ణార్పణంగా వ్రాసెను.

ప్రతి చక్కనిది. గ్రంథశైథిల్యాది దోషములు లేవు. వ్రాత బాగున్నది. వ్రాత దోషములు అల్పము.

ఈ ప్రతియందు—

అశ్వమేధ పర్వం 4 ఆశ్వాసములు, ఆశ్రమ వాస పర్వం 2 ఆశ్వాసములు, మౌసల, మహా ప్రస్థాన, స్వర్గారోహణ పర్వములు ఒక్కొక్క ఆశ్వాసము గలవు.

అటు పిమ్మట, సౌప్తికపర్వం 2 ఆశ్వాసములు, స్త్రీ పర్వం 2 ఆశ్వాసములు గలవు.

199 వ పత్రమునందు వ్రాతలేదు. గాని సంఖ్యాసూచి మాత్రము గలదు. ఇందు వలన గ్రంథభాగమేమియు లోపించలేదు.

మొత్తము మీద ఈ ప్రతియందు 7 పర్వములు సంపూర్ణముగా గలవు.

# ఆంధ్ర మహాభారతము

## అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3320 | కాల్ నెం | : టి 3-455 |
| ప్రతి | : తాళపత్రము, సమగ్రము | పత్రములు | : 129 |
| ప్రతి పరిమాణము | : 46×3.5 సెం మీ. | పత్ర పంక్తులు | : 7 |

**ప్రారంభము :**

శ్రీనామక పార్వత్యభి ధానక మాధుర్య ధుర్య తత్వశ్లేషో
పానీత... ర సాం ద్రానంద ప్లావితాత్మ హరిహరనాథా।

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె। నట్లమర నదీనందనునకు నుదక కర్మంబు లాచరించి, ధర్మనందనుండు, ధృతరాష్ట్ర పురస్సరంబుగా భాగీరథియుత్త రించి తత్తీర దేశంబున.

ఉ. ఉమ్మలికంబునం బొగులు నుల్లముతో బొరి లోచనంబులం
గ్రమ్మగ నశ్రువారి ధృతి గౌరవ మేద మహోగ్రబాణ పా
తమ్మున మొగ్గ నేనుగు విధంబున నేలకు వ్రాలబట్టవే
గమ్మ వృకోదరుండు మురఘస్మరు పంపున నమ్మహీశ్వరున్।

ఆ. పట్టియతడు తనదు పైచీర యాస్తర ణంబు చేసి భూస్థలంబునందు
బెట్టె మానసముల బెద్దయు నలదురి యర్జునాది సోదరాలి బొదివె ।

వ. కృష్ణుం డుచిత వచనంబుల నాభూపాలుం బ్రబోధించె। నప్పుడు ధృతరాష్ట్రుండు
కదిసి కూర్చుండి యక్కురుపతితోడ ।

సీ. క్షత్రధర్మంబున గైకొంటి మేదిని యుమ్మలింపక నీవు లెమ్ము వత్స।
యనుజవర్గము నీవు ననుభవింపుము శోక కాలంబు గాదిది యేల వగవ
నని పల్కి విదుర హితాలాపములు తాను వినకుండుటయు సుయోధనుని కీడు
నా దుష్టబుద్ధి దా ననుసరింపగ ధర్మ మెడలిన కతమున నింత బుట్టె

ననియు దెలియ నాడి తనకు గాంధారికి వగలు మిగుల బొగుల వలయుటయును
నుగ్గడించి మమ్ము నొంటిపగ్గుల గనుం గొనుము వంతదీగ్పు మనియె నధిప।

ముగింపు :

.... భక్తి పఠించిన శ్రీయు నాయువున్
భూరి యశంబునుం బ్రమదమున్ దృ....విద్యయు గల్గు వారికిన్
గోరికయైన వేగ నొడగూడును పుత్రుల గాంచు స .... రున్
గారవమొప్పగా బడయు గర్భిణియున్ వరుసం .... ....।

.... ర శుభ సిద్ధులు పొందు ననేక జన్మ పా
పక్షపణంబునన్ వెలుగు భారత సంహితకెల్ల బుండరీ
కాక్షుని వాసుదేవు ప్రకటార్థముగా వినగోరు మానవుం
డక్షయ సౌఖ్య సత్వమునయందు రమించు నిరామయస్థితిన్.

.... .... భారతార్థముం
భాసితమైన యట్టి నుతభాగ్యునకున్ సకలాగమార్థ సం
వాసన మావహిల్ల జనపంక్తులు .... న సేయ శశ్వ దు
ల్లాస ముఖానుభూతి నచలస్థితి నొప్పు నతం డుదాత్తుడై .

వ. అని యిట్లు .... ....

చ. పరమ పదాప్తి హేతువగు భారత సంహిత శౌనకాది భూ
సురవరు లింపునం గరగు చొప్పున జెప్పిన వారు మోద సం
భరితత నొంది యక్కథ .... తిగ నర్చితు జేసి రర్మిలిన్
హరి ... ... జూడు మెప్పడున్.

ఉ. పావన శర్దశాపహాఖ . . . ప్రదమూర్తి సుధానుభూతి సం
జీవిత భక్తలోక తులసీదళ పామ కపాలమాలికాదా
.... మ పరిపక్వత ఫలరూప సౌఖ్యవి
ద్యావహ యాగశక్తి విశదా . . . .

క. దేవ చతుర్విధ బహు భూ ...

గద్య :

.... జి తిక్కన సోమయాజి ప్రణీతంబైన స్వర్గారోహణ పర్వంబునందు సర్వంబు నేకాశ్వాసము.

విశేషాంశములు ;

గ్రంథము క్రిమిదష్టమై యున్నది. శిథిలాస్థలోనున్నది. కొన్ని పత్రములు విరిగి యున్నవి. వ్రాత దోషములు స్వల్పము. ఇందు 5 పర్వములు గలవు.

| | |
|---|---|
| అశ్వమేధ పర్వము | 1–72 |
| ఆశ్రమవాస పర్వము | 73–98 |
| మౌసల పర్వము | 99–113 |
| మహాప్రస్థాన పర్వము | 114–119 |
| స్వర్గారోహణ పర్వము | 120–129 |

మొత్తం 5 పర్వములు గలవు. అన్ని పర్వములు సంపూర్ణముగా గలవు కాని స్వర్గారోహణ పర్వమున ఆఖరి పత్రములు మిక్కిలి శిథిలమై యున్నవి.

శోకమగ్నుండగు ధర్మరాజును గృష్ణాదులు ప్రబోధించుటతో ప్రారంభమై, భారత ఫలశ్రుతితో ముగిసినది.

# ఆంధ్ర మహాభారతము

## మౌసల పర్వము.

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 2743 | కాల్ నెం | : టి 3-419 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 18 |
| ప్రతి పరిమాణము | : 40.5 X 3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

ప్రారంభము :

శ్రీ ధర్మ కామ హృదయ స మాధానోద్ధాన కారణాంఘ్రి సరోజా
బోధఘన వ్యాసపర స మాధి సమాలీఢ తేజ హరిహర నాథా।

క. .... .... .... ....దాత్త తేజో దీప్తుం
డా వైశం పాయనుడు ప్రి యా వేళ స్మరణ చిత్తుడై యిట్లనియెన్।

సీ. భారత సంగ్రామ పారీణుడై జయ మంది విలసిల్ల.... .... ....
.... .... ....బట్టంబు కట్టిన యది యాదిగాగ ముప్పదియునైదు
సంవత్సరంబులు చనిన యనంతర వర్తన చల్లంగ వసుధ లోన
నుత్పా .... .... .... ... వు శర్కరావర్షి యగుచు।

వీచు నర్కు నుదయవేళ బింబంబున బలసి తోచు ఘన కబంధ సమితి
నీరదంబు లేక నిర్ఘాత .... .... ....

క. .... .... షము లిన రజనీ కరులకు నతిరూక్షణములు గతిని గలుగునం
బర మెల్ల గప్పి వేసవి బరుగును పెను మూడ మంచు పౌరవము .... ....

తే.గీ అనిన విని యమ్మహీపతి యాదవులకు బోరు దమలోన కల్గిన కారణంబు
వారి వృత్తాంతమును వినవలతుజెప్పు మని .... .... ....

ముగింపు :

సీ. అన విని శోక మోహంబులు వాసిన డెందంబు నిర్భరానంద మొంద
నధిక భక్తియు వినయంబును దలకొన నర్జును డమ్మహితాత్ము వీడు
కొని వారణాపురి జనుదెంచి ధర్మజు గని తనపోయి వచ్చిన ....
.... పించె సర్వంబు నిట్లు సంయమి విను తుండు వైశంపాయనుండు రామ

తే. కృష్ణులాదిగా గల యదు వృష్ణిచయము భోజ సంతతి యంధక రాజసూత్న
వృత్తములు జనమేజయ విభున కింపు .... ....కొత్త నేర్పడ జెప్పటయును.

శా. కాలస్వైర విహార భంజన కళాకౌతూహల స్తవ్యదు
శ్శీలాంతఃకరణా విభావ్య కరుణా శ్రీమందిరాపాంగమం
త్రాళి వాచ్యసుధామ .... గ వనవ్యాపార రోధక్రియా.
శాలిరిస్వా .... త సముల్లసద్విహరణా సంసార నిస్తారణా !

క. హృదయ కమల మధురూపా విదారి..దురితతాపవేదస్తోమా
స్పద పారా .... నః సదనా దివిజశుభకృద్వచన పదవదనా.

మాలిని :

అమర గణ విరోధి వ్యాపదావాగ్ని కోపా
శమిత వితత చిత్తా సంగగాఢ ప్రతాపా
యమి నియమ వికాసీ ధ్యాన గేహప్రదీ ....
.... .... కలితానంద ప్రకార స్వరూపా ॥

గద్యః :

ఇది శ్రీ మదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబు . . . . ....ర్వంబునందు సర్వంబును నేకాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : రక్తాక్షినామ సంవత్సర చైత్ర శుద్ధ ౩ సోమవారం రెండు ఝా .... ప్రతిలోవున్న క్రమంగాను కొమ్మనాపిల్లి సన్యాశికుమాళ్ళు కృష్ణమ్మ ఆచంద్రార్కంగా చదువుకోగలందులకు మౌసలపర్వం వ్రాసుకొనెను.

ప్రతి అసమగ్రము. మొదటి పత్రము మరియు తుదను సుమారు 8 పత్రములు కుడి భాగమున శిథిలమైనవి. వ్రాత చక్కనిది. అలతి దోషములు గలవు. ఏకాశ్వాసము.

ధర్మరాజు రాజ్యంబున నుత్పాతములు తోచుటతో నారంభమై వేదవ్యాసుడు అర్జునునకు హితోపదేశము సేయుటతో ముగిసినది.

# ఆంధ్రమహాభారతము

## నన్నయ, ఎఱ్ఱన, తిక్కన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 317 | కాల్ నెం | : టి 3-436 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 258 |
| ప్రతిపరిమాణము | : 45.5 × 5.5 సెం.మీ | పత్రపంక్తులు | : 16 నుండి 19 |

విశేషాంశములు :

గ్రంథము క్రిమిదష్టమై శిథిలావస్థలో ఉన్నది. గ్రంథపాతము, వ్రాత దోషములు కలవు. వ్రాయసకాని పేరు లేదు. అక్షరములు పేలకంటె చిన్నవి. 270వ పేజీ తరువాత ఉన్న పేజీల సంఖ్య విపులముగా లేక పోవుటచేతను, ఏ విధమైన పేరు లేక పోవుట చేతను ఆ భాగ మేపర్వమో గుర్తించుట కష్టము. ఆశ్వాసాంతమైన పిమ్మట తగు మాత్రం స్థలం విడిచి పుచ్చుక పోవుటచే అశ్వాసము గుర్తించుట కూడ కష్టముగా నున్నది. ఇందు, ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, సౌప్తిక, శాంతి, అనుశాసనిక, అశ్వమేధ పర్వములు కలవు.

# ఆంధ్ర మహాభారతము

## సభా విరాట పర్వములు

## నన్నయ-తిక్కనలు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5282 | కాల్ నెం | : టి 3-393 |
| ప్రతి | : తాళ పత్రము; అసమగ్రము | పత్రములు | : 167 |
| ప్రతి పరిమాణము | : 44×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు ;**

ప్రతి విలేఖనము : విరోధి కృతునామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ ౨ బుధవారం రోజువర్కు కలవకొ....చినవెంక....గారి కొమారు డయిన శేషయ్యగారి కొమారుడు వెంకట నరసయ్యగారు భారతంలో విరాట పర్వంలో తక్కువ మూడు ఆశ్వాసములున్న కోటగిరి అక్కయ్యగారి ప్రతిలో వున్న క్రమానను వ్రాసుకోవటం అయినది.

క్రిమిదష్టము. గ్రంథపాత, శైథిల్యములు కలవు. సభాపర్వమున రెండాశ్వాసములు, విరాట పర్వమున 5 ఆశ్వాసములు గలవు. రెండు పర్వములయందు గ్రంథపాతము కలదు. వ్రాతచక్కనిది. వ్రాత దోషములు కలవు.

# ఆంధ్రమహాభారతము

## ఉద్యోగ, ఆనుశాసనిక, భీష్మ పర్వములు

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3991 | కాల్ నెం. | : టి 3-467 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము. | పత్రములు | : 235 |
| ప్రతి పరిమాణము | : 47×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 8 నుండి 9 |

**విశేషాంశములు :**

ఈ ప్రతిలో ఉద్యోగ పర్వము తరువాత ఆనుశాసనిక పర్వము, ఆ తరువాత భీష్మ పర్వము వ్రాయబడినది. ప్రతి స్వల్పముగా క్రిమిదష్టమైనది. వ్రాత స్పష్టము. అక్షరదోషము లలతిగా కలవు.

# ఆంధ్ర మహాభారతము

## విరాటు, భీష్మపర్వములు

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 1740 | కాల్ నెం | : టి 3-448 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 74. |
| ప్రతి పరిమాణము | : 38×3.5 సెం. మీ | పత్ర పంక్తులు | : 8. |

**విశేషాంశములు :**

ఈ ప్రతి యందు భీష్మ పర్వమున 43 పత్రములు, విరాట పర్వమున 31 పత్రములును కలవు. భీష్మ పర్వము ఆది నుండి అంతము వరకు గలదు. కాని మధ్య మధ్య చాల పత్రములు నష్టమైనవి. విరాట పర్వము కూడ ఆది నుండి చతుర్థాశ్వాసము మొదలు 10 పద్యముల వరకు ఉన్నను, ఇందును మధ్య మధ్య చాల పత్రములు నష్టములైనవి.

ఈ ప్రతి క్రిమి దష్టమై, శిథిలావస్థలో నున్నది. లిపి గ్రాహ్యముగా లేదు. ప్రతి విలేఖనమున చాల అక్షర దోషములు గలవు. ప్రతి నలుపుదిరిగి కొన్ని పంక్తులు కానవచ్చుటలేదు. ఈ ప్రతి యందు మొదట భీష్మ పర్వము వ్రాయబడి అ తరువాత విరాట పర్వము వ్రాయబడినది.

# ఆంధ్రమహాభారతము

## విరాటు, శల్య పర్వములు

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3322 | కాల్ నెం | : టి 3-457 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము | పత్రములు | : 120 |
| ప్రతి పరిమాణము | : 49×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 10 |

**విశేషాంశములు :**

ఒక్కొక్క పత్రమునకు సుమారు 10 పంక్తులు వ్రాయబడి యుండుటచేత వ్రాత స్పష్టముగా లేదు.

ప్రతియందు శల్య, విరాట పర్వములు కలవు. ముందు శల్యపర్వము, ఆ పిమ్మట విరాటపర్వము గందు.

అచ్చటచ్చట ప్రతి క్రిమి దష్టమైయున్నది. కొన్ని పత్రములు శిథిలములైనవి. వ్రాతదోషము లధికము.

# ఆంధ్ర మహాభారతము

## భీష్మ, కర్ణ, శల్య, సౌప్తిక, ఆనుశాసనికపర్వములు

## తిక్కన సోమయాజి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3412 | కాల్ నెం | : టి 3-456 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 170 |
| ప్రతి పరిమాణము | : 50.×5.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 14 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

భావసంవత్సరంబున పౌష్యమాస బహుళ పంచమితో గూడి భౌమవాస
రంబునను నానుశాసనికంబునాథమునికులోద్వహు పాపయఘను సుతుండు
రంగనాయక నాముడు రాజిత ముగ మహిని నాచంద్రతారార్కమై వెలుంగ
వ్రాసె నాత్మార్థముగ మనోల్లాస మొప్ప బుధజనోత్తములార సత్పూజ్యులారా !

ప్రతి చక్కనిది. వ్రాత స్పష్టము. వ్రాత దోషములు మిక్కిలి స్వల్పము. గ్రంథపాతాది దోషములు లేవు.

ఈ ప్రతియందు భీష్మ, కర్ణ, శల్య, సౌప్తిక, ఆనుశాసనిక పర్వములు సంపూర్ణముగా గలవు.

# ఆంధ్ర మహాభారతము
## కవిత్రయము

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషను నెం | : 1794 | కాల్ నెం : | టి 3-591 |
| ప్రతి | : తాళపత్రము : అసమగ్రము | పత్రములు : | 263 |
| ప్రతి పరిమాణము | : 50×5 5 సెం. మీ. | పంక్తులు : | 21 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు పదునెనిమిది పర్వములు ఆద్యంతములున్నను అసమగ్రప్రతియే. ప్రతి చాల శిథిలావస్థలో నున్నది. ప్రతి విలేఖరి పత్రమున 21 నుండి 23 పంక్తులు వ్రాయుటచే సామాన్యముగా కంటితో చదువుట చాలకష్టము. లేఖన దోషములు గలవు.

# ఆంధ్ర మహాభారతము
## కవిత్రయము

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషను నెం | : 1800 | కాల్ నెం : | 3 3-454 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము | పత్రములు : | 282 |
| ప్రతి పరిమాణము | : 47×5 సెం. మీ. | పంక్తులు | 18 నుండి 24 వరకు |

విశేషాంశములు :

పదునెనిమిది పర్వము లొకేచోటనున్న ఈతాళపత్ర ప్రతి చాల అరుదైనది. కాని పత్రములన్నియు రంగుమారి క్రిమిదష్టమై తునకలైనవి. ప్రతి శిథిలావస్థలో నున్నది. వ్రాత చాల చిన్నది. లేఖన దోషములు కలవు.

# ఆచార్యవిజయం

## ఆలూరి కుప్పనకవి (ఆంధ్రకాళిదాసు)

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5613 | కాల్ నెం | : టి 3–176 |
| ప్రతి | : తాళపత్రప్రతి– అసమగ్రము | పత్రములు | : 182 |
| ప్రతి పరిమాణము | : 44.5×3.5 సెం. మీ | పత్రపంక్తులు | : 5 |

ప్రారంభము :

శా. శ్రీ లక్ష్మీ జలజాక్షి యంక .... పై చెల్వొందు నిర్వేల సు
క్రీలన్ ముద్దులు గు .... ....

సీ. .... .... దైత్య .... .... నగెడు నాశ్చర్య మిగురు లొత్త।
పతి .... ల్కి యుడుప నొపక నెమ్మదిని .... మ్ము నునుసిగ్గు దొంతర లినుమడింప।
విభుడు భక్తిని .... పాలవెలని బ్రోచినలీల తిల .... ....
.... .... రత్నసింహాసనమున నిండు కొలువుండి కన్నుల పండువుగను।
పద్మ భవముఖ్య సురపరంపరల బ్రోచు నిందిర యభీష్ట భాగ్యంబు లిచ్చుగాత॥

సీ। తెలి నిగ్గు లీను నిచ్చలపు మేనికి బూతిరేక....బెడంగు....పీక యొసగ
అరుణ జటా బద్ధ గరిమకు బాలచం ద్రద్యుతి యొకవింత తళుకు లీను
సామేన నిరవొందు చానచొక్కపుటెక్కు సొక్కకు గళరుచున్ సొలపు గెలుప
గొనబు మిక్కిలికంటి మినుకుల .... తికుంకుమ చుక్క జిగికాంతి గ్రుమ్మరింప
సకలజగదేశ రక్షణ .... .... క్షణాతిశయరీతి నిరవొంది యలరు మొలక
నగవు దళుకొత్తు సొగసు నెమ్మొగ మెసంగు శివుడు కోరికెలిచ్చి రక్షించుగాత॥

అంకితంబుగా .... యొనర్పంబూనిన శ్రీ మచ్చం .... .... ర్య విజయంబను
ప్రబంధంబున .... క్రమంబెట్టి దనిన ....

ఉ. .... ధుడై దగియు నిత్య .... సమస్తమున్
బాగొనరంగ గంటి నటువంటి జగద్ధిత హేమ శం ....
.... రుహ యుగ్మ .... క్తి యుక్తి నెం।
తే గణు .... మ్రొక్కెదను నిశ్చిత బుద్ధి వి .... గన్

క. పొందుగ నేతత్కవితా .... .... జ శిష్యగణ శుకపిక మా
కంద మన తగు ననంతా నందగిరి గురూత్త ముని మనంబున దలతున్॥

సీ. .... కరుడై జగత్సేవ్యుడై యప్రతిహత శిష్యుడై సముద్య ....
తగి ఘన మహిమాఢ్యుడగు ననంతానంద గిరి గురూ త్తముడు సత్కీర్త నీయ
మనఘ మత్యద్భుత మఖిలాగమార్థ సం వేద్య మార్య జనై కహృద్య మతుల
మనవద్య మతి చిత్ర మం .... ఘన కథా బంధుర మాశ్రిత భాగధేయ
మైన శంకరగురు విజయంబు సకల సన్నుతోన్నత రీతినంచ ద్విశేష
శబ్ద సందర్భముల సముజ్వల విలాస గరిమ మెరయగ రచియించె కవులు పొగడ॥

వ. అక్కథనె .... బూ .... రంద .... శ్రీ శంకరాచార్య దివ్యావ తార ప్రభావంబును, అనేకకాల పరిచ్ఛిన్న శుద్ధాద్వైత విద్యా ప్రతిష్ఠా విధానంబును, తద్దేశికవర్య దిగ్విజయ కౌతూహలంబును, నతనికి వ్యాసుండు పొడగనిపించుటయును, అప్పు డయ్యాచార్యుని .... యుః పరిమాణ సూచకార్థాగత విధాతృ వచనాను వాదంబును। ద్వైపాయనుం డగ్గురువరునకు వెండియు నాయుర్విభవం బొసంగుటయును, మండనమి శునిన్ జయించుటయును, తదీయ భామినీ విజ ... ర్థంబు .... శిష్యులకు సూచించి యమ్మహామహుండు పరకాయ ప్రవేశం బొనరించి, పంచశర శాస్త్రం బభ్యసించుటయును, పూర్వ నిబంధన ప్రకారంబున శిష్య లయ్యతివరుం బిలువ చనుదెంచుటయును। తత్సమయ సభా .... త్తరాయ నిర్ధరణ కారణ నృసింహ సాక్షాత్కార ప్రకారంబును। తదనంతర సరస్వతీ విజయంబును। శృంగగిరిస్థలీ నివాసంబును। కాంచీపట్టణ పరిష్కరణ ప్రకారంబును, కామాక్షీ ప్రపంచంబును, శ్రీ చక్రోద్ధారణ .... విధానంబును, సచ్చిదానందైక్య ప్రకరణంబును, మొదలగు లీలావిలాసంబులు, తత్తదవాంతర కథా విస్తారంబులును, అనేక ప్రశ్నోత్తర ప్రకారంబులును, రచియించి తొలుదొల్త బహు దుష్టమత పరీగర్హణ విధంబు విస్తరింపం బూనె నట్టి యనంతానందగిరీ రచనా విశేషంబు నా నేర్చినంత తెనుంగుగా విశదంబు సేయం బూని దానం బ్రథమ ప్రకరణార్థంబు వివరించెద.

**ముగింపు :**

వ. సర్వజగద్వ్యాపక చైతన్యంబై యారూపంబుతో నిపు .... వెలుగొందు చున్నవా డగ్గురుండై యద్వైత విద్యాగరిష్ఠులైన వారికి ముక్తి ప్రదాతయై చెలంగు చున్నా డని పలికి వెండియు నిట్లనియె॥

సీ. శ్రీ కరమై జగత్సే .... మై ముక్తి .... ముగ నా... సంస్థాయి మీర
ప్రఖలంగ నద్వైత పరసాధనంబుగా పరమార్థ బోధమై గరిమ మెరయ
శ్రీ శంకరాచార్య భాసిత సత్కథా ర్థము లెల్ల గూర్చి మోదం బెలర్ప
నాచార్య విజయం బనంగను త్తమముగా ధర యనంతానందగిరివరుండు
హితము మీరగ రచియించెనీ ప్రబంధ మెవ్వరు పఠింతురాలింతు రిచ్ఛ నెంతు
రట్టి వారల నిహము నందత్కభీష్ట సిద్ధియును గల్గి కైవల్యసిద్ధి గల్గు
ఇందు. . . . . యింప బనిలే దది యెట్లనిన॥

క. అద్వైతార్థ ప్రదముగ నద్వైతో పాస్యమగుచు నాచార్య గుణాం
చద్విమల చరిత జగమున నద్వైత యశో విభూతి నలరుచు నుండున్॥

చ. జగదభినంద్యుడున్ నిగమ శాస్త్రపురాణ విదుండు శంకరా
ఖ్యగురు డభేద వార్ధి శశాంకుడు మద్దురితాంతరాయముల్
మొగి నెడ ద్రోసి వాసియగు భుక్తికి ముక్తికి తానె దాతయై
తగ నను బ్రోచు గావున ముదం బెద మీర నపార వైఖరిన్॥

గీ. తెలివి మీర చతుస్సప్తతి ప్రకరణ ములను గురువిజయంబు సమున్నతిగను
సకలజన సేవ్యమగుచు శాశ్వతముగాను విబుధ.... యమానమై వెలయుచుండు.

వ. అనుటయు॥

మ. దనుజాధీశ సభా విభాసిత ఘన స్తంభాగ్ర సంభూ...
...నికాయావన సత్కృపారస ల సత్సౌజన్య సంకేత కే
తన మాహాత్మ్య పరాజితాసురసుభృ త్సంజాత భం
జన హేతూన్నత నామ వైభవ దురాసంవీత వీతాహితా॥

పృథ్వి॥ స్ఫుట ప్రకటనాఖుఖుక్షణీ విలోల కీలాచ్ఛటా
పటుత్వ సముదంచిత ప్రచుర కోపరూపోజ్వల
త్సటా పటుల బంధురోద్ధతి విజృంభణాడంబరా
త్రుట ద్గిరి గుహాంతర స్ఫుర దుదీర్ణ ఘూర్ణారవా॥

మాలిని॥ విదళిత రిపువారా వేదసౌధ ప్రచారా
సదమలగుణజాలా సత్యవాక్యానుకూలా
సదవన మతి సారా శాస్త్ర తత్వార్థ పూరా
సదయ హృద . . . రూపా సర్వమంత్ర స్వరూపా॥

గద్య :

ఇది శ్రీ లక్ష్మీనృసింహదేవ దయా సంపాదిత సరస సాహిత్య విరాజిత శ్రీ మదాలూరి వెంకటగిరి సుధీపౌత్ర వెంకటేశ్వరార్య నరసమాంబకా సుపుత్ర ఆపస్తంబ సూత్ర కాశ్యపగోత్ర పవిత్ర కస్తూరి రంగ సద్గురు పాదారవింద భజనానందిత హృద్విలాస శ్రీమద్భోసల తుళజ మహారాజకటాక్ష స .... .... తాంధ్ర కాళిదాస ప్రణీతంబైన ఆచార్యవిజయం బను మహా పురాణంబునందు మణికర్ణికా తీరంబున ధ్యానారూఢుండై యున్న గురునికి వ్యాసుండు వృద్ధ బ్రాహ్మణ రూపంబుతో పొడగనిపించుటయును, వారలిరువురు భాష్య సూత్రార్థ విమర్శన ప్రసంగంబు సేయుటయును, నా వృద్ధుండు వ్యధికరణంబుగా బలికిన సహింపక గురుం డతని కపోలతాడనము జేసి తరుముటయును, వెండియు పద్మ పాదుని వలన నీవృద్ధుని వ్యాసుడని యెరింగి। యాచార్యుండు ప్రార్థించుటయు నతం డతనికి నిజరూపంబుతో పొడసూపుటయును. చతుర్ముఖస....ద్దర్శనంబున....తని యనుమతి ఒడిసి వ్యాసుండు గురునికి ఆయుః ప్రసాదం బొసంగుటయు, తద నుమతంబున గురుం డుత్తరాభి ముఖంబుగా సద్వైతమత స్థాపనార్థంబు .... .... ను, ద్వారకాయోధ్యాకురుక్షేత్ర మార్గంబుగా బదరికారణ్యంబునకుం జనుటయును। సందు నారాయణ ప్రసాదంబున గురుండు స్నానార్థంబుగా యుష్ణతీర్థంబు ఐ....జ కలజనంబులతో నంత నాతీర్థంబున స్నానం బొనరించుటయును, ద్వారకా అయోధ్యా జగన్నాథ శ్రీ పర్వతాది పుణ్య స్థల సందర్శనంబు లొనరించుటయు .... .... .... బునకుం జనుటయును, నందు జైనుల నుక్కడంచి గురు విశసన కారణ జనితదోష పరిహారార్థంబుగా కరీషాచలంబున నెమ్మేను కుచురుపరిచి యందనలంబు సంధించి దహించుకొన నుద్యోగించి యిట్లున్న భట్టాచార్యునిం గురుండు గనుంగొని తనతోనం బ్రసంగింప బిలుచుటయును. ఆ భట్టాచార్యుండు తనకు ప్రసంగించు తరి గామింజేసి తన భగినీ భ....యైన మండన మిశ్రు కడ... వాదింపం జను మనిన విని యాచార్యుం డా మండన మిశ్ర స్థానంబగు విద్యాలయ దేశంబున కరుగుటయును, మండన మిశ్రదర్శనంబును, మిశ్రుండు గురుని వలన పరాజితుండై .... .... శించి ఉత్తరాభిముఖుండై జనుటయును, తద్భార్యయగు

సరసవాణి దివికేగిన నేగనియ్యక యాచార్యుండు తన దుర్గా మంత్రంబుల నాకర్షించి సరసవాణితో .... బొనరించుటయును, యాసరసవాణి కామ శాస్త్రంబున నన్ను గెలువ నశక్యంబని తజ్జయార్థంబుగా గురుండు అమృత పురంబున కరిగి యచ్చట రాజ కళేబరంబునన్ ప్రవేశించి కామశాస్త్రాభ్యాసం బొనరించుటయును, । నారాజా గ్రమహిషికి ఆ కృత్రిమంబు తోచి యెచ్చట నేని కళేబరంబులున్న దహింపు డని చారులన్ బనిచిన వార లట్లొనరించు తరి నాచార్యుండు శిష్య వచనంబులన్ నిజ శరీరంబునన్ బ్రవేశించి నృసింహ సాక్షాత్కారంబున చితివలన వెలువడి సరసవాణి కడ కరుదెంచి యాదేవిని జయించుటయును. శృంగగిరి ప్రవేశంబును, యందు సరస్వతి ప్రతిష్టయును. యాపీఠంబున కాధిపత్యంబు పద్మపాదున కిచ్చుటయును। కాంచీ నగర నిర్మాణంబును। కామాక్షీ ప్రపంచంబును। శ్రీ చక్రంబు ప్రతిష్ఠించుట యును। మోక్ష మార్గ నిరూపణంబును। శైవమత స్థాపనంబును। వైష్ణవ మతో ద్ధారణంబును। సౌరమత సముల్లసనంబును, శక్తిమత ప్రచయంబును, గా.... త్యమత ....ర్వ....ణంబును, కాపాలికమత సమ్మతంబును, గురువారి విలాసంబును, గురుని మహానందైక్య ప్రభావంబును, సచ్చారిత్ర శ్రవణ ఫల ప్రకారంబును, నను కథలం ప్రథిత .... .... గి చెలగునది సర్వంబును షష్ఠమాశ్వాసము.

విశేషాంశములు :

గ్రంథమునందలి ప్రతి పత్రము క్రిమిదష్టమై యున్నది. అలతిగా శైథిల్యము కూడ చెందినది. అలతిగా వ్రాత దోషములు, ఛందోదోషములు కూడ గలవు. వ్రాత బాగున్నది. ఇందు మొత్తము ఆరు ఆశ్వాసములు కలవు. కవికి ఆంధ్ర కాళిదాసను బిరుదము కలదు. కవి లక్ష్మీ నరసింహదేవుని భక్తుడు. ప్రతి విలేఖన కాలముగాని, వ్రాయసకాని నామముకాని పేర్కొన బడలేదు. ఇది శైవమతాచార్యుడగు శంకారా చార్యుని చరిత్రను గూర్చి తెలియజేయు గ్రంథము.

# ఆదినాథచరిత్ర

## ద్విపదకావ్యము

## వేటూరి రంగరాయకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3723/A | కాల్ నెం | : టి3-128 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 34 |
| ప్రతి పరిమాణము | : 41×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

**ప్రారంభము :**

శ్రీగురు భజియించి శివుమదిగొల్చి బాగొప్ప కరిముఖు ... మించి
వీరభద్రుని కంచి వృషభేశు బొగడి .... .... .... పార్వతి ....
.... .... నకు ప్రణమిల్లి కుంభిణిలోన నహరహంబును శివధ్యానులకెల్ల
నొనరంగ శరణార్థి యిరవందజేసి వ్యాసఘు డావ్యాసుల నాత్మలో ద ....
వాల్మీకముని గూర్చి .... .... లిమితో హనుమంతు మదిని బొగడి (?)
బ్రహ్మను గీర్తించి భారతి నెంచి బ్రహ్మవిజ్ఞానులై పరగిన యట్టి
సనకాది మునులకు సాష్టాంగ మొసగి .... .... తో మహా విష్ణువు దలచి
కమలజును కరమర్థితో దలచి (?) విమలులౌ కవులను వేడ్క నుతించి
యాదినాథ చరిత్ర యంధ్రభాషమర సాధు .... కగా జెప్పి
గురునకు నర్పించి .... సద్భక్తి పరగంగ సురరాజు పదవిని మీరు
నగజేశ్వరులసేవ నమ్మిన వాడ జగతిపై మద్వంశ సరణి యట్లన్న
ఆదినాథ చరిత్రయం దొక్కటమరు యాదినాథుండన యల్లమ యన్న
భైరవుండన ను .... లి మృత్యువు నన్న వరరుద్రుండన .... ....
.... పన్నుగా వర్తించు బ్రహ్మలింగంబు
యిట్టి లింగ మహత్వ మిది యెల్ల మీకు ఘట్టిగా జెప్పెద ఘనులార వినుడు !
శ్రీపర బ్రహ్మంబు శివుడు చిన్మయుడు నా పర .... ....
నామరూపక్రియా నటనలు లెని యా మహా మ .... తంబులే దు

ముగింపు :

మూడు లింగంబుల మూలమై తాను జోడులే కలరెడు జ్యోతిరూపంబు
గుణ నిర్గుణంబుల గూడి వర్తించు గణుతింప .... ....

గద్య :

.... .... కరకంఠు పేర సత్కరుణచే నన్ను
నిరవొంద బ్రోచు భోగీశ్వరు పేర వలనొప్పు వేటూరి వంశపావనుడు
చందకుమారాఖ్య సద్గురుభక్తి సందియంబులు లేని సరసకవిత్వ
. . . . . . వచియించు ద్విపద కావ్యశ్రేష్ఠమునను
నాదినాథ చరిత్రయందులోపలను నాదరంబుగ తృతీయాశ్వాసమయ్యె.

విశేషాంశములు :

పత్రములన్నియు చాల వరకు శిథిలములైనవి. 3 ఆశ్వాసములు గలవు. ఉన్న భాగములో కూడ గ్రంథపాతము ఎక్కువ. వ్రాత అంతగా బాగుండలేదు. అక్షరదోషములు కలవు.

# ఆధ్యాత్మరామాయణము

## కాణాదము పెద్దన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4622 | కాల్ నెం | : టి 3-349 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : |
| ప్రతి పరిమాణము | : 48×4.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

ప్రారంభము :

మ. .... .... ... మై
యకలంకంబును స్వప్రకాశ మమలంబై సచ్చిదానందమై
ప్రకటం బయ్యె నతీంద్రియంబగు పరబ్రహ్మంబు రామాఖ్యచే
నొకటిన్ వర్తిల్లు చుండు దాని సగుణత్వోపాసనా యోగ్యమై॥

క. ప్రకటముగ నేను మూల
ప్రకృతిని తత్సన్నిధాన బలమున నాచే
సకలంబు సృజింపంబడి
యకుటిలు డగు నతని కృత్య మని తోపబడున్.

వ. మరియు నయోధ్యా నగర స్థలంబున విమలంబగు రఘు కులంబున నుత్పత్తియును, విశ్వామిత్ర సహాయ సంపత్తియును, తత్సవన రక్షణంబును గౌతమసతీ శాపమోక్షణంబును, గిరీశ శరాసన భంగంబును, మత్పాణి గ్రహణ ప్రసంగంబును భార్గవ గర్వనాశంబు సాకేత పుర ప్రవేశంబును నందు మత్సహాయంబున ద్వాదశ వర్షస్థితి నియమనంబును, దండకారణ్య గమనంబును, విరాధ నిధనంబును, మారీచ మథనంబును, మాయా సీతాపహరణంబును, జటాయు మరణంబును, తత్పుణ్యలోక కరణంబును కబంధ హరణంబును, శబరీ పూజనంబును, హనుమత్సమాయోజనంబును, సుగ్రీవ రంజనంబును, వాలి భంజనంబును, సీతాన్వేషణంబును, సేతు బంధనంబును, లంకా నిరోధంబును, రావణ కుంభకర్ణాది వధంబును విభీషణ రాజ్యదాన విధంబును, మత్పున స్సమాగమంబును, పుష్పక యానాగమనంబును, సాకేత పునః ప్రవేశం బును పట్టాభిషేచనంబును, నాదిగాగల యనేక కార్యవర్గంబు సర్గస్థితి హరణకారిణియును ప్రకృతి రూపిణియునైన నాచేతం జేయంబడిన వయ్యును, నిఖిలాత్మకుండును, నిర్వికారుండును, నగు రఘువీరుని యందు నారోపింపం బడియుండుగా వని మరియును.

ముగింపు :

క. ఉరుస్ఫోముడు రాముం డిటు సరయూ సలిలావగాహ సంభ్రమ లీలా
పరుడై నడచిన తరి యా హరి గాంచి నమస్కరించి యజు డిట్లనియెన్.

సీ. రామ విష్ణుడవు నారాయణుండవు పరా త్ముడవును పరమేశ్వరుడవు నీవు
నఖిలేశ పూర్ణుండ వానందమయుడవు నీనిజ తత్వంబు నేనెరుగుదు
నైన నీ దాసుండనైన నా వచనంబు బాలింపు భక్త తత్పరుడ వగుట
నీవు భ్రాతల తోడ నేక మాద్యంబునై దీపించు వైష్ణవ తేజమైన

మూర్తినేనియు మరి యొండు మూర్తినేని బోరి బ్రవేశించి మమ్మెల్ల బ్రోవుమయ్య
నీవు హరివగు దేవాది దేవుడవగు దేవ కా నన్య లెరుగరు నిను బరేశ॥

క. దేవాధిప వేవిధముల శ్రీవర నీ కేనమస్కరించెద గనుమా
నీవు బ్రసన్నుడ వగుమా నే వెండియు మ్రొక్కువాడ నీ కిదె రామా॥

వ. అని పితామహుండు ప్రార్థింపు చుండ మహా ప్రభావుండగు శ్రీరామదేవుం డందరుం గనుచుండ నరవింద సంభవాది బృందారక బృందంబులు వెరగంద నిజ మాయా విభ్రమం బున నేత్ర భ్రమం బాపాదింపుచు తదీయ దివ్య దేహంబునంద నందక కౌమోదకీ శంఖ చక్ర శార్ఙ్గాది సాధన యుతుండును చతుర్భుజాన్వితుండును శ్రీవత్స వక్షో విరాజితుండును వనమాలికా విభ్రాజితుండును పీతాంబరావృతుండును దివ్యప్రభా భావ్య మాన కిరీట కుండలకేయూర హారకటక కంకణాంగుళీయకి కటి సూత్ర నూపురాద్యలంకృతుండును నగు నారాయణ దేవుండై ప్రకాశించిన నాక్షణంబ లక్ష్మణుండును నద్దేవునకు తల్పభూతుండై యత్యద్భుత శరీర సమేతుం డును విద్యోతిత సహస్ర ఫణాదిశేషుండును నగు శేషుండయ్యె. భరత శతృఘ్ను లిద్దరు శంఖ చక్రంబులై రంతకమున్న సీతా మహాదేవి లక్ష్మి స్వరూపంబునం దేజరిల్లి పురాణ.

* * * *

ఈ ప్రతి యందు పూర్తి రామాయణములేదు. ఆద్యంతములు లేవు. మధ్య మధ్య గూడ చాల పత్రములు నశించినవి.

ఇందలి పత్రములలో కొన్నిట కొంత భాగము నశించినది. ఇందలి లిపి స్పష్టము, కాని ప్రతి విలేఖనమున చాల దోషములు కలవు.

ఈ ప్రతియందు గ్రంథము యొక్క మొదటి పత్రములు నశించుట చేత గ్రంథకర్తృ భర్తల నామ వివరాదులు తెలియలేదు. ఆశ్వాసాంత గద్య యందు యీకవి ఉభయ కవితా నిస్పహాయ సాహితీ విహారుడ ననియు, తిమ్మనార్య పుత్రుడ ననియు తెలుపు కొనెను.

## ఆముక్తమాల్యద

### శ్రీకృష్ణ దేవరాయులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం . 5. | | కాల్ నెం | : టి3-30 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 98. |
| ప్రతిపరిమాణము : 35.4 సెం.మీ. | | పత్రి పంక్తులు | : 9 |

ప్రారంభము :—

ఉ. శ్రీ కమనీయ హారమణి జెన్నుగ దానును కౌస్తుభంబునం
దా కమలా.......................... యు నుదారత దోప బరస్పరాత్మలం
దాకలితంబులైన దమ యాకృతు లచ్చుత బైకి దోచి య
స్తోకత నందు దోచెనన శోభిలు వేంకట భర్త గొల్చెదన్।

మ. సిరి నొక్కప్పుడు కన్మొఱంగి హరి దంజేరం బ్రహర్షించు ను
ర్వరకుం వంచన గూడగా గలుగు భాస్వచ్చంద్ర శాలాపరం
పర లయ్యేంబరపైన యెవ్వని ఫణా పంక్తుల్ భజింతున్ నిరం
తరముం దాంతుని నయ్యనంతుని నతీత బ్రహ్మ కల్పాంతునిన్ ।

వ. నా విన్నపం బూను నాముక్తమాల్యదా మహా ప్రబంధంబునకుం గథా క్రమం
బెట్టి దనిన.

మ. లలితో ద్యాన పరంపరా పిక శుకాలాప ప్రతిధ్వానమున్
వలబిన్నీల హరిన్మణీ పికశుక స్వాన భ్రమం బూన్ప మి
న్నులతో . . యు సువర్ణ సౌధముల నెందుం జూడ జెన్నొందు శ్రీ
విలిపుత్తూరు సెలంగి పాణ్డ్యనగరోర్వీ రత్న సీమంతమై ।

చ. మలచి పయోజ కోశముల మాడ్కి నొనర్చిన పద్మరాగ పుం
కలశపు నెట్టి డాల్పొమిడికంబులతో నపరంజి యెందు బి
ళ్ళల నల వై జయంతము చలంబున గెల్వగ దంశి తంబులై
నిలిచిన యట్లు మాడువు లనేకము లుల్ల సిలం బురంబునన్ ॥

సీ. పాథోధి జలయుక్తి ప్రాచి వట్టిన దిశా కరులు నాందగు మరకతపుక రులు
కరులు తొండము చిక్కగబళించి మ్రింగిన హరులు నా తొండ మొప్పగు దదశ్మ
హరులు దాచిన తాప లమర నేనిక దోయి నీ రార్చు నపరంజి నీటి వ్రా . .
శ్రీలు తత్పార్శ్వ చిత్రిత శంఖ చక్రముల్ రత్నంపు ఢిన్నెల ప్రతిఫలింప

తే. బెరపురాశి గృహశ్రీల బెళ్ళి యాడ భవనరాజులు గట్టిన బాసిక మన
దనరు మణి తోరణముతోడి ద్వార వితతి బరగు పీథులు పురి సూత్రపట్టినట్టు.

చ. పగడపు చాయ చెందిరము బ్రామిన పాండ్య వధూ కుచంబులన్
నగు నరణంపు బొండ్లముల నారికెళంబులు వజ్ర కుట్టిమం
బగు పథముం జెలంగు భవనాహృత శేషితరత్నరక్ష క
భగ తరు సంతతిం బ్రథమ భార్య బురిం గిర వుంచె వార్ధినాన్ ॥

**ముగింపు :**

క. గళమున గట్టెను హరి మం గళ సూత్రము పులక లతివ గాత్రము వొదవన్
నెలతయు బతియును గరముల నలవలచిరి కంకణంబు లన్యోన్యంబున్ ॥

సీ. లలనచే నిష్ఠతో లాజలు వేల్పించి శార్గి మెట్టించెను సప్త పదులు
తెరపగూడి యరుంధతీ దర్శనము చేసి బ్రహ్మరుద్రాది గీర్వాణ కోటి
యర్పించు నుడుగరలను కంప గైకొని యనిచి ప్రసాద భాజనము చేసి
యాత్మ పట్టణమున కతివై భవంబున నతివ దోడ్కొని విజయంబు చేసి

తే. సహ్య.... తటో ద్యాన ....ద్రు కుంజముల నీల కుంతల గుస్తరించి
కంతు సామ్రాజ్య మేలించి కరుణ చిత్త మెరయు జగములు పాలించు .... .... ....

.... .... .... కందర చందన కుంద వాటి కా
మంద సమీర లోల వన మాలిక నిర్మల దెవ్య విగ్రహా
స్పంద విభాధరీ కృత నభ స్ఫుట కాలిక గోపబాలికా
బృంద మనోభిమాన ధృతి భేదన పేశల వంశవాదనా।

స్రగ్విణి. వాలి నిర్భేదనా వారి జా తేక్షణా
శైల కన్యాస్తుత శార్ఙ్గ చంచద్భుజా
పాల దృ కృద్మ భూపాక భేరీ స్ఫుర
న్మౌళి మాణిక్యరు జ్మండి తాంఘ్రిద్వయా।

**గద్య :**

ఇది యంధ్రోక్తి యథార్థనామ యవనాస్పకూర్ప కెంబావి వా
రిపద్ధ దంధ త్యవరోధివప్రవలయశ్రేణీ విఘాతక్రియా
స్పదసేనాగ్రగ కృష్ణరాయ మహిభృత్సంజ్ఞా నవాముక్తమా
ల్యద నాశ్వాసము .... మింపలరు హృద్యంబైన పద్యంబులన్.

**విశేషాంశములు :**

**ప్రతి విలేఖనము :**

జయనామ సంవత్సర కార్తీక బహుళ ౩ శుక్రవారం. దెందులూరి కనకయ్య ఆముక్తమాల్యద ఏడు ఆశ్వాసములు సంపూర్ణముగాను వ్రాసెను. పై గద్య పంచమా శ్వాసాంతము నందలిది.

గ్రంథము బాగుగా నున్నది. క్రిమిదష్టము కాలేదు. వ్రాత తప్పు లధికము.

ఇందు పారశీ శబ్దములు కూడ ప్రయోగింపబడినవి. ఉదా. గిరవు (౧-౫౪) అను పదప్రయోగము కలదు. తెలుగు నిఘంటువులయందు ఇది దేశ్య శబ్దముగా చూపబడినది. 'లోగాత్ సయ్యీది' అను పారశీ నిఘంటువునందును, (పుట 442) 'ఫిరోజ్ లోగాత్' అను ఉర్దూ నిఘంటువునందు (పుట 284 *Part II*) కూడ ఈ శబ్దము పారశీ శబ్దముగా పేర్కొనబడినది. దీని విషయము చింత్యము.

ఈ గ్రంథము వేంకటేశ్వరుల కంకితమీయబడెను.

కృతికర్త వంశవృక్షము.
ఇతని వంశము — తుళువ వంశము.

తిమ్మదేవరాయలు + దేవకీదేవి
|
ఈశ్వరదేవరాయలు + బుక్కమాంబ
|
నరసింహదేవరాయలు + తిప్పమ్మ - నాగాంబిక | తిరుమలదేవరాయలు
|
వీర నృసింహరాయలు | కృష్ణదేవరాయలు + తిరుమలదేవి — అన్నపూర్ణాదేవి.

ఇందు చెప్పబడిన ప్రధాన కథాంశము గోదాదేవి చరిత్ర. ఇందు యామునాచార్య చరిత్రము, ఖాండిక్యకేశి ధ్వజోపాఖ్యానము, మాలదాసరి కథ మొదలగునవి ప్రధాన కథతో సంబంధములేనివైనను వర్ణింపబడినవి. ఇది వైష్ణవ మత ప్రతిపాదనమునకు నుద్దేశింపబడి రచించినట్లుగా తోచుచున్నది.

ఈ గ్రంథమందు ప్రధానరసము భక్తి. శాంతరసము అంగము.

# ఆముక్తమాల్యద

## శ్రీకృష్ణదేవరాయలు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5843 | కాల్ నెం | : టి 3-287 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము | పత్రములు | : 79 |
| ప్రతి పరిమాణము | : 39×4 సెం. మీ. | పత్ర పంక్తులు | : 8 |

**విశేషాంశములు ;**

ఈ తాళపత్ర ప్రతియం దేడాశ్వాసములున్నను ప్రారంభమున నాలుగు పత్రములు లోపించినవి. ప్రతి క్రిమిదష్టమై శిథిలమైనది. అటనట కొన్ని పత్రములు విరిగి పోయినవి. ప్రతి పత్రము పైభాగమున కొంత శిథిలమై యున్నది. లిపి స్పష్టము. లేఖన దోషములు గలవు.

# ఆముక్తమాల్యద

## శ్రీకృష్ణదేవరాయలు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4640 | కాల్ నెం | : టి 3-90 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 51 |
| ప్రతి పరిమాణము | : 41×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

గ్రంథము క్రిమిదష్టమైనది. గ్రంథ శైథిల్య, గ్రంథపాతములు కలవు. గ్రంథ మసమగ్రము. 3 ఆశ్వాసములు సంపూర్ణముగాను నాల్గవ ఆశ్వాసమునందు సుమారు 270 పద్యములవరకు గలవు. వ్రాత దోషములు కలవు. తిరుమల వేంకటేశ్వరున కంకితము.

# ఆముక్తమాల్యద

## శ్రీకృష్ణదేవరాయలు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3656 | కాల్ నెం | : టి 3-237 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 211 |
| ప్రతి పరిమాణము | : 40.5×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 నుండి 6 |

**విశేషాంశములు :**

ఈ ప్రతి వ్యాఖ్యానసహితమగు ఆముక్తమాల్యద గ్రంథము. వ్యాఖ్యానకర్త పేరు గాని ప్రతి విలేఖరి పేరుగాని, ప్రతియొక్క శైథిల్యముచే తెలియుటలేదు. ఈ ప్రతి యందలి చాలా పత్రములు క్రిమిదష్టములైనవి. పురాతనమై శిథిలములైనవి. పంచమాశ్వాసమందలి సుమారు 20 తాళపత్రములు లేవు. ఈ ప్రతియందు పూర్తిగాలేని పత్రముల సంఖ్యలు క్రింద ఈయబడినవి. (19, 36, 101, 183-200, 205, 207, 208, 213-218, 221, 224, 226, 227, 229, 232, 233, 249)

# ఆముక్తమాల్యద

## శ్రీకృష్ణదేవరాయలు

గుడిపాటి వెంకటకవి విరచిత టీకా సహితము.

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 5932; | కాల్ నెం. | : టి. 3-597 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 362 |
| ప్రతి పరిమాణము | : 33 × 3.5 సెం.మీ. | పంక్తులు | : 5 నుండి 8 వరకు |

**ప్రారంభము :**

సీ. శ్రీమహినందన వామాంకతలమున వలనొప్పముందర వాయుసుతుడు
చరమభాగంబున సౌమిత్రి భరతుండు శత్రుఘ్నులుభయపార్శ్వములయందు
వాయువ్య మహిపకోణాయత దిశలను నినజ విభీషణ నిమిషరాజ
పౌత్ర భల్లుకలోక పట్టుభద్రులు గొల్వ నయ్యష్ట పద్మ పద్మాంతరమున

ప్రేమ మీరంగ కర్ణికా పీఠమునను
సన్నుతింపంగ పేరోలగమున్నవాని భద్ర సందాయకుని రామభద్రుగొలుతు.

క. అని యిష్టదేవతా ప్రా ర్థన మున్నుగ నాచరించి తగ నేనొక ప్రా
క్తన కృతికి టీకసేయుదు నను వీక్షిత దీక్షనుండు నాసమయమునన్।

చ. నను గుడిపాటి వెంకటు ననారత సద్గురు భక్తియుక్తునిన్
ఘన ఘృణి కృష్ణిపాటికుల కంధి సుధాఘృణి చెన్నమంత్రినం
దనుడగు వెంకటాగ్రణిని దాన శిఖామణి పిల్వబంచి యి
యె సుధారసంబు గురియం న్మృదు సూక్తుల నావరింపుచున్.

ప్రేమ నల్లసాని పెద్దన్న యాముక్త మాల్యదాఖ్య కృతి సమంచితముగ
జేసె నీవు టీకసేయుము చెరకున పండు బండినట్లనుండు గాక.

అన విని నే నాయన ముఖ వనజము వీక్షించి మృదుల వాక్యంబులతో
వినయ ప్రియపూర్వకముగ ననఘా నావచనము వినుమని యిట్లంటిన్.

ఆ త్రినయనాత్రికార్ముకు దత్రిదశాహిత సరోరుహావన తుల్యుం
దత్రి గుణ సిద్ధ జనకుం దత్రిమహాముని తపోధనాగ్రణివెలయున్.

... ... ... ...

లలితో ద్యాన పరంపరా శుకపికాలాప ప్రతిధ్వానమున్
వలభి నీల హరిన్మణీ శుకపిక స్వాన భ్రమం బూన్పమి
న్నులతో రాయు సువర్ణ సౌధముల నెందుం జూడ జెన్నొంది శ్రీ
విలుబుత్తూరు చెలంగు పాండ్య నగరోర్వీరత్న సీమంతమై.

టీక : శ్రీ విలుబుత్తూరు = పురవిశేషము, పాండ్య = పాండ్య దేశమందలి, నగర = పట్టణాల యొక్క, ఉర్వీ = భూమికి, రత్న సీమంతమై = ముత్యాల పాపట బొట్టై ; లలిత = ఒప్పే టటువంటి ; ఉద్యాన = శృంగార వనాల యొక్క ; పరంపరా = సమూహాల యందలి ; శుక = చిలుకల యొక్క ; పిక = కోయిలల యొక్క ; ఆలాప = వాక్యాల యొక్క ; ప్రతిధ్వానముల్ = ప్రతిధ్వనులు ; వలభీ = లోపలి యొక్క ; నీల = నీలాల యొక్క ; హరిన్మణీ = గరుడపచ్చల యొక్క ; పిక = కోయిలల యొక్క ; శుక = చిలుకల యొక్క ; స్వాన = ధ్వనులనేటి ; భ్రమన్ = బుద్ధిని ; పూన్పన్ = వహింపచేయను, శుక పిక

ధ్వనులకు లోపల ప్రతిధ్వనులిస్తె ఆ లోపల యందు తీర్చిన రత్నపు కోయిలలు చిలుకలు ధ్వని చేసినట్టే వుండె ననుట; మిన్నులతో=ఆకాశాలతోను; రాయు=వరసేటి; అత్యున్నతా లనుట; సువర్ణము = బంగారము యొక్క; సౌధములు = మేడలచేత, యెందున్ =యెందు, జూచినా చెన్నొంది=వొప్పి; చెలంగు=ప్రకాశించును. క్రియా పదము.

... ... ... ...

ముగింపు :

లలనచే నిష్ఠతో లాజలు వేల్పించి శార్ఙ్గి మెట్టించెను సప్తపదులు
తెరవ గూడి యరుంధతీ దర్శనము చేసి బహ్మరుద్రాది గీర్వాణ కోటి
యిప్పించు నుడుగర లనుకంపగైకొని యనిచె ప్రసాద భాజనుల జేసి
యాత్మ పట్టణమున కతి వైభవంబున నతివ దోడ్కొని విజయంబు సేసి

సహ్యాకన్యా తటోద్యాన చందన ద్రు కుంజముల నీల కుంతల గుస్తరించి
కంతు సామ్రాజ్య మేలించి కరుణ చిత్త మెలయ జగముల పాలింపుచున్న వాడు.

టీ॥ శార్ఙ్గి = రంగపతి; లలనచే = పెండ్లికూతురుచాత; నిష్ఠతోడను, లాజహోమము వేల్పించి, సప్తపదుల మెట్టించెను; తెరవగూడి = ఆయమను గలసి; అరుంధతీ దర్శనము చేసి, బ్రహ్మ రుద్రాదులైన, గీర్వాణ కోటి=దేవతా కోట్లు; అంపించిన ఉడుగరలు; అనుకంప=కృప చేతను; గైకొని; ప్రసాద భాజనుల జేసి=ప్రసన్నతకు పాత్రులుగా జేసి; అనిచె= అంపెను; అతి వైభవంబున=విభవము చేతను; ఆత్మ పట్టణమునకు=శ్రీరంగానికి; అతివను దోడుకొని, విజయంబు చేసి=వచ్చి; సహ్యా కన్యా = కావేరి యొక్క; తట=దరియందు; ఉద్యాన=శృంగార వనమందలి; చందన ద్రు= శ్రీగంధ వృక్షాలయందు; కుంజముల=పొదరిండ్ల యందును, నీల కుంతలను=ఆముక్తమాల్యదను; కుస్తరించి=లాలించి; కంతు సామ్రాజ్యము=అతను సామ్రాజ్యము; ఏలించి, చిత్తము కరుణ చేతను; ఒలయ=నిండగా, జగములు=లోకాలను పాలింపుచు, వున్నవాడు=వున్నాడు.

గద్య :

ఇది సింహాచల దంభ కేసరి పదాభిష్టార్చనా పుణ్యాల
బ్ధమరుట్టంకణ పొట్టునూరి విజయ స్తంభోపలోట్టంకి తాం

కదృఢాష్టాక్షర కృష్ణరాయ ధరణీ కాంతాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసవరంబు నారవది హృద్యంబై మహిన్ బొల్పగున్.

ఇది సింహాచలమండలి, దంభకేసరి=మాయా నృసింహుల యొక్క; పదాభీష్టార్చనా=ఇష్టమైన పాదపూజల యొక్క పుణ్యము చేతను; లబ్ధ=పొందబడిన; దురుట్టంకణ=ఉటంకింప శక్యముగాని, ఎన్నరాని వనుట; పొట్టునూరి, విజయ స్తంభము యొక్క; ఉపల=శిలయందు; ఉట్టంకిత=ఉటంకించిన, వ్రాసిన; అంక=గురుతు చేతను; ధృఢమైన, అష్టాక్షరాలు గల; కృష్ణరాయ ధరణీ కాంతుడనే, అస్మదాముక్తమాల్యదను=నాయీగ్రంథమందు ఆశ్వాసవరంబు; ఆరవది హృద్యంబై; మహిన్ బొల్పగున్=భూమియందు ప్రకాశించును.

ఇది సూర్యనారాయణాది నవగ్రహ దేవతా ప్రసాదాతిశయాసాదితాభ్యుదయ పరంపరాభివృద్ధివత్సంపత్సారస్వత సంపూర్ణాత్రేయ గోత్ర పవిత్ర నందవరవంశోత్తంస కృష్ణిపాటి ఛాయాపతి ప్రధానానుజ చెన్నప్రధాన తనూభవ నిత్యాన్నదానవినోద నానా విద్యా పరిశీలన చతురతర నిరాతంక నిశ్శంక బిరుదాంక వేంకట ప్రధానైణాంక సంకల్పాను రూప శ్రీహయగ్రీవదేవ ప్రసాద సమర్థిత సంస్కృతాంధ్ర ప్రబంధ నిబంధనాశ్వలాయన సూత్ర హరితస గోత్ర (గుడిపాటి) కిచ్చనామాత్య కుమార వేంకట కవీంద్ర విరచితాముక్తమాల్యదా ప్రబంధ తాత్పర్య బోధినీ సమాఖ్యా ప్రఖ్యాత వ్యాఖ్యానంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము. టీకతో సంపూర్ణముగా వ్రాసినది.

**విశేషాంశములు :**

ఈ వ్యాఖ్యాన ప్రతి మంచి స్థితియందున్నది. అటనట కొన్ని పత్రములు లోపించినవి. వ్రాత మంచిదనియే చెప్ప వచ్చును. అక్షర దోషములు కలవు. ప్రతి చివరలో కొద్దిగా విరిగి పోవుట చేత వ్రాయసగానిచే ప్రతి వ్రాయబడిన సంవత్సరము పేరు తెలియుట లేదు. కాని "ఆశ్వీజశుద్ధ 14 గురువారం వరకు పెగడరాజు శేషయ సుబ్బయగారు .... రాసుకున్నది." అని మాత్రము తెలియుచున్నది.

# ఆముక్తమాల్యద

## శ్రీకృష్ణదేవరాయలు

జ గ న్నా థ రా జ వి ర చి త టీ క

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 245 | కాల్ నెం | : టి 3-48 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 141 |
| ప్రతిపరిమాణము | : 41×3.5 సెం.మీ. | పత్రపంక్తులు 6 నుండి 7 : | |

ప్రారంభము :

నివాసంజేసి, మల్లెలుదురిమి=మల్లెపువ్వులు శిఖలయం .... కాపు నిమిత్తముల కొరకై మా పైన సాయంసమయమైన, ఇక్షుయంత్రములకు=చెరుకుగానుగలున్న తీరానకు ఒయ్యన=మెల్లనె .... ప్రజ=జనము భావివృష్టికి=ముందర కురిసెవర్షానకు గ్రుడ్డుతో తలలనుగుఱెల్లనిగ్రుడ్లువుంచుకుని మధురిమేచ=మాధుర్యవస్తువుల యిచ్చచేతను, దిగు వస్తూవున్న యర్రజీమలనగా రక్తపిపీలికలనంగా బొలిచెను=ఒప్పెను యీపద్య మందు కావిచీరెలుకట్టి మల్లెలుదురిమి చెరకుగానుగుల చెంతకు వచ్చేస్త్రీలను వర్ష సూచకమైన గ్రుడ్డుమోసే యర్రజీమలుగా జెప్పినాడు గనక ఉత్ప్రేక్షాలంకారము.
(2-70)

క॥ అప్పెను వేసవి విభవము
విప్పగుదన్నగర నికట వృషగిరి హరికిం
దెప్పతిరునాళ్ళు రాముద
మొప్పన బరదేశి విప్రుడొక్కడు భక్తిన్।

టీ॥ అప్పెనువేసవి=అగ్రీష్మమందు విభవము=వైభవము విప్పగు=అతిశయమగు తన్నగరి అమధుర యొక్క నికట=సమీపమందున్న వృషగిరిహరికిన్ .... వృషభా చలపతియైన సుందరబాహువనేస్వామికి తెప్పతిరునాళ్ళు = తెప్పఉత్సవము రా = రాగాను ముదమొప్పన్=సంతోషము ప్రకాశించగాను విప్రుడొకడు=ఒకబ్రాహ్మణుడు భక్తిన్= భక్తిచేతను.

ముగింపు :

ద్రుహిణాండ కరండక ధూర్వహ గ
ర్భహరార్భక దుర్భర పర్వ తపః

కుహనార్భక వార్భృత కోనిరి హా
రి హిరణ్మయ హర్మ్య చరిష్ణుపదా।

టీక। దుహిణాండకరండకధూర్వహగర్భ ద్రుహిణాండ=బ్రహ్మాండమనెడి కరండక = సంపుటముల యొక్క ధూర్వహ=భారమును వహిస్తున్నటువంటి గర్భ=ఉదరంగలస్వామీ కుక్షిస్థాఖిల బ్రహ్మాండుడ వనుట హవార్భక=కుమారస్వామియొక్క దుర్భర=భరింప శక్యంగాని పక్వతపః = పరిపక్వమైనతపస్సనేటి కుహనార్భకవార్భృతికోరి కుహనార్భక = మిధ్యా పదార్థమైన వారీ = ఉదకంయొక్క భృతి = నిండగలిగిన కోనిరి = స్వామిపుష్కరిణియొక్క = సమీపమందలి కోనిరిశబ్దముదేశీయము హారి= మనోజ్ఞమైన రమణీయహారివల్గుఇత్యమరః హిరణ్మయహర్మ్య = స్వర్ణవిమానములయందు చరిష్ణు=సంచరణశీలములైన పద=పాదారవిందములుగల స్వామీ।

గద్య:

మ। ఇది యంద్రోక్తి యథార్థనామ యవనాస్యకూర్పర్ణ కెంబావి వా
రిద పద్ధత్యవరోధి ప్రపవలయ శ్రేణీ విఘాత క్రియా
స్పద సేనాగ్రగ కృష్ణరాయ మహి భృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైన పద్యంబులన్।

ఇది సౌరాజ వశిష్ట భాస్కరవరేంద్వాది సిద్ధాంత మం
జు దురావేద్య రహస్యవేది విలసద్జ్ఞా నీ జగన్నాథ భూ
సుదతీవల్లభ నామ కాస్మదుదితా స్తోకార్థ దాముక్తమా
ల్యద టీకావరమొప్పు పంచమ మనోజ్ఞాశ్వాస పద్యాళికిన్ ।

విశేషాంశములు :

ఇది జగన్నాథ దనురాజు రచించిన టీక.

గ్రంథము క్రిమిదష్టమై, శిథిలముగా నున్నది. గ్రంథ మాద్యంతములు లేవు. అనగా గ్రంథాది ద్వితీయాశ్వాసములో 71వ పద్యమునుండి గలదు. గ్రంథాంతము 5వ, ఆశ్వాసాంతము వరకు గలదు.

# ఆముక్తమాల్యద

## శ్రీకృష్ణదేవరాయలు

( టీకా సహితము )

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 1506 | కాల్ నెం. | టి. 3–228 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 26 |
| పత్రపరిమాణము | : 40×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 8 |

ప్రారంభము :

చ. .... .... ....

.... .... ....

.... లక్ష్మిచే సరమణుల్మొరయంగ దదీయ లక్ష్మి శం

కను మొగమెత్తి చూచు తరి కన్నులు కేలికి ముయ్యగా బలెన్। (2–15)

టీక। అనిమిష పట్టణంబు=ఇంద్రపురము పురహర్మ్య పతాకలు పుర=మధురాపట్టణమందలి హర్మ్య=గృహోపరియందున్న పతాకములు=టెక్కెములు మువ్వమ్రోతతో=చిరుఘంటల రవముతో తన=స్వర్గపురముయొక్క, గృహపంక్తిపైని వున్న కలశ తామరసంబులు గప్పు=కమలములవంటి కలశములను గప్పగాను నిజలక్ష్మి=అనిమిష పట్టణలక్ష్మి, శంకను=శంకచేతను, మొగమెత్తిచూచుతరి=మొగమెత్తిచూచేసమయమందు చేసరమణుల్=చేతనున్న గొలుసులు, మొరయున్=ధ్వనిచెయ్యగాను తదీయలక్ష్మి=ఆ మధురాపురలక్ష్మి కన్నులు=నేత్రములను కేలికి=పరిహాసములకు, ముయ్యగా బలెను= మూసినవలెను, క్రిందనుండును=క్రిందుగావుండెను। అత్రమధురాపురస్థహర్మ్యస్థితకేతూ నాంపురలక్ష్మి హస్త...నోత్ప్రేక్షణోదుత్ప్రేక్షా పురహర్మ్యపతాకాచ్ఛాదితస్వర్గహర్మ్య స్థిత తామరస కలశానాంలక్ష్మీ ముఖత్వ కథనా దుపమా.

చ. ఘనగత శంప గంచ మిడి కాటుక దీర్చి పునుం గినోష్మ ద

ట్టినది యలంది కైశికము తేవ ప్రభాత శశాంకు మోప వి

చ్చిన నవహల్ల కాళి గయిచేసి సతుల్పతితో రమింతు ర

మ్మనిజరతాంగన ల్కలహము ల్కృప నేర్పున దీర్ప మేడలన్.

టీక। ఘనగత=మేఘగతమైయున్న ,శంప=మెరపునందు,కంచమిడి=కంచమునువుంచి,కాటుక దీర్చి=అందునపుట్టిన కాటుకను కన్నులయందుంచుకుని,లోకమందు సద్యస్కాలమందు కాటుక నిమిత్తమై దీపము మీద కంచము వుంచి లేకాటుగ బట్టగా అద....చు కోవడము కలదు గనక, ఇనోష్మ=సూర్యకిరణముల=వేంద్రచేతను, దట్టినడి=కసటుబోయి గట్టి బడ్డటువంటి పునుంగు, జెవాజి=తట్టుపునుంగనుట, అలంది=పూసి కైశికముతేవ కేశస మూహ ప్రాంతమందు ప్రభాతశశాంక....ప=ఉషఃకాలచంద్రుడుమోపగానే విచ్చిన= వికసించిన, నవ=నూతనమైన, హల్లకాళి= చెంగల్వసమూహమును,గై చేసి = అలంక రించుకుని, సతుల్ స్త్రీలు అమ్మనిజరతాంగనల్ = సప్తర్షివృద్ధదంపతులు, జరతావృద్ధ కర్కశా వితి నానార్ధ రత్నమాలాయాం, కలహముల్ = ప్రణయకలహములను,కృప= దయతచేను నేర్పునన్=అనుకూల కరణకౌశలంచేతను తీర్ప=నివారింపగా పతితో= స్వభర్తతో రమింతురు=కూడుదురు అత్రసౌధానాం నక్షత్ర మండల పర్యంత మౌన్నత్య కథనా దతిశయోక్తిః॥

ముగింపు:—

చ. నమసి కళావశిష్టమగు చందనశైల సమీరణంబు కృ
త్రిమ గతి నింద్ర జాలమున దేదొఁణగెన్ భువి తాళవృంత జా
లము లదిమాయ యౌటకు దలంప దదీయ మయూర పింఛికా
భ్రమణమె సాక్షిగాదె నగరంబున నట్టికడింది వేసవిన్ ।

టీక। భువి=భూలోకమందు, తాళవృంతజాలములు=విసనకఱ్ఱలు, నమసి=నశించి కళావశిష్ట మగు కళామాత్రావశిష్టమైన కథావశిష్టమన్న పాఠమందు మలయమారుతమన్న మాట మాత్రము దిగుబడ్డదనిఅర్థము చందనశైలసమీరణంబు=మలయమారుతమును కృత్రిమ గతిని=మాయచేతను ఇంద్రజాలవిద్యచేతను తేదొఁణగెన్=తేదొరకొనెను అది=ఆతెచ్చుట మాయయౌటకు=అసత్యమౌటకు దలంపగ=విచారించగా తదీయ=ఆవిసినకఱ్ఱలసంబం ధియైన మయూరపింఛికాభ్రమణమె=నెమలిపింఛముయొక్కసంచారమె సాక్షిగాదె=గురు తుగాదా నగరంబున=ఆపట్టణమందు అట్టి=అటువంటి కడిందివేసవిన్=అరుదైనవేసవిని వ్యాజేంద్రజాలవిధి సాధక పింఛికావా అనిన్ని వైహారికామోహనపింఛికాంతె అనిప్రయో గములున్నవి గనక ఇంద్రజాల విద్యకు మయూర పింఛం కారణం గనక ప్ర....గము యీపద్యమందు తాళవృంతములు మలయ మారుతమును ఇంద్రజాల విద్యచేతను తేవ టానకు ఉపక్రమించినవని చెప్పి ఉత్తరార్థము... తత్సమర్థనం చేసినాడు గనక సామాన్యేన విశేష సమర్ధన రూపోర్ధాంతరన్యాసోలంకారః ।

గీ॥ అట్టి వేసవి బెడిదంపు వెట్టకతన హస్తము చెమర్చి సారెకు లస్తకంబు
దుసికిలగగాదె సవరింప వసముగాక పుష్పబాణుని చెరుకువి ల్బుదమి బడియె॥

**విశేషాంశములు :**

అసమగ్రగము. క్రిమిదష్టము. గ్రంథపాతము కలదు. ఆద్యంతములు లేవు. వ్యాఖ్యాత నామము గోచరము గాదు. ప్రథమ ద్వితీయాశ్వాసములోని కొన్ని పద్యములు మాత్రము కలవు. ఈ పద్యములకు టీక అలంకారనిరూపణ మాత్రము కలవు.

# ఆముక్తమాల్యద

## శ్రీకృష్ణదేవరాయలు

[టీ కా స హి త ము]

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : | 3721 | కాల్ నెం. | : | టి 3-123 |
| ప్రతి | : | తాళపత్రము; అసమగ్రగము | పత్రములు | : | 98 |
| ప్రతి పరిమాణము | : | 38×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : | 6 |

ప్రారంభము :

....నిష్కామండైన యోగియగు వాడు మనోనైర్మల్య సంపాదనకు నాచరింపపలయు నివి కామ్యంబులైన విశిష్ట ఫలంబులు ! నిష్కాములకు ముక్తి దంబులునగు నిట్టి యమ నియమంబులు వదలక భద్రాసనాదులయందు నొకటి నవలంబించి ప్రాణాభిధానంబగు పవమానంబు నభ్యాస వశంబున వశంబుసేయవలయు నది ప్రాణాయామం బనంబడు నట్టి ప్రాణాయామంబు సబీజాబీజ సంజ్ఞలం బరగునదియ ప్రాణాపానంబుల మి థోను రోధంబు లయ్యుభయ నిరోధంబు రేచకాది త్రైవిధ్యముం బొందు! మొదల నాచెప్పిన స బీజాబీజ సజ్ఞలందు నంతస్థూల రూపాచలంబియగు నదియ సబీజం బితరం బబీజంబు మరి శబ్దాది విషయంబులకుం బ్రవణంబులగు నింద్రియంబులకు నింద్రియంబుల దృష్టి మనసాధీనంబులు సేయుట ప్రత్యాహారంబు ముముక్షున కవశ్య కర్తవ్యంబు దీని వలన నతి చంచలంబులగు నింద్రియంబులకు నాత్మావశ్యత గలుగు నివి తన వశంబులుగా కుండిన నయ్యోగి సాధకుండు గానేరడు ప్రాణాయామంబునం బవనంబును ప్రత్యాహారంబుల నింద్రియంబులును వశంబైన పిమ్మట జిత్తంబు శుభాశ్రయంబు నొందెడు ననుటయు ఖాండిక్యుం డిట్లనియె॥. (2-75)

టీక మరి బ్రహ్మ చర్యాదులగు నియమంబు లేనును - ఇంకా నున్ను బ్రహ్మచర్యము మొద
లైనటువంటి నియమము లైదున్ను । స్వాధ్యాయాదులగు నియమంబులేనును - స్వాధ్యా
యము మొదలైన నియములేనున్ను । నిష్కాముండైన యోగియగువాడు - ఫలాంత
రములు గోరని యోగియైనవాడు । మనోనైర్మల్య సంపాదనకు నాచరింపవలయును -
మనస్సు విమల మయ్యే టందునకు చెయ్యాలెను । ఇవి కామ్యంబులైన విశిష్ట ఫలదం
బులు — యీయమ నియమములు కామ్యములైతే స్వర్గాది ఫలములనిచ్చును. నిష్కాము
లకు ముక్తి దంబులగును - ఫలాంతరములు కోరని వారికి మోక్షము నిచ్చును । ఇట్టి
యమ నియమంబులు వదలక । భద్రాస నాదులయందు ఒకటి యవలంబించి -భద్రాస
నము మొదలైన వాటియందు వొకదానిని యవలంబించి । ప్రాణాభిదానంబగు పవమా
నంబు నభ్యాసంబున వశంబుసేయవలయును - ప్రాణమనే పేరుగల శరీరగత వాయువును
అభ్యాసముచేత తనకు వశము చేసుకోవలెను । అదియ ప్రాణాయామంబనబడును—
ఆ శరీరగత వాయువును వశము చేసుకొనేదే ప్రాణాయామ మనబడును । అట్టి ప్రాణా
యామంబు స బీజాబీజ సంజ్ఞలంబరగును— అటువంటి ప్రాణాయామము సబీజమనిన్ని,
అబీజ మనిన్ని ఉండును । అదియ ప్రాణాపానంబుల మిథోనురోధంబు — ఆ ప్రాణా
యామమె హృదయగతమైన ప్రాణవాయువున్ను గుదస్థానమందువుండె అపాన వాయువు
నున్ను ఏకముజేయుట। అయ్యుభయ నిరోధంబున రేచకాది త్రైవిధ్యంబునం బొందు-
ఆ ప్రాణాపానవాయువుల రెంటిని నిలుపుటచేత రేచక పూరక కుంభకములని మూడు
విధముల నుండును । మొదల చెప్పిన సబీజాబీజ సంజ్ఞలందును-మొదటను నేను చెప్పిన
సబీజమున్ను అబీజమున్ను అనే రెంటి యందున్ను । అంతస్థూల రూపావలంబియగు।
నదియ సబీజంబు — మనస్సులో స్థూలరూపమును అవలంబించి ఉండేదే సబీజంబు। ఇత
రం బబీజంబుస్థూలరూపావలంబి గానిది అబీజము। మరి—ఇంకా నున్ను। శబ్దాది విష
యంబులకుం బ్రవణంబులగు నింద్రియంబులం ద్రిప్పి మన స్వాధీనంబులు సేయుట
ప్రత్యాహరంబు—శబ్దాది విషయములకు పాలుపడకుండా యింద్రియములను మలపి
మనస్సుకు వశము జేయుట ప్రత్యాహార మనిపించుకొనును । ముముక్షువునకును నవశ్య
కర్తవ్యంబు—మోక్షేచ్ఛగల వానికి గట్టిగా చేయవలసినది । దీని వలన — ఈ ప్రత్యాహా
రము వలనను । సతిచంచ అలంబులగు నింద్రియంబులకు నాత్మవశ్యత గలుగును
॥స్పష్టం॥ అవి దనవశ్యంబులు గాకుండిన నయ్యోగి యోగసాధకుండుగా నేరడు — ఆ
యింద్రియములు స్వాధీనములు గాకుంటె ఆ యోగి యీ చెప్పిన యోగమును సాధించ
లేడు। ప్రాణాయామంబున పవనంబును-ప్రాణాయామముచేత వాయువునున్ను ప్రత్యాహ
రంబున— నింద్రియంబులును । ప్రత్యాహారముచేత నింద్రియములున్ను। వశంబైన

పిమ్మట—స్వాధీనమైన తర్వాతను। చిత్తంబు శుభాశ్రయంబు నందెడు ననుటయు—మనస్సు శుభాశ్రయమును పొందుచున్నది। అని కేశిధ్వజుడు అనంగానే ఖాండిక్యుం డిట్లనియె। స్పష్టం॥ ఈ వచనములో యమనియ మాసనప్రాణాయామ ప్రత్యాహారము లనే.... వివరించచడ మాయెను।

ముగింపు :

క. శూరాలాపములకు నతి శూరుడు దానైన పతియ సో కోర్వదగున్
వా రు బ్బర రందున్ ద్విజు శూరత దొరలందు గనుట సూ కార్యమిలన్।

టీక శూరాలాపములకు। తాను స్వయం। అతిశూరుడైన పతియ—అధికశౌర్యముగల రాజె। శూరాలాపములకు—శౌర్యవంతుల పలుకులకు। సో కోర్వదగున్ — సహించవలెను। వారు। ఉబ్బు అరరు—ఆశూరులు సంతోషము చెదరు।అందు — ఆ శూరులయందున్న। దొరలందు — సేనానాయకుల యందు నిజశూరత — తన శౌర్యము కనుట। సూ కార్యమిలన్ — కలగ చూచుట భూమియందు కార్యము — అనంగా శూరులు శౌర్యాలాపము లాడితె ప్రభు .... ....

గద్య :

ఇది పాత్ర ప్రహరేశ్వర ప్ర.... ష్టోత్కళానీక గు
ప్త దివిస్పృక్పటు యంత్ర.... పలి హృద్బాహాసికద్రూజ దీ
వ్య దుదారోద్యమ కృష్ణరాయనృప సంజ్ఞా స్మత్కృతాముక్తమా
ల ద్య..నా శ్వాసము హృద్య పద్యము తృతీయంబై మహిం.... ల్పగున్।

టీక ఇది పాత్ర ప్రహరేశ్వరేత్యాది—పాతృలు ప్రహరేశ్వరులు మొదలైన, బహ్వాష్ఠ—విస్తారమైన। ఉత్కళానీక—ఉత్కళ దేశపు సైన్యము చేతను। గుప్త .... ఘవంటి।... ఆకాశమును స్పృశించే టటువంటి! పటు—దృఢమైన।యంత్ర—కోటగలకొండ ప లిహృత్—నేలకొండ...హరించినటువంటి। బాహసి—చేతబట్టిన ఖడ్గమనేటి. కద్రూజ—సర్పముయొక్క। దీవ్యత్—ఓపుచున్న। ఉదార—మహత్తైన ఉద్యమ—యెత్తుట గల। కృష్ణరాయనృపసంజ్ఞ—కృష్ణరాయ భూపతి అనే పేరుగల। అస్మత్— నా చేతను కృత—చేయబడ్డటువంటి। ఆముక్తమాల్యదనే గ్రంథమునందు। హృద్యపద్యము—మనోహరములైన పద్యములు గల। ఆశ్వాసము తృతీయంబై—యీ ఆశ్వాసము మూడోదై మహిం బొల్పగుం — భూమియందు వొప్పును.

విశేషాంశములు :

గ్రంథపాతము అధికముగా నుండుటచే మొత్తమాశ్వాసములు పేర్కొనుట కష్టము. తృతీయాశ్వాసము చివరి నుండి గలదు. గ్రంథాంద్యంతములు లేవు.

వ్రాత బాగుగానున్నది. ఈ ప్రతియందుమూలముతో బాటు టీకకూడ గలదు. టీకా కర్త నామము మృగ్యము.

# ఆముక్తమాల్యద
## శ్రీకృష్ణదేవరాయలు

[టీ కా స హి త ము]

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 3722 | కాల్ నెం | : టి 3-127 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 130 |
| పత్ర పరిమాణము | : 38×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 8 |

ప్రారంభము :

శ్రీ కమ .... దానును కౌస్తుభంబు....
... టి యు నుదారతదోప పరస్పరాత్మలం
దాకలితంబులైన తమ బైకి దోప య
స్తోకత నందు దోచెనన శోభిలు వేంకటభర్త గొల్చెదన్।

టీక। .... ....
నీ య హారమణి జెన్నగుదానును-శ్రీ అమ్మవారి యొక్క
.... ... యాదదగినటువంటి।హారమణి
ముక్తావళి యందలి.... ....
— యందు।జెన్నగు ప్రతిఫలించినటువంటి
తానును .... .... ....
రుడున్న। కౌస్తు భంబునందా కమలా వధూటియు నుదారత దోప—కౌస్తు భంబునందు।
స్వామి వక్షస్థలమందలి లక్ష్మీదేవిన్ని। ఉదారత దోప లెస్సగా
ప్రకాశించగా। పరస్పరాత్మలయందు అన్యోన మనస్సుల....—

స్వస్వరూపములు। అచ్చుత బైకి దోచి—ఇద్దరి మనస్సుల నైర్మల్యం చేతనున్ను స్ఫటి కములోవుండే........తనందు దోచినన। ఆ లక్ష్మీదేవి యొక్క ముక్తాహారము నందలి నాయకమణి కౌస్తుభమణులయ.... .... .... ....చున్నటు వంటి। వేంకటభర్త గొల్చెదం— వేంకటేశ్వరులను సేవించెదను। అనగా లక్ష్మీ

దు ల్మకృతీదేవిన్ని। ప్రతిఫలించగా యిద్దరిలోను.... .... గా నున్ను ప్రకాశించినట్టు వలెనే వేంచేసివుండేవారు శ్రీ శ్రియః పతులు యిద్దరున్ను అని తాత్పర్యము।.

యీ పద్యములో శ్రీ శ్రియః పతులని... ... ..పద్యాంతమందు వేంకటేశ్వరుని మాత్రమే సేవించుట పుమాన్ శ్రియా అనే వ్యాకరణ సూత్రంచే తను శ్రీ పురుష వాచక శబ్దములలో పురుష.... .... .... మే శేషించునని చెప్పంబడింపిగనుకను। ఈ పద్యములో శ్రీ శబ్దము మొదట ప్రయోగించినందున వర్గ గణ శుద్ధులు గలవు దేవతా వాచకాశబ్ద .... ......వ భద్రాదివాచకాః। తే సర్వేనైవ నిందాస్యుర్లిపిలో పివా అన్నారు గనుకను ఈ పద్యమందు విశిష్ట దేవతా నమస్కార రూపమైన మంగ ళము సేయ బడినది 1. ఆశీ ర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖం అనే ప్రమాణం చేతను।।

వ. నా విన్నపంబూను నాముక్తమాల్యదా మహా ప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన.

మ. లలితో ద్యాన పరం పరా పిక శుకాలాప ప్రతి ధ్వానముల్
బలభిన్నీల హరిన్మణీ పికశుక స్వాన భ్రమంబూన్ప మి
న్నులతో రాయు సువర్ణ సౌధముల నెందుం జూడ జెన్నొంది శ్రీ
విలిబుత్తూరు సెలంగు పాండ్యనగరోర్వీరత్న సీమంతమై॥

టీక। లలిత—సుందరములైనటువంటి। ఉద్యాన పరంపరా— ఉద్యానవన సమూహములయందు పిక—కోయిలల యొక్కనున్ను శుక-చిలుకలయొక్కనున్ను। ఆలాపా—పలుకులయొక్క ప్రతి ధ్వానముల్—ప్రతిధ్వనులు। బలభిన్నీల—యింద్ర నీలములచేతనున్ను। హరిన్మణీ- గరుడ పచ్చల చేతనున్ను నిర్మించ బడినటువంటిపిక- కోయిలల యొక్కనున్ను। శుక చిలుకల యొక్కనున్ను। స్వాన=పలుకులనె భ్రమం బూన్ప భ్రమను సంపాదించంగా మిన్నులతో రాయు-ఆకాశమును ఒరుస్తున్నటువంటి। సౌధ శబ్దము బహు వచనమున బట్టి ఆకాశ శబ్దమునకు బహు వచనము। సువర్ణ సౌధములను బంగారు మేడల తోటి యందుంజూడ యెక్కడ జూచినా। చెన్నొంది వొప్పిదము గల్గి శ్రీ విలిపుత్తూరు అనే దివ్య తిరుమలస్థలము। పాండ్యనగరోర్వీరత్న సీమంతమై। పాండ్య—పాండ్యదేశమందలి

నగర—పట్టణములయొక్క। ఉర్వి-భూమికి। రత్న సీమంతమై।-రత్నములతో కూర్చిన పాపిటయై। చెలంగును— ప్రకాశించును। అనగా ఉద్యానవనములలో కోయిలలున్న చిలుకలున్న పలుకులు బలికితేను వర్ణ సౌధముల మీదను ఇంద్రనీలముల చేతను జేసిన కోయిలలు చిలుకలు బలికినట్టి ప్రతిధ్వనులు వెళ్ళగా ఆధ్వనులువిని ప్రజలకు మేడల మీదివె పలుకు చున్నవని భ్రమనుపుట్టిస్తూవున్న దనుట॥.

చ। మలిచి పయోజ కోశముల మాడ్కి నొనర్చిన పద్మరాగపుం
కలశపుబెట్టిదాల్ బొమిడి కంబులతో నపరంజి యోడు బి
ల్లల నల వైజయంతము జలంబున గెల్వగ దంశితంబులై
నిలిచినయట్లు మాడుగు లనేకము లుల్లసిలుం బురంబునన్॥.

**ముగింపు :**

విజ్ఞానమున జేసి విషయాది . . . . హరించి బ్రహ్మము బరేశు
జింతింప వలయు నిశ్శ్రేయసంబున కట్లు జింతింప నతడు దచ్చింతకునకు
నాత్మ భావం బిచ్చు నాకర్షణము . . . . సారముదార్చునట్లు యోగ
మన యమాదిక విషయంబైన యాత్మ ప్ర యత్నంబున కధీనయైన సాత్త్వి
కపు మనో గతి యెయ్యదిగలదు దాని బ్రహ్మ సంబంధినిగజేయు ప్రౌఢి సూవె
యిట్టి వైశిష్ట్య ధర్మమెందేని గలుగు నట్టి యోగంబు గలిగిన యతడె యోగి॥

టీక విజ్ఞానమునజేసి। శాస్త్రజన్య జ్ఞానముచేతను—విషయాదివలన—శబ్దాది విషయముల వలనను। నెమ్మన మాహరించి—మనస్సుత్రిప్పి। నిశ్శ్రేయసంబునకును — మోక్షమునకు। బ్రహ్మము బరేశు చింతింపవలయు - పరాత్పరుడైన బ్రహ్మమును ధ్యానముసేయవలెను। అనగా మోక్షార్థియైనవాడు మనస్సున విషయాంతరము తలపక। బ్రహ్మధ్యానము సేయవలెను। అట్లు చింతింపను—ఆలాగున ధ్యానము చేసితేను। ఆకర్షణమున— సూదంటిరాయియందు। కార్యాయస్సారము—చెయ్యబడ్డలోహరజస్సును। తార్చునట్లు— ఆకర్షించినట్లు అతడు ఆ పరబ్రహ్మము। తచ్చింతనునకు— ఆధ్యానము చేసేవానికి। ఆత్మభావంబిచ్చును। -స్వస్వరూపమును సాక్షాత్కరింపజేయును।. అనగా సూదంటురాయి చూపితె యినుపతునక అంటుక వచ్చినట్టు పరబ్రహ్మ ధ్యానమును సేయంగానే పరస్వరూపము కానవచ్చుననుట। —యోగమున। యోగమనగాయేమంటె। యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణసమాధ్యష్టాంగయోగాదులతో కూడిన స్వప్రయత్నమునకు। అధీనమైన వశమైనటువంటి। సాత్వికపు మనోగతియెయ్యదిగలదు-

సత్వప్రచురమైన మనో వ్యాపారము యేది గలదో దానిని ఆ మనో వ్యాపారమును బ్రహ్మ సంబంధినిగా జేయుప్రౌఢిసూవె—బ్రహ్మాది విషయమయ్యేటట్టుగా చేసె ప్రజ్ఞా విశేషము సుమా। స్వాధ్యాయ బ్రహ్మచర్యాది సాధనములు చేస్తూరాగా। రాజస తామసములు ఆగి శుద్ధ సత్వమయమైన మనస్సు పరబ్రహ్మ ధ్యానముతో కూడేటట్టుగా చేయుటయె యోగమనుట। ఇట్టి వైశిష్ట్య ధర్మమెందేని గలుగుసు—యిటువంటి బ్రహ్మ విషయక మనోవ్యాపార .... యోగమందు కలదో అట్టియోగంబు గలిగిన యతడె యోగి—అటువంటి యోగ సిద్ధి గలవాడె యోగి।.

గద్య :

ఇది కర్ణాటధరాధృతి స్థిర భుజా హేవాకలబ్ధేభరా
డుదయోర్వీధర తత్పితృవ్య కృతనవ్యోపాయనోష్ణీషర
త్నదృగంచ త్పదకృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమా
ల్యద నాశ్వాసముహృద్యపద్యముల నాద్యంబై మహింబొల్పగున్।

టీక :—

కర్ణాటధరా—కర్ణాట భూమియొక్క। ధృతి—ధరించుటయందు। స్థిర — స్థిరమైనటువంటి। భుజా—బాహువులయొక్క। హేవాక—విలాసముచేతను। లబ్ధ—దొరక బ....టువంటి। ఇభరాట్—గజపతియొక్క—ఉదయోర్వీధర— ఉదయగిరి దుర్గము గలిగినటువంటిన్ని। తత్పితృవ్య తత్—ఆగజపతికి। పితృవ్య—పినతండ్రియైన ప్రహరేశ్వరుని చేతను కృత—చేయబడ్డటువంటి। నవ్య—నూతనమైనటువంటి ఉపాయన కానుకయైనటువంటి। ఉష్ణీష —కిరీటముయొక్క। ఉష్ణీష శ్శిరోవేష్ట కిరీటయోః। రత్నముల యందు। దృక్—దృష్టులచేతను। అంచత్—ఒప్పుచున్నటువంటి। పద పాదములు గలిగినటువంటి। కృష్ణరాయ వసుధాధ్యక్షోదితా—కృష్ణరాయా కృష్ణరాయలనే పేరుగల। వసుధాధ్యక్ష—భూపతిచేతను। ఉదిత—చెప్పబడ్డటువంటి। ఆముక్తమాల్యద అనే ప్రబంధమునందు। హృద్యపద్యములను— మనోహరములైన పద్యములచేతను । ఇది యీ ఆశ్వాసము ఆద్యంబై —మొదటిదై మహిన్ —భూమియందు। పొల్పగున్— ఒప్పును। ఉదయగిరి దుర్గము పోటు పోకుండాను కృష్ణదేవరాయలు ఆదుర్గమున కధిపతియైన గజపతి పిన తండ్రి తల ద్రొక్కక స్నానము సేయనని వొకనాడు ప్రతిజ్ఞ జేసిన రాయలవారి

సేనలు లగ్గలకెక్కి దుర్గము తీసుకొని ఆ దుర్గాధికారిని పట్టుకొనివచ్చిన అతడు రత్న ఖచితమైన తన కిరీటము కానుకగా రాయలవారి ముందర నుంచె గనుక ఆ కిరీట రత్నముల యందు దృష్టిని నిలిపి క్షణమాత్రము యిక్కడక్కడ సంచరించి స్నానము సేసెనని తాత్పర్యము.

విశేషాంశములు :

అసమగ్రము. గ్రంథశైథిల్య, గ్రంథపాతములు కలవు. 3వ ఆశ్వాసములో 74 వ. పద్యము వరకు గలదు. టీకాకర్త పేరు మృగ్యము.

ప్రథమాశ్వాసాంత గద్య (పద్య)ముల తరువాత ఇట్లు గలదు.

ఆంధ్ర కవితా పితామహుండైన పెద్దనాఖ్యవరుడు (?) రచించు నాముక్తమాల్య దను ప్రబంధంబు వ్రాసితి తారతమ్య మాత్రయతులును ప్రాసముల్ మరియు నెరిగి ।.

# ఆరాధ్య దేవర లింగార్చన మహిమ
# పండితారాధ్యచరిత్ర

## పాల్కురికి సోమన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5543 | కాల్ నెం | : టి 3-306 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 15 |
| ప్రతి పరిమాణము | : 42×3.5 సెం.మీ | పత్ర పంక్తులు | : 6 |

ప్రారంభము :

భక్తైక చైతన్య ప్రణుత పర్జన్య సుక్షాతి ధన్య బాదోదక మాన్య
నపనీతమన్య నియంత్రితదైన్య నపహ్నుత భవజన్య నఖిలైకమాన్య
దూతమాలిన్య నిర్మాతృకాస్తన్య వీతమన్మథసైన్య విగతకాఠిన్య
నమితవదాన్య సనన్య సామాన్య శమిత జఘన్య సాక్షాదుపమన్య
ఖండిత భవతరు దండిత విషయ మండిత సద్గుణ బండితారాధ్య
నసదృశ భక్తి రసామృతవార్ధి దెసల వసుంధర దివి నిట్టవాడువ

నంతర్నిహిత సాంబ యఘగిరిశంబ శాంతగుణ కదంబ కాంత సూరాంబ
పేరెన్నబడిన శ్రీ బెలిదేవి వేమ నారాధ్యు లాదిగా నలరు జంగమము
దవిలి పండితవిభు దర్శించు వేడ్క

*　　*　　*

ముగింపు :-

నల్లవో పండిత నతపండితౌఘ నల్లవో పండిత నందిత కీర్తి
మఱబాపు పండిత మత్కులాచార్య మఱబాపుపండిత మల్లికార్జునుద
వినికని యెరుగము మునుకథలందు కనుగొంటి మిపుడు ప్రఖ్యాతంబుగాగ
యెట్లన్న వీరమాహేశ్వరాంకుండు దట్టుంతు దురితఘరట్టుండు ఘనుడు
శివభక్తియుక్తి పెక్కువదొల్లి యట్లు దవిలి శ్రీ బసవన దండనాయకుడు
సంగతి ప్రాణంబు సంధించె గాదె జంగమం బంద తచ్చరిత మెట్లనిన.

విశేషాంశములు

ఈ కథాభాగము పాల్కుర్కి సోమన విరచితమగు పండితారాధ్యచరిత్రలోనిది. ఇది దీక్షాప్రకరణ మందలిది. ఈ ప్రతి బాగుగానున్నది. కొంచెము పాతబడుచు చుక్కలు ఏర్పడుచున్నవి. లిపి గ్రాహ్యము. లేఖన దోషములు కొద్దిగా గలవు.

## ఉత్తర రామాయణము

### కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3979 | కాల్ నెం : టి 3—382 | |
| ప్రతి | : తాళపత్రము, సమగ్రము. | పత్రములు | : 242 |
| ప్రతి పరిమాణము | : 40.5×3.5 సెం. మీ | పత్రపంక్తులు: | 8 |

ప్రారంభము :

శా. శ్రీ రాధాధర బింబముం దొరయు రాజిల్కన్నిజోరస్థలీ
రారాజ న్మణికాంతి రావిలిచి తద్రాకేందు బింబాననా
స్మేరాస్యద్యుతిచే కృతార్థుడగుచుం జెల్వొందు గోపాంగనా
జార గ్రామణి కృష్ణ దీవుత మహైశ్వర్యంబు మా కెప్పుడున్.

సీ. పుష్కర విహరణ స్ఫురణంబు వహియించి యచలాను గుణవృత్తి యవధరించి
యార్యాభిగణ్య సౌకర్యంబున రహించి ప్రబల హిరణ్యా వర్ధనత మించి
త్రిభువనాంచిత రూప విభవంబు ప్రాపించి భృగు కులంబు పవిత్రముగ జనించి
అంభోజ భంగ లీలాసక్తి వర్తించి కామపాలన రీతి ఖ్యాతిగాంచి

గీ. పుణ్య వనితా జనముల పూజలు గ్రహించి(?) కలికి తన మెందు నిట్టిది గలదె యనగ
పొలుపు చెలువుగ నలువొందు కలిమి చెలువ మెచ్చి నిచ్చలు మాకోర్కె లిచ్చుగాత.

వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన శ్రీమదుత్తర రామాయణంబు మొదట సంక్షేప
రూపంబుగా నా రచింపం దలంచిన పూర్వ రామాయణ కథా ప్రపంచమునకు నాది
కారణంబుయిన సాకేత పట్టణం బెట్టి దనిన.

ఉ. శ్రీ తరుణీ విహార సరసీజ విరాజిత రాజసౌధ సం
ఘాతము గోపుర స్ఫురిత కాంచన కుంభ విభాభి భూతఖ
ద్యోతము ద్యోతమాన మణి తోరణవార సమేతమొప్పు సా
కేతము వాత సంచలితకేతుపట ప్రహతాభ్రజాతమై.

మ. హరిదశ్వస్ఫురదశ్వ ఘోర ఖుర భిన్నాతామ భూనారికే
శరసారుట్పల నిర్గళద్విమలనీరస్ఫార ధారాధరాం
తరవర్తి .... తదోయపూర్తి గనిక్షీదానన్ మబ్బు ధారాధరా
ఖ్య రహించెన్ జలరాశి వ్యర్థమయి ఖేయస్ఫూర్తి గొల్చెన్‌బురిన్.

సీ. కృష్ణపక్ష విభావరీ వేళల జకోర సమితి చంద్రికలంచు సంతసింప
వలిప క్రౌంచళుకు మేల్ తెలిపట్టు పుట్టముక్ కట్టినయట్లు దిక్కాంతలలర
గంగాతరంగ సంఘము వీటిపై బొర్లి యేల వచ్చెనటంచు నింద్రుడదరయ
దారకాకై రవోద్యన్నభః కాసార ముదుటు రాయంచల యునికి దెలుప

ఖరగు శరదంబుధర దిగంబర గురుప్ర కాశపేశల వజ్ర సంఘటిత వప్ర
ద్యోప్రరోచిః పరంపరల్ దివము ప్రాకి పరతమోలీల దూల నప్పట్టణమున.

ముగింపు :—

ఉ. ఉత్తరమున నిట్లు శ్రీరమణి నించుక భూవనితాంస పీఠి శ్రీ
కరమిడి నీళ పెందొడల క్రమ పద్మాబ్జము సాచి కేళినీ

శ్వర శతకోటి రూప విభవం బెసగన్ ఫణిరాట్ఫణాళిపై
నొరగి ప్రహర్షమొందె హరి యుజ్వల సౌఖ్య రసైకలోలుడై.

గీ. ఇటువలె నిసర్గ వైభవం బెసక మెసగ శ్రీధరా నీళలం గూడి శేషగరుడ
ముఖ్యదాసుల బ్రోచుచు ముదము జెందె నఖిల రక్షాచణుండు నారాయణుండు.

గీ. ఈ మహాకావ్య మతి భక్తి నెవ్వడు విను నత డిహంబున సకల సౌఖ్యములు జెంది
తనివి గని యంత దుర్దోషగుణవిరహిత శాశ్వత బ్రహ్మలోక వాసంబు జెందు.

సీ. ఇది త్రిలోక స్తవ్య మిది దివ్య బుధ శ్రావ్య మిది దివ్య మిది భవ్య మిది యఘవ్య
మాక్షర సంభావ్య మాది కావ్యం బిది ద్విజుడు పఠించి వాగ్విదుడు నగును
క్షత్రియుండు పఠించి సర్వంసహా భర్త యగు వైశ్యుడు పఠించి యమితపుణ్య
ఫలశాలియౌ శూద్రకులజుడు పఠియించి వంశంబులో వన్నెవాసి గాంచు

నఖిల వేదంబులు పఠించ నగు ఫలములు నఖిల యాగంబు లొనరించ నగు ఫలంబు
లఖిల దానంబు లొనరించ నగు ఫలంబు లొదవు నిక్కథ యొక్కింత జదివినంత.

క. ప్రత్యక్షరమున నానా హత్యలు నశియించు కరతలామలక గతిన్
ప్రత్యక్షంబగు మోక్షము సత్యంబిది రామచరిత జదువు జనులకున్.

క. ఎందాక జెలగు వేదము లెందాకం జవి జరింతు రిద్రుండు సూర్యుం
డెందాక కులగిరులు దగు నందాక బొసంగు నిమ్మహాకావ్య మిలన్.

శా. వైదర్భీ కుచ పత్ర భంగ రచనా వెయాత్య సత్కారతా
హ్లాదా జాంబవతీ కపోల ముకుర ప్రాంచన్ముఖా మిత్రవిం
దాదంత చ్ఛద చుంబికాభిరత భద్రా ద్యూతలోలా సుదం
తాదృఙ్మోహన భాను జాంకతల సుప్తాలక్షణ శ్లేషణా.

క. శ్రీ వత్సగోత్ర శుభకర శ్రీ వత్స శ్రితలోదరీ కౌస్తుభ సు
శ్రీవత్స రవిసహస్ర శ్రీ వత్స ప్రముఖ దనుజ శిఖరి బలారీ.

మాలిని. సరసిజదళనేత్రా చారు సౌవర్ణ గాత్రా
గరుడజవనపత్రా కాళభిత్కంక పత్రా

చరణ వినత మిత్రా శాత్రవధ్వాంత మిత్రా
కరధృత ఘనగోత్రా కంజవిద్వేషి గోత్రా.

**ముగింపు :**

ఇది శ్రీ మదనగోపాల కృపాలలిత కటాక్ష వీక్షా సమాసాదిత చతుర్విధానపద్య కవిత్వ విద్యావధానాధునాతన భోజరాజ సకల విద్వజ్జనాభివర్ణితోదీర్ణ వితీర్ణ వైభవాంధః కృత రాజరాజ రాజ యోగ సామ్రాజ్య లక్ష్మీవిలాస దురంధర ధరాధిప సభాంతర స్తవనీయ నయకళా యుగంధర బంధుర మనీషా విశేష మంథాన వసుంధరా ధర శోధితాగణితశాస్త్ర రత్నాకర వినయాది గుణ రత్నాకర కంకంటి వంశ పయః పారావార పూర్ణ సుధాకరాప్పయామాత్య సంక్రందన నందన విజ్ఞాన విభవ విజిత సనందన విష్ణుమాయా విలాసాభిధాన యక్షగాన నిర్మాణ ప్రవీణతానిధాన పాపరాజ ప్రధాన ప్రణీతం బైన శ్రీమదుత్తర రామాయణంబను మహాకావ్యంబు నందు సర్వంబును అష్టమాశ్వాసము.

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము:

శ్రీ ముఖ నామ సంవత్సర శ్రావణ బ॥ ౧ మందవారం వుదయ మందు యావం వరకు ప్రతిలో వున్న క్రమాన చూచి వ్రాసి ముగించినది. ఈ ప్రతి క్షయనామ సంవత్సర భాద్రపద శు॥ ౧ ప్రారంభించబడినది.

ఈ ఉత్తర రామాయణము ప్రబంధ రీతిని రచింపబడిన పురాణము. కంకంటి పాపరాజు దీనిని రచింప బూని, దీనిని ఎవరికి అంకితమీయ వలెనని, కూతుకై వరుని అన్వేషించు వానివలె ఆలోచించుచుండగా, అతని యిష్టదైవమగు మదనగోపాలుడు స్వప్నమున కన్పించి విష్ణుమాయావిలాసము వలెనే దీనిని గూడ తనకే అంకితమిమ్మని కోరుటచే అట్లే అంకితమిచ్చెను. దీనిని పాపరాజు సువిస్తరముగను, సర్వాంగ సుందరముగను రచించెను.

ఈతనిశైలి దీర్ఘ సంస్కృత సమాస భరితమై ప్రౌఢమై యుండును. ఈ కవి నవరసములను సందర్భానుసారముగ మనోజ్ఞ భంగుల వర్ణించినాడు. ఈ కవి కుంజరుడు ధ్వనిని, కావ్య గుణములను, అలంకారాదులను గ్రంథ మంతటను నించి,

ప్రతిపద్యమున నేదైన నొక విశేష ముంచియే వ్రాసినాడు. ఇతని శబ్దచిత్రములు సరసార్థకలితములు. జాతీయములు, లోకోక్తులు ముద్దులు గురియు చుండును.

"నిలింపపతి కొలువు వెలచెలు ... మొదలగు లాస్య విధంబులు వినిపింప" — అను వచనమువలన ఈ కవి భరత శాస్త్రమును కూడ ఎఱింగినవాడని తెలియుచున్నది. ఆశ్వాసాంత గద్యవలన గణితశాస్త్ర పారంగతు డనియు తెలియు చున్నది.

ఆశ్వాసాంత గద్యవలన పాపరాజు ధనవంతుడైన కవి యనియు, ఇతర కవులవలె ధనార్జనమునకు కవిత్వమును శరణ్యముగా నమ్మినవాడు కాడనియు తెలుయుచున్నది. అంతేకాక వేదాంత శాస్త్రవేత్త, రాజనీతి విద్యాపారంగతుడు అనియు తెలియు చున్నది. శ్రీ మదన గోపాలస్వామి కృపచేతనే ఈతనికి "చతుర్విధానపద్యకవిత్వ విద్య"యల వడినదని అర్థమగును.

ఈ ప్రతియందు 8 ఆశ్వాసములు పూర్తిగా నున్నవి. ప్రతి నలుపు దిరిగినది. రెండుమూడు పత్రములు తునిగినవి కాని గ్రంథము సమగ్రముగ, స్పష్టముగనున్నది. లిపి సుగ్రాహ్యము. అక్షరదోషములు కొలదిగా గలవు.

# ఉత్తర రామాయణము

కం కం టి పా ప రా జు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం : 3291 | | కాల్ నెం | : టి 3-359 |
| ప్రతి : తాళపత్రము;సమగ్రము | | పత్రములు | : 259 |
| ప్రతి పరిమాణము : 42×3.5 సెం.మీ. | | పత్రిపంక్తులు | : 6 నుండి 8 |

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము :

ఈ ప్రతి వ్రాయుట పింగళనామ సంవత్సర భాద్రపద బహుళ ౧౨ జయవారం రోజున ఆరంభమై; కాళయుక్తినామ సంవత్సర చైత్ర బహుళ ౮ జయవారం

సరికి పోతుల పాత్రినాయుడు కుమాళ్ళు పెదరాజినాయుడు పుత్రపౌత్ర పర్యాయము ఆచంద్రార్కంగా చదువుకోగలందులకు వ్రాసుకొనెను.

కంకంటి పాపరాజకృతమగు ఉత్తర రామచరిత్ర 8 ఆశ్వాసముల గ్రంథము. గ్రంథము బాగుగా నున్నది. వ్రాత బాగుగా నున్నది.

కంకంటి పాపరాజు శ్రీవత్సగోత్రుడు. తండ్రి అప్పయామాత్యుడు. తల్లి నరసమాంబ. ఈ గ్రథమునందలి యాశ్వాసాంతగద్య వలనను, ఇష్టదేవతా ప్రార్థన పద్యము వలనను, కృతిపతి నిర్ణయ పద్యములవలనను నితని ఇష్టదైవము శ్రీ మదన గోపాలస్వామి యని పేర్కొన వచ్చును ఆశ్వాసాంత గద్య వలన ఇతడు గణిత శాస్త్రమునందు సహితము విశేష ప్రజ్ఞాపాటవము గలవాడని తెలియుచున్నది.

ఉత్తర రామాయణము రచించుటకు బూర్వమే విష్ణుమాయా విలాసమను యక్షగానమును రచించెనని ఆశ్వాసాంత గద్య వలన దెలియుచున్నది.

ఈ గ్రంథమునకు కృతిపతి శ్రీమదన గోపాలుడు.

## ఉత్తరరామాయణము

### కంకంటి పాపరాజు

ఆక్సెషన్ నెం : 3980

కాల్ నెం. : టి. 3-381

ప్రతి : తాళపత్రము ; సమగ్రము

పత్రములు : 216

ప్రతి పరిమాణము : 48×4 సెం.మీ.

పత్రపంక్తులు : 8

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు పూర్తిగా 8 ఆశ్వాసములున్నవి. పత్రములు పాతబడి బహుస్వల్పముగా శిథిలములైనవి. అక్షర దోషములు గలవు. లిపియు స్పష్టమే.

ప్రతివిలేఖనము—సాధారణ నామ సంవత్సర మార్గశిర శుక్ల పంచమి మంగళవారము వరకు ప్రతితోనున్న క్రమాన చూచి వ్రాసి ముగించినది.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1802 | కాల్ నెం | : టి 3-337 |
| ప్రతి | : తాళపత్రము-అసమగ్రము. | పత్రములు | : 277 |
| ప్రతి పరిమాణము | : 45×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము :

ఈశ్వర వత్సర యాశ్వీజ శితకర పక్షాష్టమీ భృగువాసరమున కాదికావ్యంబైన నమరు రామాయణమందు నుత్తరకాండ నతిశయిల్ల సర్వంబు యష్టమాశ్వాసము లిఖించె.... కుచ్చర్లపాటి రామచంద్రరాజు.

గ్రంథము సంపూర్ణముగా గలదు కాని, గ్రంథమునందలి ప్రతిపత్రము క్రిమిదష్టమై యున్నది. అచ్చటచ్చట కొన్ని పత్రములు శిథిలములైనవి. వ్రాత బాగుగా నున్నది.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4021 | కాల్ నెం | : టి 3-379 |
| ప్రతి | : తాళపత్రము - అసమగ్రము. | పత్రములు | : 263 |
| ప్రతి పరిమాణము | : 49.5×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 8 |

**విశేషాంశములు :**

ఈ ప్రతి యందు మధ్య 54, 55, 246, 247, 257 సంఖ్యలు గల 5 పత్రములు మాత్రమే లోపించినవి. ఇందు ప్రతి విలేఖన దోషములు స్వల్పముగా గలవు. ప్రతి నలుపు దిరుగుచున్నది. కొన్ని పత్రములు శిథిలములై తునుకలు మిగిలినవి.

ప్రతి విలేఖనము — ఈ ప్రతి శుభకృతు నామసంవత్సర మాఘశుద్ధ త్రయోదశి నాడారంభించి వ్రాయబడినది.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 430 | కాల్ నెం | : టి.3-336 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 295 |
| ప్రతి పరిమాణము | : 41.5×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

**విశేషాంశములు:**

ఉత్తర రామాయణమందు మొత్తం 8 ఆశ్వాసములు గలవు. సప్తమాశ్వాసమున సుమారు 25 పత్రములు లోపించినవి (సుమారు 261 పద్యములు మృగ్యములు). అట్లే అష్టమాశ్వాసమున కూడ రెండు పత్రములు లోపించుటచే గ్రంథాంత పద్యములు మృగ్యములు.

ప్రతి విలేఖనకాల మిందు సూచింపబడలేదు. వ్రాత బాగుగానున్నది. గ్రంథము క్రిమి దష్టము కాలేదు.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 570 | కాల్ నెం | : టి 3-335 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 348 |
| ప్రతిపరిమాణము | : 48×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 నుండి 7 |

**విశేషాంశములు :**

కంకంటి పాపరాజు కృతమగు ఉత్తర రామాయణ మను ఈ గ్రంథము మొత్తం 8 ఆశ్వాసములు. ఇందు 8 వ ఆశ్వాసము సంపూర్ణముగాలేదు.

గ్రంథము బాగుగా క్రిమిదష్టమైనది. ప్రతిపత్రము క్రిమిదష్టమై యున్నది. ప్రతి విలేఖన కాలము మృగ్యము.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 1557 | కాల్ నెం | : టి. 3—338 |
| ప్రతి | : తాళపత్రము, అసమగ్రము. | పత్రములు | : 167 |
| ప్రతి పరిమాణము | : 44×4.5 సెం.మీ. | పత్రి పంక్తులు | : 8 |

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము :

ఈప్రతి వ్రాయుట భావనామ సంవత్సర చైత్ర శుద్ధ ౧ గురువారము రోజున ఆరంభమైనది. ముగింపు తేదీ లేదు.

ఈ ప్రతియందు 7వ ఆశ్వాసములో 199 వ పద్యము వరకు గలదు. సుమారు 1¾ వంతు ఆశ్వాసము లోపించినది.

గ్రంథము స్వల్పముగా క్రిమిదష్టమైనను బాగుగానున్నది. వ్రాత బాగుగా నున్నది.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 813 | కాల్ నెం | : టి3-36 0 |
| ప్రతి | : తాళపత్రము : అసమగ్రము. | పత్రిపంక్తులు | : 156 |
| ప్రతి పరిమాణము | : 43×3.5 సెం.మీ. | పత్రములు | : 6 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు పంచమాశ్వాసమున సగము వరకు మాత్రమే గలదు. ప్రథమ పత్రము, మధ్యమధ్య కొన్ని పత్రములు లేవు. ఇది ఎనిమిది ఆశ్వాసముల గ్రంథము. ఇందు రావణుడు సనత్కుమారుని కలిసికొనిన పిదప నారద ప్రేరేపితుడై సత్యలోకమున కేగుటవర కున్నది.

ఈ ప్రతి నలుపు దిగురు చున్నది. కొన్ని పత్రముల పార్శ్వములు కొంతభాగము నశించి యున్నవి. ఇందలి లిపి అస్పష్టము. ప్రతి విలేఖన దోషములున్నవి.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4619 | కాల్ నెం | : టి 3–334 |
| ప్రతి | : తాళపత్రము–అసమగ్రము. | పత్రములు | : 248 |
| ప్రతి పరిమాణము | : 49×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

ప్లవ నామ సంవత్సర ఆశ్వయుజం వరకు బెక్కెముులో వుండె గడివేముల సంజీవయ్య గారి కొమారుడు... రామాయణం సంపూర్ణం.

ఈ ప్రతి యందు ఆద్యంతములు గల పూర్తి గ్రంథమున్నను, మధ్య మధ్య యాభై పత్రముల వరకు నష్టమైనవి.

ఇది చాల పాతది. క్రిమిదష్టమై శిథిలావస్థయందున్నది. కొన్ని పత్రములు స్పర్శకే చూర్ణమగుచున్నవి. ఉన్న పత్రములలోను కొంత కొంత విషయము నష్టమైనది. లిపి స్పష్టము. కాని ప్రతివిలేఖనమున దోషములున్నవి.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4621 | కాల్ నెం | : టి 3-343 |
| ప్రతి | : తాళపత్రము, అసమగ్రము. | పత్రములు | : 95 |
| ప్రతి పరిమాణము | : 46.5×4 సెం.మీ | పత్రపంక్తులు | : 6 నుండి 8 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు ఆది గలదు గాని అంతము లేదు. మధ్య మధ్య చాల పత్రములు నశించినవి. ఉన్న పత్రములును క్రమముగా లేవు.

ఈ ప్రతిలోని కొన్ని పత్రములు నలుపుదిరిగి యున్నవి. కొన్నిట కొంత భాగము నశించినది. స్వల్పముగా క్రిమిదష్టమై యున్నది. ఇందలి లిపి స్పష్టము. కాని ప్రతి విలేఖన దోషములు చాల గలవు. ఇది ఎనిమిది ఆశ్వాసముల గ్రంథము. కాని యీ ప్రతియందు రాముడు అశ్వమేధ యాగమును పూర్తిచేయుట వరకే గలదు. అనగా ఎనిమిదవ ఆశ్వాసము 140 పద్యముల వరకే యున్నవి.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4620 | కాల్ నెం | : టి 3-339 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 184 |
| ప్రతి పరిమాణము | : 34×4 సెం మీ. | పత్ర పంక్తులు | : 7 నుండి 8 |

విషాంశములు :

ఈ ప్రతియందు మొదటి నుండి ఆరవ ఆశ్వాసములో కొంతవరకే కలదు. మొదటిరెండు పత్రములు లేవు. మధ్య కూడ కొన్ని పత్రములు లేవు. సీతను లక్ష్మణుడు రామాజ్ఞపై అడవులలో వదలి వేయుట వరకు గల గ్రంథభాగము ఈ ప్రతి యందున్నది.

ఈ ప్రతి యందలి కొన్ని పత్రములు పార్శ్వముల కొంత నశించినవి. ఇది కొంత క్రిమిదష్టమై యున్నది. ఇందలి లిపి స్పష్టము. కాని ప్రతి విలేఖనమున చాల దోషములు కలవు.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 4005 | కాల్ నెం | : టి 3-384 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 63 |
| ప్రతిపరిమాణము | : 36.5 × 3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియం దష్టమాశ్వాసము మాత్రమే యున్నది. పత్రములు కొంత కొంత భాగము శిథిలములైనవి. కొన్ని అర్ధ భాగములే యున్నవి. తుది యందలి పత్రముల యిరుప్రక్కలు మిక్కిలి శిథిలములైనవి. అక్షర దోషము లెక్కువగా గలవు.

# ఉత్తరరామాయణము

## కంకంటి పాపరాజు

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 3640 | కాల్ నెం | : టి 3-378 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 97 |
| ప్రతి పరిమాణము | : 44.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 నుండి 8 |

**విశేషాంశములు :**

ఇవి కేవలము విడి పత్రములు. గ్రంథముగా లేవు. ప్రతి యటనట క్రిమిదష్టమై, శిథిలమైనది. పత్రములు క్రమముగా లేవు.

# ఉదయనోదయము

## నారన సూరన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5404 | కాల్ నెం | : టి 3-25 |
| పుస్తకము | : కాగితము; అసమగ్రము. | పుటలు | : 187 |
| పుస్తకపరిమాణము | : 35.5 X 21.5 సెం.మీ. | పుటపంక్తులు | : 29 |

ప్రారంభము :

శ్రీ సతి క్రొమ్మెఱుంగు మణిచిత్రిత శేష భుజంగ శయ్య యు
ద్యాసిత శక్ర చాపలత తాన సితాంబుద మంచు శంకఁ బ
ద్మాసన ముఖ్యు లెవ్వని సుధాబ్ధిఁ దలంపుదు రట్టి దేవతా
గ్రేసరుఁడిచ్చుఁగాత జయకీర్తులు లోకయ బాచశౌరికిన్. ॥1॥

శ్రీలక్ష్మీపతి భక్తమౌనిజన సంసేవ్యుండు వేదాంత వి
ద్యాలంకారుఁడు పంకజాక్షుఁడు ప్రసాదాయత్త చిత్తంబుతోఁ
బాలించున్ స్థిరకీర్తి చంద్రకిరణ ప్రాగ్భార సంఛన్న లో
కాలోకాచలు లోకమంత్రిమణి బాచామాత్య చూడామణిన్. ॥2॥

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధియు నభిమతార్థ సిద్ధియుంగా నా యొనర్పం బూనిన యుదయనోదయం బను మహాప్రబంధంబునకుం గథా ప్రారంభం బెట్టిదనిన— ॥77॥

సీ॥ కమలాప్త రథ రథ్య గమనఖేద విదారి గోపానసీ లస ద్గోపురంబు
ఘన సౌధ శిఖరాగ్ర గత పతాకా శాటికా చపేటోద్ధూత కంధరంబు
గంధవారణ ఘటాకట గళన్మద వారి కర్దమీభూత శృంగాటకంబు
సవిధోపవన వికస్వర పుష్ప సౌరభావర్జితామర పురీ వన మదాళి

యగుచు రాజిలుఁ గ్రీడాచలాగ్ర ఖచిత మరకతాంభోజ రాగోరు మణి నితాంత
కాంత కాంతిచ్ఛటా.... కార్ముకింద్ర చాప విభవంబు కౌశాంబికాపురంబు ॥78॥

ముగింపు :

ఉ. .... .... కుచ భారముపై మెవి కర్మినాభిపై
నెయ్యమునం దెమల్చుఁ దగనీ వి భరంబు మెఱుంగు మోవిపై
దియ్యమునం గ .... ములదీర్చు మనోహర సద్ధి (౨) భూ విభుం
డయ్యెలనాగ లజ్జ నురియాడు మనం బెడసేసి పట్టగన్॥

మ. అవిలాసాలస విక్రణం బకృత గాఢాలింగనం బప్రవీ
ణ వచో గుంభన మస్ఫురత్తరుణ దంతచ్ఛాయ మ....పితో
ష్ఠ విశేషామృత మప్రకృష్ట రతి చేష్టంబయ్యె నబ్బాల మౌ
గ్ధ్య వికారంబది రాజుడెందమునకుం గావించె నానందమున్॥

* * *

మా॥ మదన నిభ శుభాంగా మానినీ చిత్త సంగా
విదళిత రిపు చక్రా విక్రమాంభోధి నక్రా
హృదయ నిహితపద్మాధీశ దివ్యాంఘ్రి పద్మా
విదిత సుగుణ పూర్ణా విశ్రుత తౌదార్య కర్ణా॥

గద్య :

ఇది శ్రీ మదింద్రేశ్వర ప్రసాద లబ్ధ కవితాసార నారనామాత్య పుత్ర సూరయ నామధేయ ప్రణీతంబైన యుదయనోదయంబున సర్వంబును పంచమాశ్వాసము.

విశేషాంశములు ;

ఈ కాగితపు ప్రతియందు 181, 188, 189 పేజీలు లోపించినవి. అట నట కొన్ని పద్యభాగములు అసంపూర్ణములుగ వదిలివేయబడినవి. ఇది అసమగ్ర ప్రతి. ఇందు ఉదయనుని తండ్రి వివాహము మొదలు ఉదయనుని జననము, వాసవదత్తతో వివాహము వరకు గలదు.

ఈ ప్రతియందలి లిపి స్పష్టము. లేఖనదోషములు కొన్ని సవరింపబడినవి. ఇంకను కొన్ని గలవు.

సూరనకవి ఈ గ్రంథమును రచింపగా తదనంతరము ఆతనికుమారుడు నారన దీనిని ముడియము భాస్కరామాత్యుని కోరికపై నతని కంకితమిచ్చి కృతిపతి వంశ వర్ణన నిందు చేర్చినట్లు గలదు. సూరన 16వ, శతాబ్ది ద్వితీయ పాదమునందుండి యుండును.

# ఉషాపరిణయము

## దామర్ల అంకభూపాలుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 5405 | కాల్ నెం. | టి. 3-26 |
| పుస్తకము | : కాగితము; సమగ్రము. | పుటలు | : 193 |
| పుస్తక పరిమాణము | : 35× 21 సెం.మీ. | పుట పంక్తులు | : 29 |

**ప్రారంభము :**

ఉ. శ్రీసతి బాహుమధ్యమునఁ జెన్నగులీల వివాహవేళఁ దత్
జ్ఞానసుత తా (న) హీనపదకంబున బింబితయై చెలంగు ను
ద్భాసిత కౌస్తుభాభరణ భావము (నొందు) రఘూద్వహుండు గాం
ఞా సదృశార్థ సిద్ధు లనిశంబును మాకొన గూర్చుఁగావుతన్.

సీ॥ కువలయజాతానుగుణ విగ్రహము తోడ హరిణ హరాం (క్ష్మ) బక గరిమతోడఁ
గాంత పయోధర కాంతి సంపదతోడ రాజహంస ప్రచారంబు తోడ
శ్రిత దివ్యరత్న సుగ్రీవాధరము తోడ హరిమధ్యవిలసన స్ఫురణతోడ
శరధి సముల్లంఘి జాంఘిక శ్రీతోడ ముఖ్య కల్యాణదాభిఖ్యతోడఁ
బతికిఁ దనకును భేద మొర్వమికిఁ దిమురు। గొమరున మెలంగు నళిజాత గుణసమేత
యానతామర జాత లోకైక మాత సీత గృపచేత మమ్ము రక్షించుగాత.

వ. అంకితంబుగా నా రచియింపం బూనిన యుషాపరిణయంబను మహాప్రబంధమునకుఁ గథా క్రమం బెట్టిదనిన.

ఉ. శౌనకముఖ్యు లందఱును సత్రమహాధ్వర వేళఁ బ్రేమతో
ధీనిధి సూతుఁ జూచి నరదేవ శిరోమణి మన్మథాత్మజుం
డానలినాయతేక్షణ నుషాంగన నేగతిఁ గూడె విస్మయం
బైనది మాకుఁ జూడఁ దెలియన్ వినిపింపు సవిస్తరంబుగన్.

క. యదు వంశంబున శూరుఁడు ముదమున జనియించి మించి ముల్లోకములన్
విదితంబగు తనకీర్తిని మద జృంభిత వైరికుధర మఖవంతుడై.

తే. అనుచు నా నందనందనుఁ దర్వారీతిఁ బలికి బలిసూనుఁ దిచ్చిన భద్రదంతి
ఘోట .... .... .... ....బె ప్రమోదంబు మిగుల నపుడు.

తే. సరవి వసుదేవ బలభద్ర సహితు .... .... .... .... ....
........ లుచు నత్యంత విభవమెసగఁ దనగృహంబున కేఁగి యుత్సాహ మొనర.

క. నానా విదేహ భప .... .... పౌత్రులను గూడి సుస్థిర యశుఁడై
మానసమున హర్షింపుచు నా నగరమునందు నుండెనని తెలుపుటయున్.

మాలిని : దశవదన విభాళా, ధన్యసౌజన్య శీలా శశినిభముఖబింబా, సంయమీంద్రావలంబా
విశద శుభ చరిత్రా; విస్ఫుర న్నీల గాత్రా దశరథకుల దీపా, తారక బ్రహ్మరూపా

గద్య :— ఇది శ్రీ మద్దామర్ల వంశ ముక్తాఫల చెన్నజనపాల కలశ జలధి రాకాశశాంక కోర్కంటి సింహాంక బహుబల విశంకట వేంకట క్షమావల్లభానుజాత సీతారమణ స్యందకరుణారస కందళిత లలిత కవితా లతాలవాలాంకభూపాల విరచితంబగు నుషాపరిణయంబను మహాప్రబంధంబు నందుఁ బంచమాశ్వాసము.

విశేషాంశములు :

ఇది అయిదు ఆశ్వాసముల గ్రంథము. కవి దీనిని శ్రీరామచంద్రున కంకిత మిచ్చెను. ఈ కవికి బంధ కవిత్వమన్న ప్రీతి యని తోచును. ఇందు ఏకాదశ గర్భ కంకణ బంధ కందములు రచించెను. ప్రదక్షిణ క్రమాన విష్ణుస్తుతి పరాలుగా ఏబది నాలుగు కందాలు, అప్రదక్షిణ క్రమాన శివస్తుతి పరాలుగా ఏబది నాలుగు కందాలుగా నూట యెనిమిది కందాలు. ఇందు వివిధ బంధములను చిత్రించెను.

ప్రతి బాగున్నది. లిపి స్పష్టము. ప్రతి విలేఖనమున ఒకటి రెండు చోట్ల ఖాళీలు వదలి వేయబడినవి. లేఖన దోషములు కలవు.

# ఉషాపరిణయము

## దామర్ల అంక భూపాలుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5561 | కాల్ నెం | : టి 3-177 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము | పత్రములు | : 168 |
| ప్రతి పరిమాణము | : 42×3 సెం.మీ. | పత్ర పంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము :

భవనామ సంవత్సరం వర్షబుత్ భాద్రపద బహుళ ౧ సౌమ్యవాసరం శత భిషా — నక్షత్రం వర్కు. శ్రీ విల్లి పుత్తూరిలో గెండ్లూరి సోమయాజులు ఉషాపరిణయము యథాక్రమముగా వ్రాసెను.

తాటియాకు ప్రతి. ప్రతిక్రిమిద్రష్టమై యున్నది. కొన్ని పత్రములు శిథిలములై యున్నవి. 136, 137 అను నెంబర్లు గల పత్రములపై ఏమియు వ్రాయబడ లేదు. 136వ పత్రములో మాత్రము ఒక లైనులో సగభాగము వరకు వ్రాయబడి యుండి మిగిలిన పత్రమంతయు ఖాళీగా నున్నది. వ్రాత బాగున్నది కాని వ్రాత దోషము లల్పముగా కలవు. ఉషానిరుద్ధుల వివాహ విషయ మిందు వర్ణితము. 5 ఆశ్వాసములు గలవు.

# ఓహాళుని కథ

## (పండితారాధ్య చరిత్ర)

## పాల్కుర్కి సోమన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5541 | కాల్ నెం | : టి 3-304 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 4 |
| ప్రతిపరిమాణము . 42×3.5 సెం.మీ. | | పత్రపంక్తులు 6 నుండి 7 : | |

కామాంధునకు నొక్క కార్యంబు గాన రామి దెల్లమి గాదె నేమి చేయుదును
తా నీకు లింగము నానతి నెంత గా నున్నయది యేని కానమిం జేసి

యెప్పాట నొడబడ వేని నా వలన తప్పు లే దెట్లును జెప్పక పోదు
ప్రాకటంబుగ గురుభక్తియు నాకు నీకును ప్రాణంబు నిజ మట్లుగాన
పాడియె బెట్టాస పడి నిన్ను బిలువ గూడునె తొల్లి మీ గురులింగ మొక్క
నాడు విజయం చేసి నాపాల నున్న వాడు గావున నెట్లు వల దట్టు ననుడు

ముగింపు :—

.... .... .... .... .... యడుగుల దలప నయ్యండారి కపుడ
కన్నులు రెండు నొక్కట దేజరిల్లె పన్నగధరు భక్తి పరులు హర్షింప
భువి జనుల్ నెరవి యద్భుత లీల జూడ నవిరళ భక్తి దచ్చివ సహోదరుడు
దండియై గురు భక్తాండారి కిచ్చె రెండు గన్నులు ... ప్రీతితో నేడు
పాదముల్ గృపజేసె పండితారాధ్యు లాదట భక్తి మాహాత్మ్యంబు వెలయ
తెల్లంబుగా మహా దేవయ్యగారి కెల్లవారును జూడ నిలనట్లు గాక.

విశేషాంశములు :

ఇది పాల్కురికి సోమన విరచితమగు పండితారాధ్య చరిత్రలోని ఒక భక్తుడగు ఓహళుని కథ యొక్క తాళపత్ర ప్రతి. ఇందు కథయొక్క ఆది లేదు. అంతము మాత్రము గలదు. లేఖకుడు దానినే పూర్తిగ్రంథముగా ఆద్యంతములతో వ్రాసి కొనినాడు. ఈ కథ పురాతన ప్రకరణము లోనిది ఇందు మూడు వంతుల కథ లేకుండుటచే నిరుపయోగమన వచ్చును. ప్రతి, లిపి బాగున్నవి. లేఖన దోషములు స్వల్పముగా గలవు.

# కంఠీరవ రామాయణము

## బాల-అయోధ్యా కాండలు

## కంఠీరవాచార్యులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సేషన్ నెం. | : | 2746 | కాల్ నెం. | : | టి 3-356 |
| ప్రతి | : | తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : | 147 |
| ప్రతి పరిమాణము | : | 46.5×4.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : | 7 నుండి 8 |

ప్రారంభము :—

క. సిరులకు నెలవగు మెరుగుల వరలెడు వరహర్మ్య భర్మ్య పరికరముల కా
కరమగు .... గ్గమపేటను వరపురమున నలరు గోపబాలుని గొలుతున్॥

గీ. అతనికై దండగా నుండునట్టి సత్య భామారుక్మిణి యను నిరుభాగములను
వరులు వనితలు గొలుతు తత్త్వనాయ కలహసాక్షియై యలరారు శేషాహిదలతు

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నే యాంధ్రంబుసేయం బూనిన శ్రీ రామాయణంబను
మహాకావ్యంబునకుం గథోపక్రమంబెట్టిదనిన!

కం. తపమున స్వాధ్యాయమున ని రుపమ రతింబూని వాగ్విదుత్తముడును మౌ
ని పతియగు నారదుగని సు తపుడగు వాల్మీకిమౌని తగ నిట్లడిగెన్।.

సీ. ఈలోకమం దిపు డెవ్వడు గుణవంతు డును వీర్యవంతుడై దనరె నెవడు
ధర్మము నెరిగి కృతజ్ఞుడై సత్యము వ్రత దార్ఢ్యమును జెంది వరలె నెవడు
సచ్చరిత్రము బూని సర్వభూతహితుండు నై సమర్థత విద్య లరసె నెవ్వ
డసిళ ప్రియైకదర్శనుడు క్రోధముగెల్చి యాత్మవంతుడన నలరె నెవడు
ద్యుతియుతుండన సూయుడై దొడరె నెవడు క్రోధయుతుడైన యెవని కాయోధనమున
సురలు బెగడుదురో యిట్టి చోద్య మేను కోరితి వినంగ మిక్కిలి కుతుక మమరు।.

ఉ. మౌనివరేణ్య యిట్టి గుణమాన్య నరుం దెలియన్ సమర్థతం
బూనితి వీ వటన్న ముని ముఖ్యుడు నారదుడుం త్రిలోక వి
జ్ఞానము బూని యా మునివచః క్రమము విని తాన్ ప్రహృష్టుడై
వీనుల కింపుసొంపెసగ విన్మని చెప్పదొడంగె నత్తరిన్॥.

గీ. మునివర భవన్ముఖేరిత ముఖ్యగుణము లన్నియును నొక్కచో నున్కియ సులభంబు
నైన నే బుద్ధి నారసి యట్టి సుగుణ వితతిగల నగు దెల్పెద వినుము నీవు.

ముగింపు :—

గీ. దీర్ఘకాలమునకు లేచి తేజమెసగ తెలివినొందుచు బాష్పసంవలితనయను
డయ్యు భరతుడు దీనయౌ నంబ గాంచి మంత్రి మధ్యము నన్నింద మరియు ....

క. ఈరాజ్య .... గోరగలేదంబ మున్ను గూడి బలుక లే
డీరాజు జేయనభిషేకా.... .... మెరుంగదూ .... పరదేశగునై।

క. అనుగత శత్రుఘ్నునితో దనరితి ఘను రాము విపిన తలగతినేనిం
జనకసుతారామ వివా సన మెట్టులునయ్యె మానసమున నెరుంగన్ ।

క. ఘనుడగు భరతుడు నాక్రో శన మిటు లొనరించుచుండ శబ్దము కౌస
ల్యానయము వినుచు సుమిత్రం గని బల్కెను క్రూరకార్య కైకయికొడుకా।.

క. భరతుం డాగతుడయ్యెం గర మాతడు దీర్ఘదర్శిగావున నేనుం
బరికింతునని సుమిత్రం నెరి బల్కి వివర్ణమలిన .... శ్చేతనయై।

క. పరికృశయై వణకుచు న బ్బరితుడు వసియించియుండు పట్టుకు జను న
త్తరి ననుజుని గొని కోసల పరతనయగృహంబు జేరవచ్చె భరతుడున్!

క. వనటంబొగలుచు నిశ్చే తనయై బడు కోసలేంద్ర .... యను శత్రు
ఘ్నుని గూడి కౌగిలిడి రో దన మొనరింప .... వనంట దగిలి బొగలుచున్ ।

గీ। వచ్చి యార్యమనస్వినివన .... పెల్లు గొనుచు వచనము భరతుని గూర్చి బల్కె
రాజ్యకాముడవగు నిను రాజ్య మిపుడు కంటక విహీనమై జెందె కైకయియును।

క. క్రూరత నే గుణమరసెను పీరములిడి నాకు .... జేర్చెను వనికిన్
ఘోరంబగు నిక్కార్యము తా రచయించుటను వేగ దగ జెందెన్।.

క. బనుపదగు నద్ది .... నను ఘనయశుడగునాడు సుతుడు కనకోదరు డె
వ్వని నుండె నటకుగా కే న్మనుకొని యగ్నుల సుమిత్ర మొనసి నడువగన్

చ. జనియెద నట్లు .... సుజాతుడు రాముడు జేరు కానమున్
నను గొనిపోవ నీవె దగు రాకొమరుండు .... గణ్యు డం
దును తపమాచరించు నిది తోరము దా .... ధనాచితంబు స్యం
దన ... నాగపూరితము తా .... కైకయి నీకు రాజ్యమున్।

**విశేషాంశములు :**

గ్రంథము క్రిమిదష్టమై యున్నది. ఇందు రెండు కాండలు గలవు. రెండు కాండలు నసమగ్రములే. కాండాంతములు లేవు. బాలకాండ ఆరంభమున "కంఠీరవాచార్య రామాయణం" అని యుండుటచే దీనికర్త కంఠీరవాచార్యుడని తెలియుచున్నది.

కృత్యాది పద్యములను పరిశీలించి చూడగా నీక్రింది విధముగా కవి విశేషములు తెలియుచున్నవి.

'అభిమత దైవత సమభివందనంబు, కవిజన స్తవంబు ఒనర్చిన పిమ్మట, భాగ్యప్రదాన సమర్థంబును, ధర్మార్థకామమోక్షంబులును, పురుషార్థ చతుష్టయంబును సిద్ధించుటకై యొక యాంధ్రప్రబంధంబు రచియింపం బూని చింతించి నిద్రించునెడ స్వప్నమున హయగ్రీవమూర్తి ప్రత్యక్షమై ఈవిధముగా పల్కెను. వాల్మీకి మహర్షి రచించిన రామాయణమును తెనుగుభాషలో భాస్కరుడను కవి రామాయణార్థ మన్యూనముగా నొనరింప బూనలేదు. కావున నీవు రామాయణ మన్యూనాతిశయంబుగా నుచితవిధమున తెనుంగుసేతకు బూనుకొనుమని ఆజ్ఞాపించెను.'

ఈకవి హయగ్రీవ భక్తుడు. తన గ్రంథము హయగ్రీవున కంకిత మొనరించెను. హయగ్రీవు నుద్దేశించి షష్ఠ్యంతములు చెప్పెను.

వాల్మీకి తమసానది కేగుటతో ప్రారంభమై భరతుడు అయోధ్యానగరముచేరి, తల్లులను గలియుటవరకు గలదు.

# కదిరె రేమయ్య కథ

(పండితారాధ్య చరిత్ర)

## పాల్కుర్కి సోమన

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషను నెం | : 5542 | కాల్ నెం | : | టి 3-305 |
| ప్రతి | : తాళపత్రము : అసమగ్రము | పత్రములు | : | 3 |
| ప్రతి పరిమాణము | : 42×3 ½ సెం.మీ. | పంక్తులు | : | 6 |

**ప్రారంభము:**

కదిరె రెమ్మయ నాగ గరుణా ప్రపూర్తి విదిత సద్గురు మూర్తి సదమల కీర్తి
అవధూత వినుత జనార్తి చిన్మూర్తి అవిధి నిషేధ క్రియా చక్రవర్తి
ఆరంగ గురుదర్మనాసక్తి నొక్క యూరికి జన నడుపూరి చేరువను
ఆసక్తి గాల లింగార్చన వేళ యాసన్న మగుడు గాలాతి క్రమంబు
సేయదప్పగు నని శివపురాణముల మ్రోయు గావున త్రికాలాయత నియతి
నొక్కింత యును దప్పనో యని యచట నొక్క భక్తుని యింటి కుద్వృత్తి నడవ
నతిశయ ప్రీతిమై నా భక్తవరుడు

**ముగింపు :**

.... .... .... .... గదియంగ మ్రొక్కింప గరుణ దలిర్ప
దనయునకును ప్రసాదము కృపజేసి జననీ జనకుల కాశ్చర్యంబు గాగ
పూని యేడినముల పీనుంగునకు ద యానూన మతి ప్రాణదానంబు జేసె
కదిరె రేమయ్య ప్రకాశిత భక్తి విదితంబుగా నాడు వెలయంగ నేడు
సదమల దృఢభక్తి సంపద మెరసి పదములు గృపజేసె పండితేశ్వరుడు
తెల్లంబుగా మహదేవయ్య గారి కెల్ల వారును జూడ నిల నట్లుగాక

**విశేషాంశములు :**

ఇది కదిరె రేమయ్య కథ అను తాళపత్ర ప్రతి. సమగ్రముగ నున్నది. ఇది పాల్కుర్కి సోమన విరచితమగు పండితారాధ్య చరిత్రలోని పురాతన ప్రకరణము లోనిది. ప్రతి బాగున్నది. లిపియు గ్రాహ్యము. లేఖన దోషములు స్వల్పముగ గలవు.

# కన్యకాపరమేశ్వరి కథ

ఆక్సేషను నెం : 89—బి  కాల్ నెం : టి3-280
ప్రతి : కాగితము; అసమగ్రము.  పుటలు : 16
ప్రతి పరిమాణము : 33×4.5 సెం.మీ.  పుట పంక్తులు : 21

**ప్రారంభము :**

కం. ఆరాజు రా....త మోరాఘవప్రహతి నిపుడు గూలు నిజం బ
ద్ధారుణి గుల రక్షార్థం బారయ నిధనాప్తి విహితమగు విధి సరణిన్॥

కం. పరివర్జించి స్వధర్మము పరధర్మం బనుసరించి బ్రతుకుట కన్నన్
ధరణీస్థలి బంచత్వము పరమగు ననుమాడ్కి బుధులు పల్కుదురెలమిన్॥

కం. విపుల తర రాజ్య భోగము లపరిమిత గజాశ్వ కాంచనాది సమస్తా
నుపమాన సంపదలు భువి నపకీర్తి వహించు పిదప నవి యేమిటికిన్॥

కం. జల బుద్బుద సన్నిభ మ త్యలఘుతరవ్యాధిపీడితంబు నితాంతా
విల ముపగత మృత్యు వ్యా కులమగు దేహంబు ప్రాణి కోటుల కెల్లన్॥

**ముగింపు :**

కం. అని తెలిపి వారలయ్యెడ ననధిక ప్రీతి భాస్కరార్యవరేణ్యున్
బనుపడ వివిధార్చనముల ఘన కౌతూహలయుతాత్మ గావించి యటన్॥

సీ. శ్రీనగరేశ్వర శ్రీవింధ్యవాసినీ దేవీ జనార్దన దేవ....న
కమలాగణాధిప కన్యకారవిశశి కుజ బుధ గురుదైత్య గురుదినేంద్ర
నుత రాహుకేతు విశ్రుత దివ్య సన్నిధి ప్రభవాబ్దమున భవ్య ఫాల్గుణాఖ్య
మాసంబునను వినిర్మల సువక్షంబున వర తృతీయా గురువాసరమున

గీ. శాశ్వత స్థితి భాస్కరాచార్య విబుధ వరున కష్టాదశ పురాధివాసులైన
వైశ్యపుంగవు లత్యంత భక్తిశాస నము లిఖించి యొసంగిరి విమలమతిని.

వ॥ తత్క్రమం బెట్టి దనిన—

గద్య :—లేదు.

విశేషాంశములు :

కాగితపు ప్రతి. కొన్ని తప్పులు దిద్దబడియున్నవి. వ్రాత దోషములు, ఛందో దోషములు కలవు. సుమారు 110 గద్య పద్యములు కలవు.

# కపోత వాక్యము

## బలభద్రదాసు

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 3868 | కాల్ నెం | : టి 3-281 |
| ప్రతి | : కాగితము ; సమగ్రము. | పుటలు | : 56 |
| ప్రతి పరిమాణము | : 17×10 సెం.మీ. | పుట పంక్తులు | : 21 |

ప్రారంభము :

.... .... .... .... ........న్న యామారి తెరువులో .... ....
అతనికై ఖగరాజు ఆత్మబారినను అతులిత మోహనంబన నవేవి
మతిమంతుడై యుండి మరచి సద్భక్తి పతిలేని దైవమని ప్రార్థింపదొణగె.

క॥ శ్రీ పర బ్రహ్మరోపిత ఆపన్న కరుణ కటాక్ష అఖిలాధ్యక్షా
సీ పెంపుదెలియదా యని చెప్పన్ మీకప్పరాద్రి శ్రీనరసింహా—

వ. అని పరమ భాగవతోత్తములకు ప్రణమిల్లి కరమర్థి కన్నుల పండుగుగాగొని వర కవీశ్వరు కరుణపొంది.... .... ...

.... .... .... .... .... ....

అట్టిశ్రీహరి పాద మహ.... .... సేవింతునా భక్తవత్సలూని
సోమయ్య బసువన్న సుతుని పీడ్కొలిపి ప్రేమతో బలభద్రదు పేరునుబెట్టి
కరుణతో మన్నించి గారవం బొసగి వరమిచ్చెనో....వాక్య మూహించి
అదియేటి దా సుఖ మానంద .... ....

**ముగింపు :**

చెలువముగ బహుశాస్త్రార్థ వేదములు మేదిని యెన్నాళ్ళు మెలగుచుండు
ప్రభవితంబై బ్రహ్మపట్టణంబున శారద యెన్నాళ్ళు జరుగుచుండు
దివ్యముగ శ్రీ విష్ణునాభికమలమునందు బ్రహ్మ యెన్నాళ్ళు తా పరిణమించు
వరహరమకుటమున పొసగు చంద్రుడు నిరతమై యెన్నాళ్ళు నిలచియుండు
అనంతకాలము మీకు ఆయురారోగ్య ఐశ్వర్య పదవు లబ్బివుండు
అనంతకాలము మీకు ఆయురారోగ్య సకల సౌభాగ్యములు చాల గలవు
కామిని బంధుజనముల కలసి వుండు ....ధరణి వర్థిల్లు ఆ చంద్రతారార్కముగ॥

**గద్య :** లేదు.

**విశేషాంశములు :**

కాగితపు ప్రతి. వ్రాత దోషములు గలవు. వ్రాతస్పష్టత కొఱవడుటచే గ్రంథాద్యంతములు విపులముగా వ్రాయుటకు వీలుపడలేదు. ఇందలి ఛందస్సును గుర్తించుటకు కూడ వీలుపడలేదు. అక్కడక్కడ 'రగడ'లు కూడగలవు. ఇది ద్విపదకావ్యమో లేక చంపూకావ్యమో లేక యక్షగానాది ప్రక్రియలలో చేరినదో నిర్ణయించుటకు – వ్రాత స్పష్టముగా లేనందున - వీలుపడకున్నది.

# కపోతవాక్యము
## (ద్విపద)

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5287 | కాల్ నెం | : టి 3-7 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పత్రములు | : 20 |
| ప్రతి పరిమాణము | : 23×16 సెం.మీ | పత్ర పంక్తులు | : 20. |

**ప్రారంభము :**

ఆదినారాయణు దర్క కులేశు పాదంబు మనసులో పాయక నిలిపి
అభవుండు మొదలైన అమరుల నెల్ల విభవంబుగా దలతు విఘ్ననాయకుని

మోసమెన్నడులేని ముదిత వాక్కులను వర్ణింతు మదిలోన అతి భక్తి నెలమి
భూసుర పాదాబ్జ భృంగమై దనరు వలనొప్పగ కపోత వాక్యంబు చెప్ప

జలజాతుడగు రామచంద్రుని కీర్తి తప్పు లెన్నక మీరు తగ నక్షరములు
వ్రాలగా దిద్దుడీ వనర నేర్పరులు జాణలు సరసులు జాతి కోవిదులు

మానక వినుడింక మరి లంకలోను అన్నచే తన్నబడి యా విభీషణుడు
పన్నుగా రఘురాము పాదముల కడకు పోయెదనని లేచి బుద్ధి నూహించి

తల్లి పాదములకు తగ ప్రణమిల్లి కన్నీరునించియు కరుణతో పలికె
ఆ పుత్రకుని నంత అక్కున జేర్చి యిదియేమి నాపుత్ర యింత శోకింప

యేమి కార్యము జెప్పి యెరిగింపు నాకు అనిన విభీషణుం డా తల్లి జూచి
ఘనమైన శోకాగ్ని కనలుచు పలికె అవధారు తల్లి నీ యగ్ర నందనుడు

రాముని సతి సీత రయమున దెచ్చె తెచ్చిన నది యాలి తిరిగి యిమ్మంటి
పగవాని గూడిన పాతకుం డనుచు పొగులుచు సభలోన పొమ్మని తన్నె

పోయెద రఘురామ భూపాలు కడకు

ముగింపు :-

స్థిరముగా రఘురాము డిరవుగా లంక పరమాత్ము డాతని పట్టంబు గట్టి
అంతట కపులును హర్షంబు నొంది భయము లన్నియు పాయు భవరోగహరము

గంగ గోదావరి గయ వారణాశి తీర్థమాడిన రీతి శ్రీరాము వాంఛ
సఫల మగు.... ట్టి సత్కథ విన్న వైకుంఠ వాసంబు వల నొప్ప గలుగు

ఆయురారోగ్యంబు ఐశ్వర్యములను చెలగుచునుండును శ్రీ రామ చరిత
భువి యెవ్వరైనను పుణ్యంబుగాను వినిన వ్రాసిన చదివిన మహా ఘనులు

పరమ హర్షము నొంది బ్రదుకుదు రెలమి ఘనమైన సంపదల్ కుంభినిమీద
జ్ఞానంబు కలుగును ఘన పాతకములు పోవును శీఘ్రమే .... వెరచి

పాయక యెప్పుడు పతి సతి హితులు సుతులు సోదరులు దామర దంపరగను
తనరంగ వెలయుదురు ఘన కీర్తితోను అవనిలో నా చంద్ర తారార్కముగను

విశేషాంశములు :

ప్రతి విలేఖనము : ధాతునామ సంవత్సర వైశాఖ శు ౧ పగలు ౮ ఘంటలుకు కపోత వాక్యం సంపూర్ణంగా వ్రాసినది॥ మంగళ మహా శ్రీ శ్రీ శ్రీ.

కాగితపు ప్రతి. సమగ్రము. అలతిగా క్రిమి దష్టము. వ్రాత స్పష్టముగా లేదు. వ్రాత దోషములు, ఛందో దోషములు కలవు. కవి పేరు మృగ్యము.

# కళాపూర్ణోదయము

## పింగళి సూరన

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 488. | కాల్ నెం | : టి3-97 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 214. |
| ప్రతిపరిమాణము | : 46×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 నుండి 8 |

ప్రారంభము :—

శ్రీ లావణ్యవతీ కుచద్వితయ కాశ్మీర ప్రభా చారు వ
క్షోలంకార మణిప్రకాండము నవీనార్కుండుగా సన్మనో
నాళీకావిరత ప్రభాతమగుచున్ భాసిల్లు తత్వంబు నం
ద్యాలశ్రీ నరసింహ కృష్ణవిభు నిత్యశ్రీయుతుం జేయుతన్ ।

చ. ప్రమద విలాసన ర్తన విభాసుర గోపకిశోరమూర్తి తో
దమ కిలువేలుపై వెలయు తాండవకృష్ణ పదాబ్జసేవ ను
త్తమ తనయాది సంపదలు దామర దంపరయై ప్రవర్ధిలన్
రమణ దనర్చు గావుత ధరన్ నరసింగయ కృష్ణు డెంతయున్ ।

* * * * *

వ. అభ్యుదయ పరంపరాభి వృద్ధియు నాయురారోగ్య సమృద్ధియు నౌ నట్లుగా నా యొనర్పం బూనిన కళాపూర్ణోదయ మహా ప్రబంధంబునకు కథా ప్రారంభం బెట్టిదనిన.

క. శ్రీలకు నాకరమై వి ద్యాలతలకు నాలవాలమై హరికి సదా
కేళీ సదనంబై మహి జాలన్ ద్వారవతి యొప్పు సౌభాగ్యములన్ ।

ఉ. తోయధి యంకభాగమున దోరపుపెంపులతోడ దత్పుర
శ్రీ యత డూర్మిహస్తములచే దను నిట్టటు ముట్టి లాలనల్
సేయగ నొప్పు నంగ గుణశీలత నెంతయు పెద్దయయ్యు నే
ప్రాయమునైన తండ్రియెడ బట్టరు వేరొక రీతిగా జనుల్ ।

ముగింపు :

ఉ. ధీరుడు శూరు దక్షయ వితీర్ణ విహారుడు బంధులోక మం
దారుడు నీతిమార్గ సముదారుడు లోక పవిత్ర కీర్తి వి
స్తారుడు దోషదూరుడు నితాంత గభీరుడు నిత్యశోభనా
కారుడు ధర్మసారు డవికారుడు తజ్జనపాలు డెయ్యెడన్ ।

గీ। అతని గుణము లెన్నగ జతురాస్యుడైన
నచతురాస్యుడు ధిషణుండు నధిషణుండు
ధర నహీనుండు హీనుండు దక్షముఖుల
దక్షముఖులని మరి వేరె తడవనేల ॥

క. శోభిత వైభవ! రూప మ
నోభ .... .... .... .... తి
శ్రీభవ పరిశమితారి
ప్రాభవ బుధవర్ణ్యమాన రామసమానా.

వనమయూరము :

శైలవరధీర నిజ సంగర పరిత్రా
జాలఘు విచార సకలాంగనుత గోత్రా!
పాలన.... యవి.... జయ యాత్రా
శీలనగధీర నరసింగ విభు పుత్రా!

# కృతిపతి వంశానుక్రమము



**గద్య :**

ఇది నిఖిల సూరిలోకాంగీకార తరంగిత కవిత్వ వైభవ బింగళి యమరనార్య తనూజ........ మధేయ ప్రణీతంబైన కళాపూర్ణోదయంబను మహాకావ్యంబునందు ప్రబంధ పరిపూర్తి శోభనంబైన అష్టమాశ్వాసము.

**విశేషాంశములు :**

గ్రంథము క్రిమిదష్టమై యున్నది. వ్రాత బాగుగా నున్నది. ఇది 8 ఆశ్వాసముల గ్రంథము. కృతి పతి వంశానుక్రమణిక ఇందు సూచింపబడు చున్నది.

# కవి కర్ణ రసాయనము

## సంకుసాల నరసింహ కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4648 | కాల్ నెం | : టి 3-47 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 41 |
| ప్రతి పరిమాణము | : 47×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 8 |

**ప్రారంభము :**

శ్రీరంగ .... ....

..రమహీ రుహ సమస్త ధరణీ తరుణీ

హారాయమాన విమల క

వేర సుధా మధ్య ఖచిత విక చేంద్రమణీ ॥

వ॥ ఇట్లు దిగ్విజయంబు చేసి మాంధాతృ మహీమండలేశ్వరుండు జగత్పూజ్యంబుగా రాజ్యంబు సేయు చున్న కాలంబున

క॥ చిత్తరువు వ్రాయనేర్చిన

యుత్తమ శిల్పికులు వచ్చి యొక యిద్దరు భూ

భృత్తపను గాంచి యవ్విభు

చిత్తము రంజించి రాత్మ చిత్రక్రియలన్ ॥

క. మెచ్చితమ కమ్మ హీవరు డిచ్చు పదార్థంబు లొల్లకే మిచ్చటికిన్
వచ్చుటకు గారణము గల దిచ్చం గృప సేయవలయు నేకాంతంబున్ ॥

వ॥ అనిన నను గ్రహాతిరేకంబున కార్య జిజ్ఞాస కుతూహలంబున నట్ల యేకాంతం బొసంగిన వార లిట్లని విన్నవించిరి॥

కం॥ కుంతల పతికిని కల దలి కుంతల విమలాంగి యనంగ కూతురు రజనీ
కాంతుని పదియేడవకళ కంతుని యారవ శరంబు గణుతింపంగన్॥

గీ॥ రత్న పుత్రిక వోలె నా రాజ కన్య పుట్టినప్పుడ యొక మహాద్భుతపు కాంతి
నుదయమందిన గనుకొని యుచితమగుట తండ్రివిమలాంగి యనుపేరు దానికిడియె ॥

గీ॥ కన్యయై మాకొకానొక కారణమున కలిగె నిది దేవతామూర్తిగాని మనుజ
జాతి గాదని బహుమాన సహితమతుల తల్లిదండ్రులు పెనుప నత్తన్వి పెరిగె ॥

క॥ కుందనము కమ్మ వలపుం జెందెడు చందనమున తెల్ల జెరుకున బంతై
సుందరియగు నక్కన్నియ యం దెల ప్రాయంబు విడువ నాయత మయ్యెన్ ॥

**ముగింపు :**

వ. అనిన నతని భగవత్ప్రావణ్యంబునకుం దన యుపదేశ సాఫల్యంబు ........ నితప .... సిద్ధింప ద .... ప .... సేయుమని వ్యక్త లక్షణంబున నతని భగవత్ప్రపన్నుని గావించి జప్యంబైన మంత్రంబును తదర్థ .... బును తదనుష్ఠాన ప్రకారంబును తదుచిత ....లు నుపదేశించి రుషులుం దానును బూజితుండై వీడ్కొనిచనియె యనంతరంబు రాజరుషి వరుండునుం దమసా సరయూ మధ్యంబున గృత తపోధనుండై యుక్త నిష్ఠం దపం బొనరింపం దొణంగె ।.

ఉ॥ తార్కిక వామనోన్నతలతామధుకోశ నిరీశ సాంఖ్యయో
గార్క యపూర్వ నిర్వహితృహంస ఘనాఘన నిర్గుణోక్తి మ
న్మర్కట నారికేళఫల మామక సాత్యవతేయ వాఙ్మయో
దర్క సుధార్ణవోదయ విధాయన పార్వణ శర్వరీశ్వరా ॥

క. ప్రచ్ఛన్న బౌ .... దుస్సహ హచ్చర లక్ష .... మునీంద్రహృదయాదర్శ
స్వచ్ఛతర ప్రతిఫలిత స్వచ్ఛరణా స్వస్వరూప సహజాకృతికా ॥

స్రగ్విణి ॥

నిత్యధర్మాత్మకా నిత్యధర్మాస్పదా
న్యితచిద్రూపకా నిత్యరూపోజ్వలా
నిత్యబోధాశ్రయా నిత్యచిన్మాత్రకా
నిత్య నిర్భేదకా నిత్య భేదాంచితా।

గద్య :

ఇది శ్రీ మద్భట్ట పరాశర దేశి కేంద్ర చరణ సరసీరుహ .... గోపసేవక నరసింహ నామధేయప్రణీతంబైన కవికర్ణరసాయనంబను కావ్యంబున వసిష్ఠేత్యాది గమనంబును రాజ ప్రశ్న ప్రతి వచనంబులును నందు గర్మ స్వరూపబ్రహ్మ స్వరూపంబులును వేద వేదాంత పురాణ స్వరూప నిరూపణంబులును భక్తి ప్రపత్తి రూపసాధన నిరూపణంబును సంసార నిరూపణంబును మోక్షావతరణంబు నన్నది .... శ్వాసము.

విశేషాంశములు :

ప్రతి అసమగ్రము. మిక్కిలి క్రిమిదష్టము. గ్రంథశైథిల్యము కలదు. గ్రంథపాతము కలదు. గ్రంథము మొత్తము ఆరు ఆశ్వాసములు. కాని ఈ ప్రతి యందు కేవలము 3 ఆశ్వాసములు మాత్రమే గలవు. అవి ఇందు తృతీయ, చతుర్థ, పంచమాశ్వాసములు.

# కాశీఖండము

## శ్రీనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5538 | కాల్ నెం | : టి 3-170 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము | పత్రములు | : 217 |
| ప్రతిపరిమాణము | : 43×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 5 |

ప్రారంభము :-

శా॥ శ్రీ కాశీ నగరాధిరాజ్య పదవీ సింహాసనాధ్యాసి శ్రీ
కైక గ్రామణి విశ్వనాథుడు విశాలాక్షీ మనోభర్త సు
శ్లోకుం దొడ్డయ యల్లభూవరు తనూజున్ వీరభద్రేశ్వర
క్ష్మాకాంతున్ జగనబ్బ గండని మహైశ్వర్యాన్వితుం జేయుతన్ ॥

సీ॥ కంఠాగ్ర కరిరాజు ఢుంఠి విఘ్నేశుండు వరకు గుబ్బలికూతు కొడుకు కుజ్జు
ఆకాశ మండలం బను నల్లకలువకు నకరు వాద్యుండు లోలార్క మూర్తి
గోపాల భామల గుబ్బ చన్నుల మెచ్చు గీర్వాణ వంద్యుడు కేశవుండు
కత్తి క్రీడా శూన్యకటి గోపురద్వార పరిరక్షకుడు కాలభైరవుండు

తే గీ కాలకంఠుని శిరసు పూ గగనగంగ కాశికాక్షేత్రమున కేడుగడయు నైన
యిందరును నిత్తు రెల్లప్పు డీప్సితములు అల్ల భూపాలు వీరభద్రాధిపునకు ॥

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన కాశీఖండంబు ॥

సీ॥ పద్మాదికంబులు పదియును నెనిమిది యాదిపురాణంబు లా పురాణ
జాతంబు నాల్గులక్షల సంఖ్యగలయది యుప పురాణంబులం దుద్భవించె
పదకొండవదియైన బహు సంహితలతోడ బహు ఖండములతోడ బహు విచిత్ర
కథలతో నేక లక్ష గ్రంథ పరిమాణ కలితమై శ్రీ మహాస్కందమొప్పు

తే. గీ. నమ్మహా స్కందమునకు సారాంశమనగ నాల్గు పురుషార్థములకు తానక మనంగ
బ్రహ్మవిద్యకు నాది కారణ మనంగ నఖిల ఖండంబులందు ప్రఖ్యాతి వడసె ॥

గీ॥ మూడులక్షల పదియేడు మొగిసిపోవ దా బవర్తిల్లు లక్షగ్రంథముల తోడ
సమధిక స్ఫూర్తి నే పురాణములు సాటి గరిమ ఖండంబునకు మహాస్కందమునకు ।
వరుస నెనిమిది యన్యదేవతల జెప్పు పదిపురాణంబు లీశ్వరుం బ్రస్తుతించు
చంద్రమౌళి ప్రభావంబు సమధికముగ శ్రుతులయట్ల పురాణ సంహితల నొడువు ॥

**ముగింపు :**

సీ॥ యాత్రాక్రమం బిది యానందకాననా వాసవ్య దేవతా వర్గమునకు
నిది కాశికాఖండ మిమ్మహా ఖండంబు శ్రీ మహాస్కంధ వార్ధికి నమృతము
పఠియించినను దీని పరిలిఖించిన విన్న దానంబు చేసిన దారులోహ
పాషాణ పీఠికోపరి భాగమున నిల్పి గంధపుష్పముల నక్షతల పూజ

తే.గీ. చేసినను కాశికాభర్త శివుడు విశ్వ నాయకుడు లక్ష్మి నిచ్చు దీర్ఘాయు వొసగు
ప్రాభవంబు ప్రసాదించు భక్తతతికి శ్రీ విశాలాక్షి కృపసేయు చింతితములు ॥
ఆ.వె. అనుచు కార్తికేయు దమ్మహా మౌనితో నేర్పరించి చెప్పె నెల్లకథలు
భక్తితోడ దీని పాటించి విన్నను మానవులకు మోక్షమహిమ గలదు ॥

క॥ స్కాంద పురాణము లోపలి పొందుగ శ్రీ కాశిఖండ పొలుపొందంగా
ఆంధ్రంబుగ శ్రీనాథుడు నింపు దరుకు ప్రీతిగాగ యేర్పడజెప్పెన్ ॥

దం॥ కర్ణాట క్షితిపాల మౌక్తిక సభాగారాంతరాకల్పిత
స్వర్ణ స్థానగతి ప్రసిద్ధ కవిరాట్సంస్తుత్య చారిత్ర దు
గ్ధార్ణోరాశి నిధాన ప్రాహ్ణముఖ మధ్యాహ్నాపరాహ్నార్చితా
పర్ణా వల్లభ రాజశేఖరమణీ పంటాన్వయ గ్రామణీ ॥

క॥ హేమాద్రి ధీర దాక్షా రామశ్రీ భీమశంకర కృపాలక్ష్మీ
సామాగ్రి పరివర్ధిత భూమీ సామ్రాజ్య విభవ పుణ్యశ్లోకా ॥

మాలిని॥

వికచ కమలనేత్రా వేమమాంబా సుపుత్రా
సకల నృపశరణ్యా సంభృతాశేషపుణ్యా
మకరనిధి గభీరా । మానినీ చిత్తచోరా
ప్రకట సుగుణసంగా రాయవేశ్యా భుజంగా ॥

గద్య :

ఇది శ్రీ మత్కమలనాభ పౌత్ర, మారయామాత్యపుత్ర, సుకవిజన విధేయ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన కాశీఖండంబను మహాప్రబంధంబునందు సర్వంబును సప్తమాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతివిలేఖనము :—

పింగళనామ సంవత్సర ఆషాఢశుద్ధ సప్తమీ మందవారం వరకు శివపురపు శ్రీశైలపతి వ్రాసుకున్న కాశీఖండము.

ప్రతి అంతిగా క్రిమిదష్టమై యున్నది. వ్రాత బాగుగా నున్నది. ఇందు ఏడాశ్వాసములు సంపూర్ణముగా కలవు.

# కాశీఖండము

## శ్రీనాథుడు

ఆక్సెషన్ నెం. : 582 కాల్ నెం. : టి. 3-167

ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 228

ప్రతి పరిమాణము : 39 × 3.5 సెం.మీ. పత్ర పంక్తులు : 5 నుండి 6 వరకు

**విశేషాంశములు :**

ప్రతి విలేఖన కాల మిందు లేదు. గ్రంథము మిక్కిలి క్రిమిదష్టమైయున్నది. గ్రంథ మసమగ్రము. ఈ ప్రతి యందు సంపూర్ణముగా 5 ఆశ్వాసములు గలవు. 6వ ఆశ్వాసములో 283 పద్యములు గలవు. పత్రముల క్రమసంఖ్య తప్పుగా వ్రాయబడియున్నది.

కృతిపతి వంశానుక్రమణిక.

- పెరుమాళ్ళరెడ్డి + అన్నమాంబ
  - అల్లయాధీశ
  - పెదకోట
  - అన్నప్రోల
  - దొడ్డయేశ్వర + అన్నమాంబ
    - ప్రోలభూపతి
    - కోట భూపతి
    - అల్లాడభూపతి
      - వేమ విభుడు
      - వీరవసుధాధ్యక్షుడు (వీర భద్ర భూపాలుడు) + అనతల్లి (కృతిపతి)
      - దొడ్డ ప్రభువు
      - అన్నయ
  - పిన్నకోట రెడ్డి

# కాశీఖండము
## శ్రీనాథుడు

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 575 | | కాల్ నెం. | : టి 3–168 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | | పత్రములు | : 187 |
| ప్రతి పరిమాణము | : 47×4 సెం. మీ. | | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

గ్రంథము శిథిలావస్థలో నున్నది. అటనట కొన్ని పత్రములు లోపించినవి. లిపి యొక మాదిరి నిర్దుష్టముగా నున్నది. వ్రాత దోషములు కలవు.

# కాశీఖండము
## శ్రీనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1536 | కాల్ నెం | : టి3-162 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 207 |
| ప్రతి పరిమాణము | : 44×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

ప్రారంభము :

* * *

ఉ॥ వెగ్గలమైన వాసనల విశ్వజగంబును గమ్మ వల్వగా
గుగ్గులు ధూపధూమములు గోచరలీల నజాండభాండముల్
డగ్గఱ బాఱె దాని మిళనంబున గాదె నభంబు గల్వ పూ
మొగ్గయు బోలె నిప్పుడు సము . .త నీలిమయయ్యె జూడ్కికిన్ ॥

గీ॥ అవసరం బిచ్చి శివుడు బ్రహ్మాచ్యుతాది దేవతల గా రవించె నతిప్రీ ....

.... .... .... .... .... .... ....

గద్య:_

ఇది శ్రీమత్కమలనాభ పౌత్రమారయామాత్యపుత్ర సుకవి విధేయ ప్రణీతంబైన కాశీ ఖండంబను మహా ప్రబంధంబునకుం జతుర్థాశ్వాసము.

**విశేషాంశములు :**

గ్రంథము మొత్తము 7 ఆశ్వాసములు. మిక్కిలి శిథిలావస్థలో నున్నది. గ్రంథాంతములేదు. పెక్కుపత్రములు నెంబర్లుగల భాగమందు శిథిలమైయున్నవి. వ్రాత దోషములు కలవు.

# కాశీఖండము
## శ్రీనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 722 | కాల్ నెం | : టి3-161 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 71 |
| ప్రతి పరిమాణము | : 45×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు 5 మఱియు 7 ఆశ్వాసములు మాత్రమే కలవు. లిపి యొక మాదిరి నిర్దుష్టముగా నున్నది. వ్రాతదోషములు కలవు.

# కాశీఖండము
## శ్రీనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4661 | కాల్ నెం | : టి 3-88 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రిములు | : 35 |
| ప్రతి పరిమాణము | : 35.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 9 |

**ప్రారంభము :**

వ. .... క్షాత్కరించి . . . ప్రస్తుతించి . . . హేశ్వరు వలన నక్షత్రలోకంబునకు నూర్ధ్వంబునను . . . న కధీశ్వరుండయ్యె.

గీ॥ చంద్ర . . . డ చంద్రేశ్వర స్థానమునకు
ప్రాగ్దిశా .... .... .... భక్తి నరు.

గీ. స్థానమహిమంబు భక్తితాత్పర్య గరిమ
వినగ వలయుం .... .... ....
.... .... .... .... ....
.... .... .... .... ....

**విశేషాంశములు :**

ప్రతి క్రిమిదష్టము. గ్రంథపాత మధికము. గ్రంథ శైథిల్యము కలదు. ఈ ప్రతిని ప్రత్యేక గ్రంథముగా పేర్కొనుటకంటె "కాశీఖండమునకు సంబంధించిన కొన్ని పత్రములు" అనిపేర్కొనుట యుక్తము. ఈ ప్రతి యందు చతుర్థ, పంచమ, షష్ఠ, సప్తమాశ్వాసములకు సంబంధించిన కొన్ని పత్రములు గలవు.

# కిరాతార్జునీయము

## కృష్ణనామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 2482 | కాట్ నెం. | టి. 3–197 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 48 |
| ప్రతిపరిమాణము : | 31.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | 6 |

ప్రారంభము :

వ. అనియిట్లు సకల దేవతా ప్రార్థనంబును ప్రమథ భక్త సుకవీంద్ర స్తోత్రంబును గావించి, వారల కృపాకటాక్షంబును సుధారసంబును సేవించి, సంప్రీతుండనై అను దినంబును పరమేశ్వర పూజా ధురంధర మానసుండనై మద్వంశ ప్రకరణం బెట్టిదనిన.

సీ. శ్రీరామనాథుని శ్రీపాద సేవకుడు కాశ్యప గోత్రుండు ఘనుడు ద్విజుడు
బచ్చయ యతనికి భార్య శానమ యను అవధూత వరులకు నగ్రసుతుడు
కోటి చింతల నేటి కేశవు మంత్రి రమణ కేశవు సతి రామమాంబ
ఆ రామమాంబకు నర్థి ప్రియ పుత్రుండు కృష్ణనాహ్వయుడను కీర్తిపరుడ

సరవి జెప్పెద పరమేశు వరము వలన   వెలగి శ్రీ శంభుకథలో....రముగ
నెలమి జెప్పెద నామది  నేర్చినంత   నెయ్యముగ నే కిరాతార్జునీయ మిపుడు.

వ. మరియు నా నేర్పుం బూనిన కిరాతార్జునీయంబను మహాప్రబంధంబున కథా క్రమం బెట్టిదనిన.

సీ. కదలి కేతకి నింబ ఖర్జూర వట బిల్వ   బదరి ద్రాక్షలచేత ప్రబలి యొప్పె
పనస పిప్పలి చూత పసనైన రుద్రాక్ష   తరువులు అమలక తరువు లొప్పె
బదరి శమీరంబు బాగైన తింత్రిణుల్   తాళ హింతాళముల్ చాల గలగి
చందన తరువులు అందమై విలసిల్లు   ....పూత తరువులు వెల్లి విరిసి
పల్లవంబులు లతలును పక్వమైన   ఫలములును మంచి....నిర్మలములొప్పె
సకల దురితాపహరమగు సన్మునీశ   రమ్యమై యొప్పు నైమిశారణ్యమునను.

సీ. ద్వైత వనంబులో ధర్మతనూభవుండు   పుడమిపై కడుమంచి భూరుహముల
నీడల నత్యంత వేడుక కూర్చుండి   ఆనంద రస భరితాత్ము డగుచు
దుర్జన సంహారు నిర్జరేశ్వరు సుతు   డర్జునుండును పాపవర్జితుండు
పవన నందనుడును. పాంచాల సుతయును   కవలును నిరు గడల్ కదసికొలువ
ధర్మ సద్గోష్ఠి పరుడైన ధర్మరాజు   తమ్ములును దాను నత్యంత సమ్మదముగ
కౌరవులనెల్ల సాధించు క్రమము దెలియ   యలమి తలపోయుచున్నట్టి యవసరమున.

సీ. ఇరుగడల్ శిష్యులు కరమర్థి గొలువంగ   కాషాయ వస్త్రముల్ ఘనతగట్టి
యోగ . . లెన్ని యొనర కృష్ణాజిన యజ్ఞోపవీతమ్ములొ   యొనరదాల్చి
దండంబు మంచి కమండలము ధరించి   జడలు మస్తకమున దురిమి మరియు
ఈశ్వర ధ్యానంబు నెలమితో జేయుచు   జపమాల యొక్కటి చాతబట్టి
భవములన్నియు నొక వంక బారదరిమి   దేవపాతకు డగునట్టి వ్యాసుడపుడు
కలసి ధర్మజు డున్నట్టి వనములోకి   వచ్చె పాండవ సద్గోష్ఠివంతుడగుచు.

ముగింపు :

ఉ. .... .... .... .... శస్త్రము వేగమే మహా
వింతగ నేసె నేసి కడువేగమె పార్థుడు నేము బాణమా

చంతల నుంచి .... తన శస్త్రము మాయ .... ....
సంతస మొంది సూకరము సన్నిధికేగెను మోదమందుచున్.

వ. అంత నమ్మహేశ్వరుండు నమ్మహా .... అనుమతిని దివ్య విమానా రూఢుండై కైలాసంబునకు జనియె. అంతట నచ్చటయున్న ముని బృందము .... .... లుడిగి యొక్క చిత్తంబున సంతోష కరులై వివిధ ప్రకారంబుల తమతమ తత్రస్థలంబు లకుం జనిరంత, అర్జునుండు త.... మేల్కాంచె నాపందికై పోవుటయు నక్కిరాతుం డైన శంభుడు నతని కిడనట్టు నత్యంత కోపాటోపంబున కినియుచు నిట్లనియె.

చ. .... .... కడుదోర్బల శక్తిని పంది నిప్పుడే
చలమున వేసినాడ ఘనశస్త్రము నాదిది నీకు నెదిర్చి
యలమి తొ లంగ చెం .... .... ....భో
నిలు నిలు పోకు పోకు మరి నిన్నును నూరికె పోవనిత్తునే.

వ. అని పలికి మరియు నిట్లనియె.

ఉ. చక్కని శలకై జగము చాల
.... .... తిరిగివచ్చితి నం ....
చక్కని వంక .... .... ....
మక్కువ గరులు గట్టితిని మధ్యను నాదన నీకు జెల్లునా.

చ. అనిన కిరీటియున్ గినిసి అప్పుడు యిట్లనెవాని జూచి
.... ంశమున కోపమొంది కడు మక్కువతోడుత బాణమున్
తనదని లెస్సగా దెలిసి.... శిమితో నటు నవ్వుకొం....
ఘనుడగు శంభుడంచతని గ్రక్కున దెల్యక గర్వచిత్తుడై.

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు ఆద్యంతములు లేవు. అందుచే కవి వివరములుగాని, కృతిపతి వివరములుగాని, కృతిపతి వివరములుగాని కావ్యవిశేషములుగాని తెలియుటలేదు. ఇందు కావ్యాదిపత్రములేదు. తృతీయాశ్వాసము ప్రారంభము వరకే గ్రంథముకలదు. ఉన్న పత్రములుకూడ ఇరువైపుల శిథిలములై యున్నవి. మిక్కిలి నలుపు దిరిగి అక్షరములు కొన్నిచోట్ల గోచరములగుట లేదు. వ్రాతదోషములు చాల గలవు. ప్రతి క్రిమిదష్టమై మిక్కిలి శిథిలావస్థలో నున్నది. శబ్దచ్ఛందోదోషములు కొల్లలు.

# కిరాతార్జునీయము

## కృష్ణనామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం : 3898 | | కాల్ నెం | : టి 3-5 |
| ప్రతి : తాళపత్రము;అసమగ్రము | | పత్రములు | : 20 |
| ప్రతి పరిమాణము : 23.5×15 సెం.మీ. | | పత్రపంక్తులు | : 26 |

ఉ॥ ఓ సురనాథ జెప్పెదము సయన బంపుము రంభ నిప్పుడున్
వాసి ముఖార విందమును వాడి శరంబుల బోలు చూపులున్
భాసుర .... న కాంతియును పట్టువ గుబలు జూడ విఘ్నమున్
వాసిగ జేయ బంపుము .... .... గన్॥

వ. .... .... .... నిట్లనిరి.

సీ॥ ఇంతి నీవిపు డటు కేగుము సురలెల్ల జెప్పిరి యమ్మౌని చెంతజేరి
నీవు నేర్చిన యట్టి నెరజాణతనము నా మాటల తేటల నీటులందు
కన్నుల సంజ్ఞల చన్ను గుబ్బల మీద మెరుగుల కడు మంచి మెలగవలెను
సన్నంపు నడుమున యెన్నికై పిరుదున .... ....

విశేషాంశములు :

ఈ ప్రతి యందు రెండవ యాశ్వాసములోని కొంతభాగ మున్నది. అర్జునుని తపస్సు భంగము గావింపుమని యింద్రుడు రంభను పంపుట, రంభ తపోభంగము గావింపలేక పోవుట, విరహము ననుభవించుట వరకు నిందు గలదు. ఇది అసమగ్రప్రతి.

ఈ ప్రతి యొక్క మొదటి చివరి కాగితములు కొంత చినిగి, కొన్ని యక్షరములు నశించి యున్నవి. లిపి స్పష్టముగా లేదు. ప్రతి విలేఖనమున చాల దోషములు కలవు.

# కుచేలోపాఖ్యానము

## ఘట్టు ప్రభువు

అక్సేషన్ నెం : 735 కాల్ నెం. : టి. 3-38

ప్రతి : తాళపత్రము ; సమగ్రము పత్రములు : 32

ప్రతి పరిమాణము : 45×4 సెం.మీ. పత్రపంక్తులు : 6 నుండి 7

ప్రారంభము :

సీ. శ్రీ మద్వ్రజాంగనా చిత్ర చిత్రాంబర చౌర్య చాతుర్య విచక్షణుండు
తాపస భామినీ దత్త విశిష్టాన్న బహు .... .... పూప భక్షణుండు
సకల గోపక వధూ సముదయాకర్షణ మత వేణు నాదాభిమంత్రకుండు.
ధేను ఖురాగ్ర ప్రదీపి .... .... .... .... కోమలారుణ నిజకుంతలుండు

ధర విభేదన మాయావిధ ప్రశస్త ఘోరపాషాణ వర్ష విదారణ ....
.... .... పాలకృష్ణర మాధవుండు చెలగి జగములనెల్ల రక్షించుగాత ॥

వ. సమర్పణంబుగా నా యొనర్పంబూనిన కుచేలోపాఖ్యానంబను మహా ప్రబంధంబునకు
గథా క్రమం బెట్టిదనిన।.

క. శ్రీ మద్భాగవతార్థ స్తోమంబులు దెలుపు నెడల శుక యోగీంద్రుం
డామోదమున పరీక్షి ద్భూమీశున కనియె వాక్ప్రభుత్వము మెరయన్॥

క. నెరయ ప్రసిద్ధము మధురా పురము సమీపమున బంటపౌలతికి రత్నా
భరణంబై విలసిల్లును నరనాథ యవంతి పట్టణ శ్రేష్ఠ మిలన్॥

రగడ. అది గడు నున్నత మయ్యెడి కోటలు సదనంబగు నచ్చపు పూదోటలు
మాణిక్యంబగు మయమగు వేదులు నాణెములగు తిన్నని బహువీథులు
కడునైష్ఠి కతలు గలిగిన యాజులు పుడమిని ధర్మము బూనిన రాజులు
ధర్మ వినిర్మిత బహు సౌధంబులు నిర్మల మణి మందిర యూథంబులు

పచ్చలు గూర్చిన బలు తోరణములు  మచ్చిక లెసగెడి మదవారణములు
కట్టందములుగ గట్టిన తేరులు  నెట్టిన సాములు నేర్చిన శూరులు
నవ రత్నంబుల నయమగు మేడలు  కవ గూడిన పటికంబుల గోడలు
పటుతరగేహ ప్రాసాదంబులు  స్ఫుటతరభేరీ పుట నాదంబులు
వేలుపు చేడెల వెలగొను వేశ్యలు  శ్రీల కుబేరుని కెనకెడు వైశ్యులు
నిమ్ముల బొడవగు నిల హోమంబులు  కమ్మని కృష్ణాగరు ధూమంబులు
నిరుప మాగధ మనిజగానంబులు  గరిమ వహించిన ఘనయానంబులు
విమలోదకముల వెలసిన బావులు  సమ చతురములగు చల్లని తావులు
మహిత బలంబుల మహి సామంతులు  బహు విద్యలు నేర్చెడు ధీమంతులు
నీతులు పతులకు నేర్పెడు మంత్రులు  ద్యూతాదులకును దోడగు తంత్రులు
నంగడి పుష్పములమ్మెడి చోటులు  సంగతి గల విట జనముల నీటులు
గలిగి ధరిత్రిని ఘనత వహించెను  అలకా పురమున కన్న రహించెను.

గీ. అమ్మహా పట్టణంబున కనతి దూర  మైన ఘోరాటవీ మధ్య మాద్రి శిఖర
దివ్య దేశంబునను సన్నుతింప మిగుల  బట్టునైనది తాపసి పల్లె గలదు.

**ముగింపు :**

వ. కావున నీవు సకల భూతంబుల యందును దయయును ధర్మంబునుం గలిగి స్నాన జపాద్యనుష్ఠానంబులు మొదలైన బ్రాహ్మణ కర్మంబు లే మరక .... .... సామంబులు నియమంబున పఠియింపుచు ననసాక్షిక భక్తంబ యుక్తంబని తెలిసి యతిథు . . . . . . . . .. . చు హింసా కర్మంబులు వర్జించి కామ.... లోభ మోహ మద మాత్సర్య .... వెలుగ నీయక యత్యంత విర . . . వై, శాంతాకారంబునం బ్రవర్తింపు మని చెప్పి పరమాత్ముండైన హరి యంతర్ధానుండయ్యె నప్పుడు.

క. కమలము నీరున నుండియు  గమలంబును నంట నట్టు కరణిని సంసా
రమున ప్రవర్తింపుచు నా  యమలిన చిత్తుడు విరక్తుడై విహరించెన్॥

— శ్రీ శ్రీ యుం జేయుమా —

గీ. ఈ కుచేలు చరిత మిలలోన నెటువంటి మనుజులైన వ్రాసినను జదివిన
వినిన దద్విధముల వివరించినను వారి యాయు రర్థములు చిదాత్మ డొసగు.

క. అనిన గిరీటి కుమారుని తనయుడు శుక యోగి వాక్సుధారస పానం
బొనరించిన పిదప వినియెను దనివి సనక భాగవత కథా సూక్తంబుల్.

శా. బృందారణ్య విహార గోప .... .... దరీ గోపగో
బృందా నంద కళింగ మర్దన మహాబల్బృందార కాధీశభూ
మందార ద్రుమ నంద నందన మహామాయా వినోద క్రమా
మంద ప్రాభవ కృష్ణ దేవ హరి శ్రీమన్నామ రామానుజా।

క. నీ లాంబరావరజ హరీ నీలాంబుద వర్ణ దేహ నిర్మల యమునా
కేళీ ప్రియ రక్షిత గో పాలక బాలక సహాయ పర్యుషి తాన్నా।

పంచ చామరము :

బ లారి కల్పితోరు వర్షపాత వారణా
ప్రలంబ పూర్వ నిర్జర ప్రభంజ నాత్మ రంజనా
పుళింద కన్య కాకుచ ప్రపుల్ల గంధ పాలికా
గళ ప్రదేశ భాస మాన కౌస్తుభ స్థితాంకితా. ॥

గద్య :

ఇది శ్రీ మద్భ్రమరాంబికా వరప్రసాద లబ్ధ సరస కవితా ధురంధర, సకల కవి మిత్ర యల్లనా మాత్య పుత్ర సకల సద్గుణ విధేయ షట్టు ప్రభు నామధేయ ప్రణీతంబైన కుచేలోపాఖ్యానంబను మహా ప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము.

**విశేషాంశములు :**

గ్రంథము క్రిమి దష్టము. ప్రథమ పత్రమే శిథిలమై యున్నది. లిపి బాగుగా నున్నది. అలతి వ్రాత దోషములు కలవు. కొన్ని కొన్ని పద్యములందు శబ్దములే వదలి వేయబడినవి.

ఇందు 3 ఆశ్వాసములు గలవు. గ్రంథము సంపూర్ణము. ఇది శ్రీహరికి అంకితము. గ్రంథకర్త తండ్రి అల్లనామాత్యుడు.

భాగవతము నందలి 'కుచేలోపాఖ్యాన' మను కథను గైకొని కవి తన ప్రజ్ఞచేత, స్వకపోల కల్పనా బలముచే మూడాశ్వాసములు ప్రబంధముగా తీర్చిదిద్దెను.

ఇతడు భ్రమరాంబా భక్తుడు. స్వప్నమున వచ్చి ఈమె కవితా శక్తిని కవికి ఒసంగినట్లు గ్రంథారంభమున పేర్కొనెను. గ్రంథావతారికయందు ప్రాచీన కవుల కంటె భిన్న పద్ధతిలో ప్రారంభించెను. ప్రారంభమందు సీస పద్యముతో ప్రారంభించెను. ఇందు శ్రీ కృష్ణుని స్తుతించెను. ఇందు స్తుతి ప్రార్థనతో పాటు, జగత్తునకు మంగళమును కూడ కోరెను.

ప్రార్థనా పద్యము పిమ్మట భూజనుల కందఱకు సకలైశ్వర్యంబులు కలుగ జేయ వలెనని ప్రార్థించెను. ఇట్లే అటు తరువాత కొన్ని పద్యము లందు కలదు. ఆ పిమ్మట వేద మంత్రములలో పేర్కొనబడిన కొన్ని మంత్రములను సీస పద్యములో వ్రాసి, అందలి అర్థములు యథార్థములగు గాక యని ఆతడు ఆకాంక్షించెను. కేవలము జన బాహుళ్యాకాంక్షయే గాక తిర్యగ్జడము లకు గూడ క్షేమమును ఆకాంక్షించి విశ్వ జనీనతను సంతరించెను.

తన్ను గూర్చి చెప్పు కొనునపుడు ''భ్రమరాంబికా వర ప్రభవ దివ్య కవిత్వ విద్యా ప్రవీణత గల వాడు గాను, ఘటికాశత గ్రంథ ఘటనా సమంచిత చాతుర్య మహిమకు జాలిన వాడు గాను, ప్రౌఢి నేకైక పక్ష మాస మహా ప్రబంధ కల్పనా శక్తి గలవాడు గాను, ఆశు, చిత్ర, మధుర, వాక్య ప్రగల్భత గలవాడు గాను, సత్కవీశ్వర కరుణా వర ప్రసాదుడు గాను పేర్కొనెను.

గ్రంథాంకిత విషయములో కూడ తన అభిప్రాయ మిట్లు వ్యక్తము చేసెను. తనకు ఏ విధమైన వాంఛలు లేకపోవుటచేత ఇతరులకు గ్రంథ మంకిత మిచ్చుట లేదనియు తత్కారణమున తన గ్రంథము హరికి సముదితానందముగ సమర్పింతు నని పేర్కొనెను.

# కుచేలోపాఖ్యానము

## ఘట్టు ప్రభువు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ | : 2318 | కాల్ నెం | : టి 3-116 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 51 |
| ప్రతిపరిమాణము: | 30×3.5 సెం.మీ. | పత్రపంక్తులు : | 5 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు 3 ఆశ్వాసములు పూర్తిగానున్నవి. ఇది సమగ్ర ప్రతి. ఈ ప్రతి కొలదిగా క్రిమిదష్టమైనది. అంచులు నలుపు తిరిగి పై పంక్తులు సరిగా కన వచ్చుట లేదు. లిపి స్పష్టము. కాని అక్షర దోషములు, పద, పాదచ్యుతులును పెక్కుగలవు.

# కుచేలోపాఖ్యానము

## ఘట్టు ప్రభువు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5649 | కాల్ నెం | : టి 3-101 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 35 |
| ప్రతిపరిమాణము: | 43×4 సెం.మీ. | పత్రపంక్తులు : | 6 |

ప్రారంభము :

సీ. శ్రీ మద్వ్రజాంగనా చిత్ర చిత్రాంబర
చౌర్య చాతుర్య విచక్షణుండు
తాపస భామినీ దత్త విశిష్టాన్న
బహు మధురాపూప భక్షణుండు

విశేషాంశములు :

ఈ ప్రతి బాగున్నది. కాని ఒక్క పత్రము మాత్రము సగమే యున్నది. ఇందలి లిపి స్పష్టము. ప్రతి విలేఖనమున స్వల్ప దోషము లున్నవి.

# కుచేలోపాఖ్యానము

## ఘట్టు ప్రభువు

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 798 | కాల్ నెం | : టి 3-62 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 37 |
| ప్రతిపరిమాణము: | 40×3.5 సెం.మీ. | పత్రపంక్తులు: | 5 నుండి 6. |

**విశేషాంశములు :**

ప్రతి బాగుగానున్నది. గ్రంథశైథిల్య గ్రంథపాతములులేవు. ఇందు 3 ఆశ్వాసములు గలవు.

గ్రంథ ప్రారంభములేదు. 2 వ పత్రము నుండి గలదు. పత్రములకు క్రమ సంఖ్యా సూచి లేదు.

# కుచేలోపాఖ్యానము

## ఘట్టుప్రభువు

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 396 | కాల్ నెం | : టి 3-151 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 10 |
| ప్రతిపరిమాణము ; | 38×4 సెం.మీ. | పత్రపంక్తులు: | 6 నుండి 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు ప్రథమాశ్వాసము కూడ పూర్తిగాలేదు. కాని ప్రారంభము నుండియు నున్నది. ఈ ప్రతి యొక్క పార్శ్వములు చాల శిథిలములైనవి. లిపియు అస్పష్టముగ, అవ్యక్తముగ నున్నది. అక్షర దోషములకు లెక్కయే లేదు. ప్రతి విలేఖరికి ద్విత్వములను వ్రాయు అలవాటు అంతగా నున్నట్లు కానబడదు.

# కుచేలోపాఖ్యానము

## ఘట్టు ప్రభువు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం. | : 1755 | కాల్ నెం | : టి 3-109 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 65 |
| ప్రతిపరిమాణము | : 30×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 4 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు ప్రారంభము కలదు. కాని ముగింపు లేదు. నడుమ కొన్ని పత్రములు లోపించినవి.

ప్రతి చాలభాగము క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. కొన్ని పత్రముల యిరు పార్శ్వములు శిథిలమై పోయినవి. కొన్ని పత్రములలోను, చివరి పత్రములోను, విషయ మసలే గ్రాహ్యమగుట లేదు. లిపిస్పష్టమే. ప్రతివిలేఖనమున దోషములున్నవి

# కుచేలోపాఖ్యానము

## ఘట్టు ప్రభువు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 7683 | కాల్ నెం | : టి 3-587 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 27 |
| ప్రతిపరిమాణము | : 27×3.6 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతియందు చివరి పత్రములు లేవు. ఉన్నవి కూడ చాల భాగము నశించి పోయినవి. లిపి స్పష్టముగ లేదు. లేఖన దోషములు గలవు. క్రిమిదష్టమై శిథిలావస్థకు దగ్గరగా నున్నది.

# కుమారసంభవము
## నన్నెచోడుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5403 | కాల్ నెం | : టి 3—9 |
| ప్రతి | : కాగితము; సమగ్రము | పుటలు | : 691 |
| ప్రతిపరిమాణము | : 20.5 × 16 సెం.మీ | పుటపంక్తులు | : 16 |

ప్రారంభము :

శ్రీవాణీంద్రామరేంద్రార్చిత మకుటమణిశ్రేణినామాంఘ్రి పద్మా
జీవోద్యత్కేస...ండాశ్రితజనలసితాశేష వస్తుప్ర .... ద్ధ
దేవాధీశుండు నిత్యోదితు డజుండు మహాదేవు....ద్యుండు విశ్వై
కావాసుం డెప్పుడును మా కభిమతమున్ ప్రీతాత్ముండై—యిచ్చుగాతన్ ।

సీ. రమణీయ శృంగార .... పర్వతము నా శోభిల్లు సిద్ధ విస్ఫూర్తిమూర్తి
ఆ పర్వతాగ్ర .... మైనశృంగంబు నా నమరు జటా మకుటాది భాతి
అతుంగ శృంగ శిలాపూర్ణస .... సినా బొంగారు జాహ్నవిభూరి వారి,
ఆనిమ్న సరసి విహార మరాళికా పక్త్రికానానొ ....కపాలలీల
యామహామరాళికా బర్హిణాంభోజ పుష్పనిభసముద్ధ భోగభోగి
సమితిదాల్చిపొల్చు శంకరుం డంబికా ధపుడు మా కభీష్టదాతగాత॥

* * *

వ. పరమ భక్తి ముక్తి నావర్జిత హృదయుండనై సకల భువన భవనావతార
కారణుండైన పరమేశ్వరు నవతారంబగుటయుం దదంశావతారంబుగా వ్యాంవర్ణించి
నా చెప్పంబూనిన దివ్యకథాసూత్రం బెట్టిదనిన

మ.సగ్ధర సతి జన్మంబున్ గణాధీశ్వరు జననము దక్షక్రతుధ్వంసముం బా
ర్వతి జన్మంబున్ భవోగ్రవ్రతచరితయు దేవద్విషత్‌క్షోభమున్ శ్రీ
సుత సంహారమ్ము భూభృత్సుత తపము నుమాసుందరోద్వాహమున్ ద
ద్రతి భోగంబుం గుమారోదయము నతం డనిం దారకుం బోరగెల్పున్॥

వ॥ అనం బరగు సకలావయవంబులం బరిపూర్ణంబైన దివ్య కావ్యాంగనా సృష్టికిం
ప్రధాన సృష్టికర్తయైన॥

సీ॥ విధి నియమంబున విశ్వంబు సృజియింప దక్షప్రజాపతిం దలచి మరియు
బ్రికృతి స్వరూపమై బరగు మహామాయ త్రైలోక్యమాత నాధారశక్తి
భావింప సద్విధి నావహించుడు రూప లావణ్యగుణ హావభావకాంతి
సుందరాకార విస్ఫురణతో బ్రత్యక్ష మయ్యె నీవలతు నీవడుగు మనిన

ఆ. నాకు బుత్రివై పినాకికిం బత్నివై మిథునచరితం దగిలి మీరు లోక
జననములకు బీజశక్తులై యుండంగ వరము గరుణ నొసంగవలయుదేవి॥

వ. అని యమ్మహాదేవివలన లబ్ధవరప్రసాదుండై యనేకవిధ జపధ్యాన సంస్తోత్రాదులం
బరమేశ్వరుం బ్రత్యక్షంబు చేసి॥

ముగింపు :

సీ॥ జ్ఞానదీపంబు హృత్సదనంబులో దాన దీవియగా నెత్త దివురువారు
వలచేత వసుమతి వలయంబు నవరత్న వలయంబుగా నిడ వలచువారు
భారతిం దమ మోము బసిండిమాడువులోన నిలువేల్పుగా నిల్పదలచువారు
నణిమాది గుణమణిహారము లురమున హారంబుగా నిడగోరువారు

వెలయ మత్కృతి సదువుడు విను .... దీశ్వరాంబికా గుహు లిత్తు రీప్సితములు
వారి నే మెయింగొనియాడువారి కోర్కు లొనర జంగమమల్లికార్జునుడు నొసగు॥

మ. త్రిజగద్వంద్యు దనింద్యు దిష్టజనవర్ధిష్ణుండు విష్ణుండు వా
రిజ పత్రాక్షుడు దక్షు డాదిముని చారిత్రుండు పాత్రుండు గుం
భజతత్వజుడు ప్రాజ్ఞు డీశ్వరపదాసక్తుండు జ
న్మజరాదూరుడు ధీరు డాత్మవిదు డానందుం డమందుం డెదన్॥

క. అమిత సుగుణ మణిరచితా ద్యమల విభూషణ విభూషితావయవుడు జం
గమ మల్లికార్జునుడు వా గ్రగమణి రమణుండు మునిశిఖా .... పేర్మిన్॥

మ. సుకవిస్తుత్యుడు నిత్యు డూర్జితుడు సుశ్లోకుం డశోకుండు స
ర్వకళాధారుడు ధీరు .... నాద్యుండు ధ

ర్మకథాసంగు....దార్యుడు జగన్మాన్యుండు ధన్యుండు బ్ర
హ్మకులోత్తంసుడు హంసుడు త్తమగణాయత్తుం దమత్తుం డెదన్॥

క॥ ముక్తుడు కృత్యాకృత్య వి రక్తుడు ....తత్వా
సక్తుండు నియమపద సం యుక్తుడు సంసారపద విముక్తుండు....

మంగళమహాశ్రీయనువృత్తము :

భూవినుత దార్య జనపూజితుడు సద్గుణ విభూషితుడు సర్వా
.... .... నిర్మల యశః ప్రసర శోభితుడు సద్భా
దేవకుల శేఖరుండు సకలమునిముఖ్యుడు సుధీజనవరేణ్యుడుప్రియుండై
యీవసుధ శిష్టతతి కిష్టఫలయుక్తముగ నిచ్చు దయ మం ... ॥

గద్య :

ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్య శ్రీపాద పంకజ భ్రమరాయమాణ కవిరాజ శిఖామణి నన్నిచోడదేవప్రణీతంబైన కుమారసంభవంబను కథయందు ద్వాదశాశ్వాసము॥

విశేషాంశములు :

ఈప్రతియందు వ్రాత స్పష్టత లేదు. వ్రాత దోషములు కలవు. ఇందు ద్వాదశాశ్వాసములు గలవు. గ్రంథాంతమందు లేఖకు డిట్లు వ్రాసెను. "మూలగ్రంథము నందు కొన్ని అక్షరములు— క, ర, వ, ప మొదలైనవాని వ్యత్యాసములు తెలియుట అసాధ్యముగా నున్నవి కనుక తెలిసినవరకు, శిథిలమైన భాగములు విడిచి, సంధి సమయోచితముగ వ్రాయబడినవి. మూలములో నెట్లున్నదో అటువలెనే వ్రాయబడినది" అని పేర్కొనబడినది.—"ప్రతి వ్రాసినది తంజ నగరము వాసియైన రామచంద్ర భాగవతులు. 12-3-29. యావచ్చక్యం మాతృకావ దావాభ్యాం సమవలోకితం" అని కూడ గ్రంథాంతమున వ్రాయబడియున్నది.

# కుమారసంభవము

( 1 నుండి 6 సర్గలు )

## మానికొండ సత్యనారాయణశాస్త్రి

ఆక్సెషను నెం 6028 : కాల్ నెం. టి. 3–607 : ప్రతి – కాగితము. అసమగ్రము.
పుటలు : 58 ; ప్రతి పరిమాణము : 16 సెం.మీ × 21.4 సెం.మీ.
పంక్తులు : 20 నుండి 34 ;

ప్రారంభము :–

మొదటిసర్గ : ఉమోత్పత్తి

క. కలదా యుత్తర దిక్కున ఇలవేల్పుల నిలయమౌచు హిమగిరి పేరన్
కులగిరి దొరయై ధరణికి కొలగర్రన పూర్వ పశ్చిమోదధు లొరయన్.

తే.గీ. ఎవని దూడనుగా జేసి యెల్ల గిరులు మేరువున్ మేటి గొల్లగా గోరిజేసి
పృథుపు దెల్పిన యీభూమి ధేను నుండి పొంగి వెలిగెడి రత్నాల నోషధులను
పిదికెనో యట్టి భూధరం బిదియె నుండి.

తే.గీ. లెక్కలేనన్ని రత్నాల నీను నట్టి యీ హిమాద్రికి సౌభాగ్యహీన తేమి
కలుగ బోవదు పెనుమంచు కతన జేసి పెక్కు గుణముల రాశిలో నిక్కముగను
ఒక్క దోషం బదృశ్యమై మున్గు గాదె చంద్రునంకంబు తత్కిరణాళి నట్లు.

తే.గీ. హిమగిరీంద్రంపు శృంగముల్ సింధు రాది ధాతురాగంబులన్ వెల్గ తత్ప్రభవము
అభ్రశకలంబులన్ బర్వి యంద మొంది దివి నకాలపు సంధ్యయై తేజరిల్లి
అప్సరః స్త్రీల భ్రమపెట్టి వారి నగల నెంతొ వ్యత్యస్తముగ ధరియించునట్లు
తొందరించుచు నుండు నా సందె పనికి.

ముగింపు :–

తే.గీ. కూతు నెడబాయు బెంగచే కుతిల పడుచు కంట తడివెట్టు తల్లి నూరార్చె నపుడు
అల్లుని గుణంబు లెల్ల దా నల్ల బొగడి "సవతు లేనట్టి కాపురం బబ్బె నమ్మ..
నీదు సుతకంచు దెల్పు చా" ఋషిపు పత్ని.

తే.గీ. పెండ్లి శుభలగ్న మెపు డంచు ప్రీతి నపుడు తండ్రి యడుగంగ నాల్గవనా డటంచు
చెప్పి తక్షణ మా ఋషుల్ చీరవాసు లరిగి రభ్ర పథంబున కల్ల యెగసి.

తే.గీ. అటు హిమాలయు వీడ్కొని యమర మునులు పరమశివు నామహాకోశిదరిని కలిసి
కార్యసిద్ధి నివేదించి యతనిచేత శలవు బొందుచు బోయిరి చదల దారి.

చ. పశుపతియున్ తదద్రిసుత పార్వతి పొందిక యెప్పుడెప్పుడో
యనుచును నెట్టులో గడపె నాదివసంబుల మూడునున్ మదిన్
గుటకలు మ్రింగుచున్, విభుని గొప్ప జితేంద్రియు నీశునే యహో
కలతను వెట్టె నీ ద్పశ వికారము లింక మరేమి సేయవో.

—(ఆరవసర్గ సమాప్తి)—

విశేషాంశములు :-

కవి ఈ కావ్యమునందు పాద సంఖ్య, ఎడనెడ యతిప్రాస నియమములను, పాటించ లేదు. ఈ ప్రతి యందు కొన్నిచోట్ల పాఠాంతరములును గలవు. లిపి స్పష్టము.

# కూరేశవిజయము

(నారాయణైకపరతత్త్వము)

## యోగానందనృసింహాకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 2298 | కాల్ నెం | : టి3-309 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము | పత్రములు | : 119 |
| ప్రతి పరిమాణము | : 43 × 4 సెం.మీ | పత్ర పంక్తులు | : 6 నుండి 8 |

ప్రారంభము :

...న్నస్తతే నోక్తః ప్రజా సృజ మహామతే
ఏవ ముక్త్వా .... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... .... .... ....
.... .... నాద్య గచ్ఛత కించన,

దత్త స్స మహాన్‌రోషాత్ బ్రహ్మణాభూన్మహాత్మనః,
తతో పాద సముత్పన్న స్తస్యాంగే రోష సంభవః,
సతుదన్వా కస్తేన బ్రహ్మణావ్యక్త మూర్తినః,
.... .... .... ద్రత్యసౌ దధౌ,
యని నారసింహ పురాణంబును

సంక్షేప్యచ పునర్లోకాన్ మాయయా స్వయమేవహి మహార్ణవే శయా నోప్సు మాంత్వం పూర్వ మజీజినత్, పద్మే దివ్యార్క సంకాశేనాభ్యా ముత్పాద్య ... మపి, ప్రాజాపత్యం త్వయా కర్మ సర్వం మయి నివేశితం, అనియు నుత్తర రామాయణంబును, ఇత్యాది శ్రుతి స్మృతి పురాణేతి హాసంబు లనేకంబులు గలవు. గావున బ్రహ్మ రుద్రాది సకల ప్రపంచంబు శ్రీమన్నారాయణునియందుల నుద్భవించుట యథార్థం బననొప్పు పురుష..గ్ం సర్వం - అను క్రమంబున శ్రీమన్నారాయణుం డొక్కరుండె పరబ్రహ్మంబని తెల్యుము. కల్ప భేదంబున బ్రహ్మ విష్ణులకు భర్గుం డుదయించె నని పల్కిన శైవ మతాంధకూప నిమగ్నుం డిట్లనియె.

సీ. బాగుగా నా పరబ్రహ్మ నామంబును బ్రహ్మ రుద్రాది సత్రపుభుల యందు
కలదు గ్రంథములందు గట్టిగా శోధించి చూచిన యట్లు విష్ణునికి నొక్క
నికె కలదని శాస్త్ర నిర్ణయం బగు నెట్లు బ్రహ్మంబు హరియని పరగు నెందు
అనిన దీరాసురం దతని కిట్లను నవ బ్రహ్మలు ఘనను గూడి భక్తి సేయు

ధర్మ సత్వాధ్వరంబున దత్తు దపుడు సభను గూర్చున్న వారికి సవినయమున
వందనం బాచరించియు వారి తోద ప్రశ్నగా జేసె నత్యంత భక్తి మెరయ.

సీ. రాజస తామసులైన బ్రహ్మరుద్రాదు లకును పరబ్రహ్మ నామ
ములు జెల్లుచున్నవి మూలంబు దెలిసిన బుధులు మీరలు మహాపుణ్యు లనుచు
ప్రశ్న జేసితి పరబ్రహ్మ మొక్కతె యంద్రు దాని పెక్కండ్రని పూని పల్క
దగదు శ్రీ విష్ణుడె దైవం బటంచును నిశ్చయింపగ రాదు నీతి శాస్త్ర

పద్ధతులు వేగ శోధించి శుద్ధ వేద మార్గములు దెల్యబల్కి సన్మానముగను
సురచిరంబుగ మమ్ముల కరుణజూచి అధికముగ బ్రోవరయ్య మహాత్ములార.

ముగింపు :—

క. సింగము నెక్కఁగ వచ్చును సంగతిగా పులికి బుద్ధి సలుపగ వశ మే
భంగిని మూర్ఖుల దెలుపగ నింగితమా క్రూర కర్మ హితమగు తెలియన్.

క. అని యానతిచ్చి విష్ణుడు ఘను డంతర్ధాన మగుట గని కూరేశుం
డనిమిష పూజ్యుండై వే చనియెన్ హరిదాసు డతని సంగతి కేగెన్.

సీ. శ్రీ పెరుంబూదూర సింహాసనస్థుడై యతి రాజశేఖరుం డతిశయమున
కూర్చుండి యుండుట కూరేశు డత్యంత భక్తి ప్రపత్తిచే పరిణమించి
సాష్టాంగ సేవించి శైవాధముని వంచి తగిన కుతర్క వాదము లణంచి
రంగనాథుడు కృప రంజిల్ల నిలువుక న్నులు కృపచే నిచ్చి ఫలితవరము
గురు పరం పర జ్యేష్ఠులకును ఘటించు ననుచు నియమించి గారవించిన శుభంబు
విన్నపం బాచరించిన వివిధ గతుల ఆదరించెను సంతోష మావహిల్ల.

క. యతి రాజు సన్నిధిని దా మతులిత సద్గోష్ఠుల మరుదానందముచే
మతి మంత్రోచ్చారణమున అతిశయ సుఖలీల నుండి రార్యులు మెచ్చన్.

క. అది గావున శ్రీహరియే సదయాత్ముడు భక్తకోటి సంఘములకు దు
ర్మదులైన క్రూర జనులకు నదయుం డగు బ్రహ్మ మతడె యాగమ విధులన్.

వ. అని పరత్వస్థాపకుం డను బ్రాహ్మణోత్తముండు ప్రజ్ఞా సాధకుండను శిష్యోత్తమునకు కూర నాయక చోళరాజు సంవాదంబు లానతిచ్చె నిదియు.

క. వ్రాసిన విన్నం జదివిన భాసురముగ భుక్తి ముక్తి పదములచే స
ద్భాసన నుత కీర్తిదమై వాసిగ సుఖి యింతు రెల్ల వార లటంచున్.

క. ధరణి శశి పావకాక్షున కరవింద భవాది దేవతారాధునకున్
తిరువేంకటేశ్వరునకును విరచించితి మెల్ల లోక విఖ్యాతముగాన్.

మాలిని

.... .... .... .... ....
.... .... .... .... దాంత జాలా
ధరణి భర ముకుందా ధర్మ సంస్థాప్య బృందా
సుర రిపు గజ సింహా శోభితాంగా నృసింహా

గద్య :—

ఇతి శ్రీలక్ష్మీ నృసింహ చరణారవింద మకరంద పాన షట్పద చిత్తాయత్త విలోల శ్రీమన్ నృసింహ వరలబ్ధ కవితా చాతుర్య సత్య విద్యా విశారద శ్రీమత్తిరునఘరి వాత్స్య రామానుజార్యోపమంత్రానుష్ఠాన సంపన్న సురుచిరాపస్తంబ సూత్ర శ్రీవత్సస గోత్ర పవిత్ర పరమ వైదికాచార నిరత శ్రీమత్సముఖము వంశాబ్ధిచంద్ర అచ్చన వెంకటమ్మ గర్భసార దయ పరిపూర్ణ సుధాకర శ్రీ యోగానంద నృసింహాయ ప్రణీతంబైన కూరేశవిజయంబున నారాయణైకపరత్వంబునందు శైవశంకా నిరసనం బన్నది ద్వితీయాశ్వాసము.

విశేషాంశములు :—

ఈ 'కూరేశ విజయము' అను గ్రంథమునకే 'నారాయణ పరతత్త్వ'మను నామాంతరము గూడ గలదు. ఇది సముఖము వంశీయు డగు యోగానంద నృసింహ కవి విరచితము. ఇది నారాయణ తత్త్వమును తెలుపు ౨ ఆశ్వాసముల గ్రంథము: గ్రంథారంభము నష్టమగుటచే కృతి కృతిభర్తల వివరములు లభ్యము గాలేదు. కవి తాను నృసింహ వరలబ్ధ కవితా చాతుర్యుడ నని ఆశ్వాసాంత గద్య యందు తెలుపుకొనెను. రామానుజాచార్యునిచే మంత్రోపదేశము పొంది అనుష్ఠించు వాడ ననియు కవి పేర్కొనెను.

ఈ ప్రతియందు గ్రంథారంభమునందు ౩౩ పత్రములు నష్టమైనవి. మిగిలిన గ్రంథము పూర్తిగా నున్నది. ఇందు సుజ్ఞాన పట్టణమున పరతత్వ వేదియను గురు శేఖరుండు ప్రజ్ఞా సాధకుండను శేష్యోత్తమునకు సత్వరజస్తమో మిశ్ర గౌణ ఘటక ముఖ్య వాక్య పరిచ్ఛేదమను, బ్రహ్మరుద్రాది సకల ప్రపంచోద్భవంబును, సాత్విక రాజస, తామస మిశ్ర వైదికాచార విమర్శయు, నేకాదశి మాహాత్మ్య మాది గాథలును, శైవ శంకా నిరసనంబును, అందు కూరనాయక చోళరాజ సంవాదంబును, కూరేశ విజయమును వివరించుట గలదు. ఈ ప్రతి యంతటి కొన్ని పత్రములు క్రిమిదష్టములై, శిథిలములై యున్నవి. ప్రతి విలేఖనమున అటనట పదములు చ్యుతములైనవి. స్వల్ప దోషములు గలవు.

# గజేంద్రమోక్షము

ఆంధ్రమహాభాగవతాంతర్గతము

## బమ్మెర పోతన



ప్రారంభము :

శ్రీ మన్నామ పయోద శ్యామ ధరాభృల్లలామ జగదభిరామా
రామాజనకామ మహో ద్దామగుణస్తోమధామ దశరథరామా.

వ. మహనీయ గుణ గుణ గరిష్ఠులగు నమ్ముని శ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుడు శుక యోగీంద్రుం గనుంగొని.

క. వినబడియెను స్వాయంభువ మను వంశము పర్ణధర్మ మర్యాదలతో
మనుజుల దనుజుల వేల్పుల జననంబులు సృష్టియెల్ల జనించుటయున్ ।

ఉ. ఏ మను కాలమందు హరి యీశ్వరు డేటికి సంభవించు నే
మేమి యొనర్చె నమ్మనువు లెవ్వరు యేక్రియ జేయుచున్న వా
డేమి నటించె మీద గతమెయ్యది సజ్జను లైనవారు ...
న్నేమని చెప్పుచుందురు మునీశ్వర నా కెరిగింపవే దయన్ ॥

వ. అనిన శుకుం డిట్లనియె ॥

క. ఈ కల్పంబున మనువులు ప్రాకటముగ నార్వురైరి పదునలువురలో
లోకముల జనుల పుట్టువు లాకధితము లయ్యె వరుస నఖిలములు నృపా ॥

వ. ప్రథమ మనువైన స్వాయంభువునకు నాకూతిదేవహూతులను నిరువురుకూతులు గలరు వానికి గ్రమంబున గపిలయజ్ఞనామంబుల లోకంబులకు ధర్మజ్ఞాన బోధంబు సేయు

కొరకు హరి పుత్రత్వంబు నొందె నందు గపిలుని చరిత్రంబులు మున్ను చెప్పంబడియె యజ్ఞుని చరిత్రంబు సెప్పెద వినుము.

మ. శతరూపాపతి కామ భోగ నిరతి స్సంత్యక్త భూ భారుడై
సతియుం దానును గానకేగి శత వర్షంబు లున్నందానది
న్వ్రతి యై యేక పదస్థుడై నియతుడై వాచంయమి స్ఫూర్తితో
గత దోషుండు తపంబు సేసె భువనఖ్యాతంబుగా భూవరా ॥

వ. ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువ మనువు దనమనంబులోన.

సీ. సృష్టిచే నెవ్వడు చేతన పడకుండు సృష్టి యెవ్వని చేతచే జనించు।
జగములు నిద్రింప జాగరూకత నుండి యెవ్వడు బ్రహ్మండ మెరుగుచుండు
నాత్మ కాధారంబు నిఖిలంబు నెవ్వడు నెవ్వని నిజధనం బింత వట్టు
పొద గాన రాకుండు బొడ గను నెవ్వడు నెవ్వని సృష్టికి నెదురు లేదు

ఆ. జనన వృద్ధి నిలయ సంగతి జెందక యెవ్వ డెడపకుండు నెల్లయెడల
దన మహత్వ సంజ్ఞ తత్వ మెవ్వడు దాన విశ్వరూపు డనగ విస్తరించు ॥

వ. అని మరియు నిరహంకృతుండును నిరాశయ పరిపూర్ణుండు ననన్యప్రేరితుండును న్నృ శిక్షా పరుండును నిజమార్గ సంస్థితుండును నిఖిలధర్మ భావనుండు నైన పరమే శ్వరునకు సమస్కరించెద నని యుపనిషదర్థంబులు పలుకు చున్న మనువుం గనుంగొని

క. రక్కసులు దినగ గడగిన వెక్కసముగ యజ్ఞనామ విష్ణుడు వారిం
జక్కడచె జక్రధారల మిక్కుటముగ వేల్పులెల్ల మెలని పొగడన్ ।

వ. ఇది ప్రథమ మన్వంతరం బింక రెండవ మనువు వినుము.

ముగింపు :

వ. అని మరియు సప్పరమేశ్వరు డిట్లని యానతిచ్చె నెవ్వ రేనియు నపరరాత్రంబున మేల్కాంచి సమాహిత మనస్కులై శ్వేత ద్వీపంబును నాకుం బ్రియం బయిన సుధా సాగరంబును హేమనగంబును సద్గిరి కందర కాననంబులను వేత్ర కీచక వేణు లతా గుల్మ సురపాదపంబులను యేనును బ్రహ్మయు ఫాలలోచనుండును నివసించి యుండు నిక్కొండ శిఖరంబులను గౌమోదాకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను శ్రీదేవిని శేషగరుడ వాసుకి ప్రహ్లాద నారదాది ఋషులను మత్స్య కూర్మ వరాహాద్యవ

తారంబులను ద దవతారకృత కార్యంబులను సూర్యసోమ పావకులను బ్రణవం బును ధర్మ తపస్సత్యంబులను వేదంబును వేదాంగంబులను శాస్త్రంబులను గో భూసుర సాధు పతివ్రతా జలంబును జంద్రకాశ్యప జాయా సముదయంబును గౌరీ గంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ నిచయంబును నమరులను నమర తరువులను నైరావతంబును నమృతంబును ధ్రువుని బ్రహ్మర్షినివహంబును బుణ్యశ్లోకులయిన మానవులను సమాహిత చిత్తులై తలంచు వారలకు బ్రాణావసాన కాలంబును మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి విహగ పరివృఢవాహనుండయి వేంచేసె విబుధానేకంబు సంతోషించెనని చెప్పి శుకుండు రాజున కిట్లనియె .

క. గజరాజ మోక్షణంబును నిజముగ బఠియించునట్టి నియతాత్ములకున్
గజరాజ వరదు డిచ్చును గజ తురగ స్యందనములు గైవల్యంబున్.

క. తామసు తమ్ముడు రయివత నామకుడయి వెలసి మనువు నలువుర మీద
న్స్వామికి బ్రతివింధ్యార్జును నామాదులు నృపులు మనువు నందనులు నృపా.

సీ. మునులు హిరణ్యరోముడు నూర్ధ్వబాహుండు వేద శీర్షుడును వీరు మొదలు
నమరులు భూత రథాదులు శుభ్రని పత్ని వైకుంఠాఖ్య పరమసాధ్వి
యా యిద్దరకు బుత్రుడై తన కళలతో వైకుంఠు డనబుట్టి వారిజాక్షు
డవనిపై వైకుంఠ మనియెడి లోకంబు గల్పించ నెల్లలోకములు మ్రొక్క

గీ॥ రమ యెదుర్కొలు చేకొనె రాజముఖ్య తదనుభావ గుణంబులు దలప దరమె
యీ ధరారేణు పటలంబు నెరుగవచ్చు గాని రాదయ్య హరిగుణ గణము సంఖ్య ।

వ. తదనంతరంబ.

సీ। చక్షుస్తనూజుండు చాక్షుషుండను వీరు డారవ మనువయ్యె నవనినాథ
భూమీశ్వరులు పురుః పురుష సుద్యుమ్నాదు లాతని నందను లమరవిభుడు
మంత్రద్యుమాఖ్యు డవర్త్యులాప్యాదికు లాహవకుశ భీకరాదిమునులు
మునులందు విభుడు సంభూతికి నాత్మజుం డై పుట్టి యజితుండు నాగ నొప్పె

ఆ. నతడ కాడె కూర్మమందరాద్రిని తా నుదధి జలములోన నుండి మోసె
నతడ చువ్వె దివిజు లర్థింప నమృతాబ్ధి ద్రచ్చియిచ్చె నా సుధారసంబు ॥

విశేషాంశములు :—

ప్రతివిలేఖనము :

మన్మథనామ సంవత్సర శ్రావణ బహుళ ౩౦ (?) జయవారం నాటికి గజేంద్ర మోక్షం సంపూర్ణం.

ప్రని చక్కనిది. వ్రాత స్పష్టముగానున్నను దోషములు కలవు.

భాగవత అష్టమ స్కంధము నందలి గజేంద్రమోక్ష కథను ఎత్తి వ్రాసికొనెను. బహుశః గజేంద్రమోక్ష పారాయణ కొరకై వ్రాసికొని యుండవచ్చును.

# గజేంద్రమోక్షము

బమ్మెరపోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 611 | కాల్ నెం | : టి 3-505 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 19 |
| ప్రతిపరిమాణము | : 39×3.2 సెం. మీ. | పత్రపంక్తులు | : 4 |

విశేషాంశములు :

అసమగ్రము. కొన్ని పత్రములు శిథిలములైనవి. వ్రాతదోషములు గలవు. పత్రముల క్రమసంఖ్య స్పష్టముగా లేదు. మధ్యలో పెక్కు పద్యములు లోపించినవి. కొన్ని పద్యములు అసంపూర్తిగా వ్రాసి మిగిలిన భాగము వదలివేయబడినది.

# గజేంద్రమోక్షము

బమ్మెరపోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5640 | కాల్ నెం | : టి 3–581 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 18 |
| ప్రతి పరిమాణము | : 37.5×3 సెం. మీ | పత్రపంక్తులు | : 5 |

విశేషాంశములు :

అంతిగా క్రిమి దష్టము. గ్రంథ శైథిల్య గ్రంథపాతములు కలవు. కొన్ని పత్రములు విరిగి శేషించి యున్నవి.

వ్రాయసకాని పేరు పురిటి చిననరసింహం. వి లేఖన కాలము పేర్కొనబడలేదు. భాగవత అష్టమస్కంధములోని గజేంద్ర మోక్ష కథ ప్రత్యేకముగా ఎత్తి వ్రాయబడెను. దోషము లున్నను వ్రాతచక్కనిది.

# గణమాలిక

పండితారాధ్యచరిత్ర

## పాల్కురికి సోమన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5538 | కాల్ నెం | : టి 3–301 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 7 |
| ప్రతి పరిమాణము | : 42×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

ప్రారంభము :

అంత నిక్కడ మల్లికార్జునారాధ్యు లెంతయు రయమున నేగుచు మున్న
బొద్దని సమముగా బ్రతిమైన తప్పు బొద్దు నాచే ముట్ట బరపని తప్పు

హరదూషణంబుసేయగ విన్న తప్పు హరగణంబుల బాసి యందున్న తప్పు
ఆ పర సమయంబు లణపని తప్పు పాపి చోడని తోడ బలికిన తప్పు

సన్నుత గణ నామ సంకీర్తనంబు చెన్నార వాయార జేయంగ దలచి
ఆద్యభక్త గణ సహస్ర నామములు హృద్యంబుగా పఠియించు చెట్లనిన

శ్రీనంది శివవర శ్రీనందికేశ్వ రానంది నంది నాథాక్షయ విజయ
భద్రవీరక వీరభద్ర భద్రాక్ష భద్ర మహాకాళ పంచాక్షర త్ర

యక్షరద్వ్యక్షరేకాక్షరాక్షర ష డక్ష రోగ్రాక్ష ధూమాక్ష నలాక్ష

ముగింపు :

శివలెంక మంచయ్య చిగురు చంద్రయ్య శివరాత్రి సంకయ్య శ్రీసూరసాని
శివ్వయ్య ధర్మయ్య శ్వేతయ్య వైజ కవ్వ బొల్లవ్వ రెబ్బవ్వ రేకవ్వ

అమ్మవ్వ అరసవ్వ ఆదవ్వవీర రెమ్మవ్వ కమలవ్వ నిమ్మవ్వగారు
ఆదిగాగ గణ సహస్ర నామములు ఆదరణీయంబులై యొప్పు నిట్లు

నలితధ్గణ సహస్రనామస్తవంబు   వెలయ బఠించిన విన్న వ్రాసినను
విరచించినను భక్తి విస్ఫూర్తియొసగు   దొరకొను శుభములు దురితముల్ దొలగు

ముక్తిచ్చ నీనామములు బఠియింప   ముక్తులు నాల్గును ముదమున గలుగు
భక్తిచ్చ నీనామ పఠనంబు సేయ   భక్తి సౌభాగ్య సంపద సమకూరు
వొందు దిగంత సంయుత మహాకీర్తి   జెందు మంగళ మహా శ్రీశ్రీ ప్రపూర్తి.

విశేషాంశములు :

ఈ గణమాలిక అను ప్రతి పాల్కురికి సోమనాథకవి విరచితమగు పండితారాధ్య చరిత్రలోని మహిమ ప్రకరణములోని భాగము. ఇందు శివభక్తుల యొక్క నామములు (సహస్రము) పేర్కొనబడినవి. ఇది సమగ్రప్రతి. ఇందలి లిపి సులభగ్రాహ్యము. కొన్ని లేఖన దోషములు గలవు. ఇది కావ్యముగ పేర్కొనబడినను ప్రత్యేక కావ్య మనుటకు వీలులేదు. కావ్యభాగము మాత్రమే. ఇది ప్రమాదీచనామ సంవత్సర మార్గశిర శు॥ ౧౦ గురువారం వ్రాయబడినది.

# గయోపాఖ్యానము

## ( కృష్ణార్జున సంవాదము )

## రామనామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం : | 3996 | కాల్ నెం : | టి 3-264 |
| ప్రతి : | తాళపత్రము; సమగ్రము. | పత్రములు : | 36 |
| ప్రతిపరిమాణము ; | 36×4 సెం.మీ. | పత్రపంక్తులు: | 9 |

ప్రారంభము :

శ్రీ గంగాధర సన్నుత   సాగర హృదయాబ్జ సదన సారస నయనా
నాగేంద్ర వరద శుభకర   నాగసుతాధీశతల్ప నరమృగరూపా.

అవధరింపుము.

శౌనకాది మహామునీంద్రులకు సూతుం డిట్లనియె.

క. సరసీ జాప్తోదయమున సురరిపు మదహరుడు లేచి సొంపలరంగా
తరుణీమణి రుక్మిణితో మరుకేళీగృహము వెడలి మలయుచు నిలువన్ ॥

క. పచ్చల గిండిని నుదకం బచ్చేడియ వేగదెచ్చి యతిమోదముతో
పచ్చవిలుకాని గురుడగు నచ్యుతు చరణములు గడిగె నతి శీఘ్రమునన్ ।

తే.గీ. కలికియొక్కతె పన్నీరుగౌరవమున తెచ్చి యిచ్చిన గై కొని దివిజనుతుడు
ధౌత వస్త్ర ప్రసన్నుడై దనరుచుండె కోటి భాస్కరతేజుడై కొమరుమిగుల ।

సీ. పూర్ణచంద్రుని బోలు ముఖముపై మృగనాభి తిలకంబు దీర్చెను కలికి యొకతె
కంబు సమానమౌ గళమున భాసురాం బరములు నొక సతి యలవరించె
నీలమేఘ చ్ఛాయ నిరసించు నెమ్మేన చందనం బొక పద్మగంధి యలదె
శ్రీకారముల మించు చెలువైన వీనుల కాంత యొక్కరితి చౌకట్లుబెట్టె

తే.గీ. శిఖను పువ్వుల సరు లొక్క సఖియ జుట్టె చంద్రకావి రుమా లొక్క చెలువ గట్టె
వేళ్ళ రత్నోర్మికలునొక్క వెలది బెట్టె నంద నందనునకు మహానందమునను.

ముగింపు :

సీ. పార్థు పాదములకు భక్తితో ప్రణమిల్లి ప్రణతులు సేయుచు పరగ గయుడు
ఓ రాజశేఖర ఓ సత్యసంచార జంభారి సత్పుత్ర శార్ఙ్గిమిత్ర
దనుజారితో బోర దక్షారికిని శక్య మే యింతసాహస మీ ధరిత్రి
నా ప్రాణములు గాచి నన్నురక్షించితి వర ధరాధరధైర్యవర్ణనీయ
అనుచు వినుతింప ముదమంది యర్జునుండు నగుచు కౌగిటజేర్చి గంధర్వవిభుని
నల్ల జగముల విహరింపు మనుపుభంగి భయములేకుండు మని పంచె పార్థు డపుడు

గీ. పసిడి తేరెక్కి సంతోషభరితు డగుచు చనె మణిపురంబునకు తన సతులుసుతులు
తల్లిదండ్రులతోగూడి తొల్లిటట్ల ఘనత గంధర్వపతి యుండె గౌరవమున ।

గీ. యమ తనూజుండు సంతోష మావహిల్ల ద్వైతవనమున తమ్ములు దాను ద్రుపద
పుత్రితోగూడి సంపదల్ బొందియుండె చేరి ధౌమ్యాదు లెల్ల నాశీర్వదింప.

సీ. ఈకథ వ్రాసిన విన్నవారికి నాయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి
ఈకథ పఠియించు నట్టివారికి కరితురగాదులు కనక జయము

విమలహర్షములును కమనీయచారులు శ్వేతాతపత్రముల్ చెలగు చుండు
నింపొందు పదవుల నంగనా జనములు నెల్లవస్తువులును నెలమితోడ

గీ॥ జలజనేత్రు డధికజయము సంతతమును పరగ తనదు సతిని పాలుజేసి
యిష్టసిద్ధులొసగి యీప్సితార్థము లిచ్చు ననుచు జెప్పె ముని గణేశ్వరుండు.

క. విలసిత సురముని వందిత కులగిరివర వీరదైత్య కోటివిరామా
సలిలజభవ వినుతయహో ఒలగిరి శ్రీమందిరేశ పావనచరితా.

తో. కమలాయత లోచన గోత్రధరా
విమలాంబుజ లోచన విశ్వపతీ
సమరాహతదానవ చక్రధరా
సుమహా నరసింహ విశుద్ధవతీ.

మా. సరసిజదళనేత్రా సామజస్తోత్రపాత్రా
నిరుపమహరమిత్రా నీరదాగారగాత్రా
వరగరుడగిరీశా వారిజారిప్రకాశా
సురరిపు మదహారీ సుందరీచిత్తచోరా.

గద్య :

ఇది శ్రీమదహోబలేశ్వర కరుణాకటాక్షవీక్షణ ప్రవర్ధమానవైభవ తిమ్మనమంత్రి తనూభవ రామనామాత్య ప్రణీతంబైన శ్రీకృష్ణార్జున సంవాదంబను నామాంతరంబు గల గయోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము ; "విక్రమ సంవత్సర మార్గశిర శుద్ధ ౧౦ మందవారం పూర్వ యామం వరకు గయోపాఖ్యానం ప్రతిక్రమాన చూచివ్రాసినాను— వెంకయ్య స్వహస్తం వ్రాలు.

ప్రతి బాగుగానున్నది. క్రిమిదష్టము కాలేదు. గ్రంథశైథిల్య గ్రంథపాతములు లేవు. గ్రంథాంకితాదులగు ఇతర విషములులేవు.

ఇందు 2 ఆశ్వాసములు గలవు.

# గయోపాఖ్యానము

( కృష్ణార్జున సంవాదము )

## రామనామాత్యుడు

| ఆక్సెషన్ నెం : 3822 | కాల్ నెం : బి 8-900 |
|---|---|
| ప్రతి : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు : 59 |
| ప్రతిపరిమాణము : 40×4 సెం.మీ. | పత్రపంక్తులు : 6 నుండి7 |

**విశేషాంశములు :**

ఈ ప్రతి 1884 సం॥ ఫిబ్రవరి 4 తారీఖున చిత్తూరు లోకనాథ ముదలియారుగారి కవి రంజనీ ముద్రాక్షారశాలలో ముద్రించబడిన అచ్చు ప్రతిని చూచి వ్రాసినది. ఇట్టి ప్రతి విలేఖన విశేషములు దొరకుట చాల అరుదు.

ప్రతిలోని కొన్ని పత్రములు క్రిమిదష్టములైనవి. కొన్ని తునకలై మిగిలినవి. లిపి స్పష్టము. లేఖన దోషములు గలవు. ప్రతి నలువుదిరుగుచున్నది.

# గురుకర జాతీయము

| ఆక్సెషన్ నెం : 3931 | కాల్ నెం : బి 8-8 |
|---|---|
| ప్రతి : కాగితము: అసమగ్రము. | పత్రములు : 16 |
| ప్రతి పరిమాణము : 21×16 సెం.మీ | పత్ర పంక్తులు : 22. |

ప్రారంభము :

శ్రీగురుమదిరాళ పరబ్రహ్మణె నమః। గురుకరజాతీయః అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన గురుకరజాతీయం బను మహాప్రబంధంబునకు గథాక్రమం బెట్టిదనిన.

శా॥ శ్రీలాలిత్య విభూతిదాయకమునిశ్రేయానుకూలంబు సం
శీలాధ్యక్ష గణాన్వితంబు పరమేష్ఠిశ్రీధరాభేద్యమున్

సాలోక్యాది ఫలప్రదంబు భవ సంసారార్ణవాంతమున్
కైలాసం బధికార్కకోటినిభ సంకాశంబుగా నొప్పెడిన్॥

సీ॥ మరియును దురిత సంహారమును నిఖిల ధర ధరోన్నత రౌప్యగిరియనంగ
వాసవాచ్యుత శేష వారిజభవమనో ల్లాస వాక్ప్రతిత కైలాస మనగ
భద్ర ప్రయుక్తశుంభద్రుద్రహిణాండదా రిద్ర్యభంజితతారకాద్రి యనగ
మౌనవ్రత వితాన మానసాద్యఖిల గ ణానిరూపిత శివస్థాన మనగ
వెలయు సముచిత విజ్ఞాన వేదవేద్య ప్రణవ సంస్కార మోక్ష విభ్రాజితోప
హితకలాతీత శ్రేయము నీయ యోగ మూల బీజంబు మృత్యుంజయాలయంబు॥

ఆ.వె. అనఘమై తనర్చు నారాజితాద్రికి భవ్యమైన జ్యేష్ఠ భాగమందు
వర్ణనీయమైన వరవీరశైవాను భావిత ప్రసంగభావు లగుచు॥

సీ॥ శ్రీనంది నందినాథానంద వరవీర భద్రభద్రాక్షప్రభాసితైక
ముఖ పంచముఖ చతుర్ముఖ దశముఖ ముఖ్య గజసింహ మేషాశ్వకపిముఖార్థ
నారీశ్వరైక కర్ణద్వికర్ణ త్రికర్ణ వారాహ గోకర్ణ భవవిభంగ
నంది మహాకాళనంది మహాకాయ విగత కాయజఘన విజయ....
దక్ష భాస్కర విష భక్షణాక్షయాంగ ఖ్రభుమృత్యుంజయాభయ బాహుబల స
మగ్ర దద్రుస్ కరేణు కమండలంబు పరమపథ భాష్యయుక్త మా ప్రమథగణము॥

**ముగింపు :**

గీ॥ శరణు బొందెద రేణుకాచార్యవర్య మనవి యొక్కటి గలదు హిమాద్రిజాత
కమలతర గురులింగ జంగమ స్వరూప మీశుడే నని సూచించు టిద్ధమహిమ॥

క॥ దుర్గ మును విన్నదొటకు భర్గుడు తత్పూత మెరుక పరుప మది ముదాం
తర్గత మొందెను దత్పం సర్గార్థం జే నెటరయ జాలుదు ననఘా॥

గీ॥ మందమతినైన నను కొనప్రమానిపందు దెంచ శబలను బంచిన తీరుగాదె
భవ్యశివయోగ తత్వ ప్రభావసూక్తి నెరపి కనుగొంటి ననుటయో వరగణేంద్రా॥

క॥ మీరలు మహానుభావులు కారుణ్యాత్ములు యశోవికాసు లగుట నా
కోరిక ఫలించె తృషకై నోరెదు టమృతాబ్ధి గల్గ నోమహిమాఢ్యా॥

విశేషాంశములు :

ఈ ప్రతియందు గ్రంథాంతము లేదు. గ్రంథకర్త నామములేదు. వ్రాయసకాని పేరు గాని, కాలముగాని సూచింపబడలేదు. ఇది శైవ ప్రబంధము. వర్ణరాహిత్యము, జాత్య భేదము నిరూపించుటకు వ్రాయబడిన ప్రబంధముగా దోచుచున్నది.

# గురుభక్తయ్య కథ

## పండితారాధ్య చరిత్ర

## పాల్కురికి సోమన

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 5540 | కాల్ నెం : | టి 3-303 |
| ప్రతి | : తాళపత్రము ; సమగ్రము. | పత్రములు : | 6 |
| ప్రతి పరిమాణము | : 42×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు : | 6 |

ప్రారంభము :

పరమ సద్గురులింగ పాదారవింద పరవశీభూత విస్తారమానసుడు
ధరగురుభక్తి సుధారసాంభోధి పరగురుభక్తి సువర్ణభూధరము

చిరగురుభక్తి సంచిత గురుతరువు కరమొప్పు గురుభక్తి కామద్రుమంబు
నెట్టన గురుభక్తినిధి గురుభక్తి పట్టబద్ధుడు గురుభక్తయ్య యనగ

ప్రతి యోగురుఃసశివఃప్రోక్త యనియు శ్రుతయ శ్శివస్య గురుస్మృతే యనియు
శృతినాస్తి తత్వం గురోః పరం బనియు శృతి త్రిసంధ్యాయాం గురోః పూజ యనియు

మ్రోయంగ నియతిమై మూడు సంధ్యలను పాయక తనగురు పాదాంబుజాత

ముగింపు :

గురు పరతంత్ర నిర్భరగుణోద్యుక్త గురుకార్యచిర ధురంధర కళాయుక్త
గురుమనోజ్ఞాంచితచరిత ప్రసక్త గురువర మహిమానుగుణ గురుభక్త

యంచు భక్త్యానీకమటు చోదమంది యంచితప్రీతి దొల్కాడ గీర్తించి
తడయక గురుకృప దనపదాబ్జములు బడసె నీక్రియ గురుభక్తయ్య నాడు

ఖండేందుధరు భక్తమండలి వొగడ పండితేంద్రుడు నేడు బడసె పాదములు
తెల్లంబుగా మహాదేవయ్యగారి కెల్లవారును జూడ నిల నట్లుగాక.

**విశేషాంశములు :**

ఇది గురుభక్తయ్య కథ అను తాళపత్రప్రతి. ఈ కథాభాగము పాల్కుర్కి సోమన విరచితమగు పండితారాధ్య చరిత్రలోనిది. ఒక శివభక్తుని చరిత్ర. ఇది పురాతన ప్రకరణములోనిది. ఈ ప్రతి బాగున్నది. లిపి స్పష్టముగా నున్నది. లేఖన దోషములు కొలదిగా నున్నవి.

# చంద్రదేవోపాఖ్యానము

## ధూళిపాళ కృష్ణకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3558 | కాల్ నెం | : ట 3-244 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 79 |
| ప్రతి పరిమాణము | : 34.5×3 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 నుండి 6. |

ప్రారంభము :—

శ్రీ కైలాస గిరీంద్ర సుందర తర .... ప్రకాశోద్ఘన
ప్రాకారాంగణ రమ్య హర్మ్య విమల ప్రాంతంబునం దేవితో
నేకాంతంబున నుండి తారక ధనం బ్రేపొద్దు ....
....డీశ్వరు దస్మదీయ కృతమున్ శోభింపగా జేయుతన్.

శా. రారాజేంద్ర లసత్కిరీట ఘనతారాళి సురేంద్రోజ్వల
శ్రీ రాజీవమణి..ప్రతాన ధగిత శ్రీ దివ్యపాదుండు వి
స్తారోదార యశో విహారు డగు సీతారామ చంద్రుండు స
త్కారుణ్యంబున మమ్ము బ్రోచి శుభముల్ - — చుగా నెప్పుడున్.

క. వేదములు నలు మొగంబుల మోదముగా గన్న నేటి ముందుగ నమ్మ
ద్భేదముల ద్రుంచి సిరులు ప్ర సాదించుం గాత కావ్య సరసతకు దగన్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా....బూనిన యిమ్మహా ప్రబంధంబునకు కథా క్రమం బెట్టిదనిన.... .... .... వటుండును దానును నవి .... బగు వారణాశీ తీర్థం . . . బో....చు నచ్చటచ్చట . . . పుణ్యకథా విన్యాసంబు లతని కుప న్య .... నయ్యోగి . . . .... నయ్యోగి వరుండు, క్రమప్ర....బుల పుర నగర వన .... యింపుచు, విప్రగృహంబుల దధిక్షీర ఘృతాన్నంబుల శరీర పోషణంబు సేయుచు చనిచని, యొక్కచోట మా....మధ్యంబున ఘనవీనల సంకుల పరాగ పటలంబు దరియం జొచ్చి నడుప దొణంగు నెడ గురునకు శిష్యుండిట్లనియె.

శా॥ స్వామీ యిచ్చట నీ విసిల తరళి సాంద్ర ప్రకాశోదయం
బేమీ భూమిని మన్ను మానవులలో నెవ్వారలైన న్మ . హా
ప్రేమన్ జన్నము లాచరించిరొ తగన్ పెంపొంది యిన్నేలకున్
శ్యామత్వంబు జనించు టెట్లు మదికిన్ సందేహమున్ దోచెడిన్.

ముగింపు :

వ. అని నారదుండు కాశీపుర వరేశునకుం జెప్పెనని యతీంద్రుండు శిష్యున కెరింగించిన నతండు పరమానంద కందళిత హృదయుండై ప్రణామం బాచరించె. నిప్పురాణంబు సమస్తదురితాపహరంబును, సౌభాగ్య గరిమంబును, పుణ్య శ్లోక పురాతనరాజ వృత్తాంతంబునుం గావున జనంబులు వినియుం గొనియాడు చుండుదు. విప్ర కుమారునిం దోడ్కొని పుణ్యక్షేత్రంబులకుం జనియె.

శా. శ్రీరాజ .... సురరా....జోమహీ నాథ సం
సారోదీర్ణ మహార్ణ వోగ్ర భయ దత్సంహార భక్తౌఘ మం
దారా వార్ధి గభీర కౌస్తుభ దరా ....రాధ రాకార లం
కారారణ్య విదూర భూమి తన యోత్కంఠా నృకంఠీరవా.

తాటక సంహార బల .... ఝాట మహాటవి విహార చక్ర సమీరా
హాటక గిరిధీర ధను జ్యాటంకారణ విహార శత్రు విదారా.

మాలిని :

సజల జలదగాత్రా చారు రాజీవనేత్రా
సుజన హృదయ వాసా సుగుణరాజన్య వేషా
భుజబల జితదైత్యా పూర్ణ వేదాంత వేద్యా
భజన.... రణ్యా భద్రశైలాగ్రగణ్యా.

గద్య :

ఇతిశ్రీ సహజ పాండిత్య పవిత్ర ధూళిపాళ వెంకటనామాత్య పుత్ర సకల విద్వజ్జన విధేయ శ్రీకృష్ణ నామధేయ ప్రణీతం బయిన చంద్రదేవోపాఖ్యానంబను మహాప్రబంధంబు సంపూర్ణము.

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము :

శ్రీముఖి సం॥ పుష్య బ 8 సోమవారం రోజు వరకు అమ్మ వెంకన్నగారి.... క్రమంగా అమిరేవు అప్పల నర్సింహం వ్రాసెను.

ఈ చంద్రదేవోపాఖ్యానము ధూళిపాళ కృష్ణకవి విరచితము. తన చంద్రదేవోపాఖ్యానమునకు కృతి నాయకు డెవ్వడో యని తలంచుచుండగా కవికి శ్రీరామ చంద్రుడు ప్రత్యక్షమై తనకు దాని నంకితము గావింపు మనెనట. అట్లే కవి దీనిని సీతాపతికే కృతి నొసంగెను. ఇట్లు కావ్యారంభమున కవి తెల్పెను. ఈ కవికి పోతనవలె 'సహజ పాండిత్య'దనుబిరు దుండి నట్లు ఆశ్వాశాంత గద్య వలన తెలియుచున్నది. ఈ కవిది సులభశైలి. ఇది మూడాశ్వాసముల కావ్యము.

ఈ ప్రతియందు మూడు అశ్వాసములు పూర్తిగా నున్నను ఇది అసమగ్ర ప్రతి. పత్రము లధికముగ క్రిమి దష్టమై చాల అక్షరములు దృగ్గోచరములు అగుటలేదు. గ్రంథము మిక్కిలి శిథిలావస్థలో నున్నది. కొన్ని పత్రములు తునుకలైనవి. లిపి స్పష్టమే. కాని ప్రతి విలేఖనమున చాల అక్షరదోషములు గలవు. ప్రతి నలుపుదిరుగుచున్నది.

# చంద్రభాను చరిత్ర

## మల్లన మంత్రి

ఆక్సెషన్ నెం : 2489 కాల్ నెం : బి 3-196

ప్రతి : తాళపత్రము ; అసమగ్రము. పత్రములు : 84.(+5)

ప్రతిపరిమాణము : 43×3.5 సెం. మీ. పత్రపంక్తులు : 6

**ప్రారంభము :**

మ॥ వరజేంద్రోపల కాంతిశర్వరి నిజ స్వర్ణంబు లెల్లం బయో
ధరముల్ ప్రుచ్చిలి మారుత త్వర జనన్ ద త్త్వేయ వారాశిగో
పురముల్.... మహోర్మి నికరంబుల్ సాచివేర్చియన్ గళ
.... రకాదంతమ్ములై .... ....

క॥ నరవర మణి హర్మ్యవిభా కర బంధుర కనకవరణకై తవ జాగ్ర
త్పరిధి యుత మధ్య తలమై పరిఘా పుష్కరము తేటపడు నవ్వీటన్.

ఉ. ఆ పురి నిండు వెన్నెలల నగ్ర విధూపల సంభవాంబు ధా
రా పటలచ్ఛలామరతరంగిణి జేయ పయోధి గూడరా
ప్రాపుగ గచ్చు నిచ్చెనలు వన్నిన కై వడి గోపురావళుల్
కై పువహించు మట్టు బలుకల్ బలె వాకిళు లుల్లసిల్లగన్॥

**ముగింపు :**

సీ. రత్నహర్మ్యముల జంత్రపు బొమ్మ లనుగు జెయ్యి లొనర్పగా బుట్టు నొక్కకినుక
నవ .... రుకేల్ సాచిళు కో త్తి బిల్వగ బుట్టు నొక్కకినుక
కేగిరుల నభ పాలిత భద్రేభ లొరపు జూపగ బుట్టు నొక్కకినుక
దీర్ఘికాంతముల బద్మినులు దుమ్మెద చూపు లొనరింపగా బుట్టు నొక్కకినుక

....కినుకల చిక్కవదని మమతల తలంపు లిడుచును గుముదినీ వి
శాల లోచనతో గూడి చంద్రభాను డనుపమానంద సామ్రాజ్య మనుభవించె॥

శా॥ ఈమాడ్కిన్ కుముదిన్య రాళ .... ....
.... మానందను డొక్కనాడు హరియున్ బ్రహ్మప్పుడున్ మెచ్చవి
ణామౌనిన్ బచరించి తుంబురుని వల్లన్ గన్న గాంధర్వవి
ద్యా మాహాత్మ్యము సూపి తద్వినుతుడై తాల్చెం గృతార్థత్వమున్.

**గద్య :**

ఇది శ్రీ మద్దత్తాత్రేయ యోగీంద్ర చంద్ర చరణారవింద .... సమాసాదిత.... రసోదాత్త దత్త నామాత్య సోదర్య మల్లన మంత్రి వర్య ప్రణీతం బైన చంద్ర భాను చరితంబను మహా ప్రబంధంబునందు సర్వంబును ప్రబంధ పరిపూర్ణ పంచమా శ్వాసము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

చాంద్ర మానేన శార్వరి నామ సంవత్సర కార్తిక శుద్ధ ౧ వర్కు కుమ్మెర కోదండ రాముని కొమరగిరి చిన వెంకట పతి వ్రాసి యిచ్చినది. బొరువెల్లి నరసప్ప గారి ప్రతి ప్రకారం చంద్ర భాను చరిత్ర సంపూర్ణంగా వ్రాసెను.

ఈ ప్రతి యందలి మొదటి 5,6 పత్రములు విరిగిపోవుటయేగాక కొన్ని పత్రములు శిథిలము లగుచున్నవి. లిపి అస్పష్టము ప్రతి విలేఖనమున దోషములు గలవు. ఇది అయిదాశ్వాసముల గ్రంథము.

# చంద్రవర్మ చరిత్ర

## బుక్కపట్టణ నరసింహాచార్యులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషను నెం | : 4572 | కాల్ నెం | : టి 3-139. |
| ప్రతి | : తాళపత్రము : అసమగ్రము. | పత్రములు | : 138 |
| ప్రతి పరిమాణము | : 34.5×3. సెం.మీ. | ప్రత పంక్తులు : | 6 |

ప్రారంభము :

శ్రీ సీతా సరసీరుహాక్షములు కాశ్మీరంబులై జిమ్ముటన్
వాసిం జెంది కరంగ జూచి తమి సవ్యం బైన కేల్సాచి యు

ల్లాసం బేర్పడ చక్క దిద్ది పృథులీలన్ చెక్కుటద్దాల పే
రాసన్ నీడలు గాంచు దాశరథి నెయ్యం బొప్ప మమ్మేలెడిన్॥

ఉ॥ ఏ యవతారమున్ దన ప్రియేశ్వరు డెత్తిన తాను వేల్మిడిన్
పాయక వేడ్క తక్షణమ భవ్యతరంబగు రూపు లెత్తి తా
నే యెడలందు నేమరక యీ విధ మొప్పగ భక్తి తత్పర
ధ్యాయిని యైన పద్మ ప్రమదంబుగ కోర్కె లొసంగు గావుతన్॥

ఉ॥ శ్రీ సతి మోస పుచ్చి హరి శేముషి నుర్వర గూడు వేడ్క స
ద్భాసురలీలతన్ గదియ తాలిమి నాత్మ ఫణాళి సౌధముల్
గా సమకూర్చి సౌఖ్యములు గార్కొన బేర్చు గృతార్థు సంత తో
ల్లాసము మీర నెంతు పృథురంజిత దాంతుని నయ్యనంతునిన్॥

వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన స్కాందపురాణంబున నుమామహేశ్వర సంవాదంబునందు చంద్ర వర్మ చరిత్ర యను పురాణంబునకు కథా క్రమం బెట్టి దనిన

ఉ॥ రాజిత శైలరాజమున రాజసమొప్ప హరుండు కాంతి వి
భ్రాజితమైన హారముల రంజిలుచుం గొలు వున్న వేళ యం
భోజభవుండు నింద్రుడును భూరి బలాఢ్యులు దిక్పతుల్ నుతుల్
తేజము మీర జేసి రల దీప్త సుగాత్రుని వహ్నినేత్రునిన్॥

గీ॥ ఇటుల నుతియించి యింపొంద యిష్ట జనుల
చాల లాలించి సంతోష లీల మెరయ
నంతికంబున వారి జెన్నలర బిలిచి
గూరు చుండగ నియమించె వేరు వేర॥

వ. కూర్చున్న సమయంబున నందీశ్వర భృంగీశ్వర విఘ్నేశ్వరాది ప్రమథ గణంబులును రంభ ఊర్వశి మేనక పుంజికస్థలహరిణాదులైన యప్సరసలును, గరుడ గంధ ర్వాది దేవయోని భేదులగు దేవతలును బలసి సేవించ బహు వినోదంబుల ప్రొద్దు

బుచ్చుచు ప్రసంగ వశంబున మర్త్య లోకంబున గల రాజలోకంబు నప్పటప్పటికి ప్రశంసించుచో చంద్రవర్మ యను రాజవర్యు చరితంబు లుగ్గడించు నెడ।

గీ॥ అట్టి సమయంబునందున. గట్టు పట్టి మట్టు మీరిన సంతోష ముట్టి పడగ
కట్టెదుట నున్న శంభు మోమట్టె చూచి యిట్టి పూర్వంపు చరితంబు లెట్టి వనుచు।

**ముగింపు :**

క. విదితముగ దార బోసెం ............గ్రామం ........
సదయత సుదక్షిణాఖ్యుడు పద పడి తన కూతుపిదప భవ్యత నొసగెన్॥

క. సంగతిగ నపుడు వారల యంగము లుప్పొంగ............
.................... మంగళసూత్రములు చతురిమం గళముల తాన్॥

క. గుడ జీరక దమ శిరముల నిడి శిబికలు మౌళిసీమ నేర్చినటులతా
.... .... .... .... ....బాడు ధవళము లొప్పన్॥

ఉ॥ అత్తరి చంద్ర వర్మయును నా సతి యుగ్మము సమ్మదంబులుం
బొత్తు లొనర్పు చుండ .... .... .... ....
తెత్తి యిరుంగడం సుదతు లెత్తిన పాత్రల ముంచి ముంచి బల్
ముత్తెపు సేస బాలు ప్రియ మొప్పగ బోసిరి .... .... ....

వ. ఒగిజేసి మహిమతో లాజహూమం బొనర్చి
యీ రీతి నాల్గు దినాలు విప్రజనాలకు భోజనాలు
పొసగ బె.... .... .... .... ....

గద్య :

ఇది శ్రీరామ తీర్థ నృసింహ చరణారవిం దేందిందిరాయమాన మానస బుక్కపట్టణ వంశ పయః పారావార రాకా నిశాకర శఠమర్షణ గోత్ర పవిత్ర నిఖిల ప్రబంధార్థ బోధ సమర్థ సంస్కృతాంధ్ర భాషా కవితా నిర్వాహక చాతురీ ధురీణ ఆ చార్ల గోపాలాచార్య తనయ వినయ విధేయ నృసింహాచార్య ప్రణీతంబైన చంద్ర వర్మ చరిత్ర యను ప్రబంధంబు నందు ప్రథమా శ్వాసము.

**విశేషాంశములు :**

గ్రంథము అసమగ్రము. క్రిమిదష్టము. శైథిల్యము కలదు. వ్రాత దోషము లల్పములు. వ్రాత యొకింత చక్కనిదే.

4 ఆశ్వాసముల వరకు గలదు. 4వ ఆశ్వాసము చివరిపత్రములు శిథిలావస్థలోనున్న వి. 4 వ ఆశ్వాసము సంపూర్తిగా లేదు. మొదటి 3 ఆశ్వాసములు సంపూర్ణముగా కలవు. ప్రతి విలేఖన కాలము లేదు. వ్రాయస కాని పేరు లేదు.

ఇతడు శ్రీరామ, నృసింహ భక్తుడు. ఇతని గ్రామము అల్లూరు. ఇతని తల్లిదండ్రులు సీతమాంబ, గోపాలాచార్యులు. గ్రంథాదియందు ప్రబంధ కవులను పూర్వ కవి స్తుతిలో పేర్కొనుటచే నీతడు (ప్రబంధ కవుల) వారి తరువాతి వాడుగా చెప్పవచ్చును. సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న సమేతముగా శ్రీరాముడు కలలో కనిపించి కావ్యము రచించి రామతీర్థ నృహరి కంకిత మీయ వలసినదిగా కోరెనని ప్రథమాశ్వాస అవతారిక యందు పేర్కొనబడి యున్నది.

# చంద్రికాపరిణయము

## సురభి మాధవ రాయలు

| | | | | |
|---|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 5930 | కాల్ నెం. | : | టి 3-596 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : | 113 |
| ప్రతి పరిమాణము : | 37×35 సెం.మీ. | పత్ర పంక్తులు | : | 10 |

**ప్రారంభము :**

శా. .... .... .... .... .... .... .... ....

.... సరసత్వమొంది సుమనఃపాళీ ప్రియాత్మీయ స
ద్భావ స్ఫూర్తి దనర్చు శ్రీమదన గోపాలాహ్వయోజ్జృంభితాం
భోవాహంబు సమస్త లోకంబుల కామోదప్రదం బయ్యెడున్.

సీ. అక్రాంత భువన విఖ్యాత సద్గోత్రుడై కనుపట్టు నే చాన గన్న తండ్రి
యలఘు కళాశాలియై సత్ప్రభుత్వంబు తో మించు నేయింతి తోడబుట్టు
విబుధ సంత్రాణ ప్రవీణుడై నిఖిలైక నుతి గాంచు నే మానవతి ధవుండు
రహి నాత్మ సరస ధర్మగుణ విస్ఫూర్తిన యలరించు నే కొమ్మ యనుగు పట్టి

నరయ సత్యాది కీర్తనీయ స్వవృత్తి నెనయు కల్యాణమూర్తి దా నే వధూటి
యట్టి సిరి రుక్మిణీ రుచిరాభిధాన చిరత రైశ్వర్యములు గృప సేయుగాత.

వ. అర్పితంబుగా నొనర్పం బూనిన చంద్రికా పరిణయం బను మహా ప్రబంధంబునకు కథా
క్రమం బెట్టిదనిన.

ఉ. శ్రీ నిరవొంది నైమిశము జెన్నగు నందు నిజామలాశయా
లాన దృఢావబద్ధ కమలా వరదంతులు శౌనకాది మౌ
నీనులు సూతజుం బలికి రేన్నృపు డేలె ధర న్నిరీతిగా
నా నృపు దెల్పు మన్న నత డాయత కౌతుక పూరితాత్ముడై.

శా. సారాక్షీణ కళాకలాపనిధియై చక్రప్రియంభావుక
శ్రీరమ్యాకృతియై దినేశ కుల లక్ష్మీమూలమై యిద్ధరా
భారం బూనెను చంద్ర సంజ్ఞ నొక భూపాలాగ్ర గణ్యుండు త
చ్చారిత్రంబు రచింతు నంచు బలికెం జంచద్వచో వైఖరిన్

ముగింపు :

చ. తొలుత దృశా విలాసములు తోరపుటానన విభ్రమంబు ల
వ్వల నటమీద నావయవ వైఖరులుం గనుపట్టనా నయం
బలు తెరవా రతిస్మరులు బట్టి నడల్పు క్రమంబునన్ వధూ
తిలకము రాజమౌళికి మదిం ముద మూనిచె నర్తకి గతిన్.

క. కంతుకలాపారగు డగు స్వాంతము నం దిటుల రాగవల్లిక మెరయన్
కాంతుడు కాంతామౌళికి నెంతయు సంతసము నూన్చె హిత నవరతులన్.

సీ. మంజులాహీన హర్మ్య ప్రదేశమ్ముల శుచి గరుత్మల్లీల జూచి కొనుచు
కలధౌతమయ శైలకంధరాస్థలుల మ హానంది హరిలీల లరసి కొనుచు
సుమనో నివాస భాసుర నగాగ్రములందు దివ్యసారంగాభ దెలిసి కొనుచు
పుష్కర వీథుల బొలుపొందు నొక చక్ర రథ .... .... .... ....

విశేషాంశములు :

ఈ చంద్రికా పరిణయ ప్రతి అసమగ్ర ప్రతి. ఈ ప్రతిలో ఐదాశ్వాసములు పూర్తిగాను షష్ఠాశ్వాస మసమగ్రముగాను నున్నది. ప్రతి చివరి పద్యాలను పరిశీలించి చూడగా ఈ కావ్యము షష్ఠాశ్వాస పరిమితమనియే తోచుచున్నది. ప్రతి క్రిమి దష్టము కాకుండ మంచి స్థితియం దున్నది. అటనట మూడు పత్రములు మాత్రము సగానికి విరిగిపోయినవి. వ్రాత చక్కనిది. దోషము లంతగా లేవు.

ఆశ్వాసాంత గద్య ఈ విధముగా నున్నది.

ఇది శ్రీమదన గోపాల ప్రసాద సమాపాది తోభయభాషాకవిత్వ కళా కళత్ర రేచెర్ల గోత్ర పవిత్ర సురభి మల్లక్షమాపాల సత్పుత్ర కవిజన విధేయ మాధవరాయ ప్రణీతంబైన చంద్రికా పరిణయమను మహా ప్రబంధంబునందు పంచమాశ్వాసము.

# చారుచంద్రోదయము

## చెన్నమరాజు

| ఆక్సెషన్ నెం | 3825 | కాల్ నెం | టి. 3-274 |
|---|---|---|---|
| ప్రతి | తాళపత్రము, సమగ్రము. | పత్రములు | 38 |
| ప్రతి పరిమాణము | 40.5×4 సెం.మీ. | పత్రి పంక్తులు | 10 నుండి 11 |

ప్రారంభము :

శ్రీమత్కౌస్తుభ దీప్తి నన్య వనితాశ్లేషాంశ రాగంబుగా
భామా రత్నము రుక్మిణీ రమణిలో భావింప వీక్షించి నీ
పై మద్భావము సానురాగమిదె పై భాటిల్లె నంచున్ నయ
స్థేమన్ వేడ్క యొనర్చు యేలు కుశలున్ శ్రీకృష్ణు సేవించెదన్.

సీ. ఏరామ కుచసీమ శౌరి చక్షు ర్భవ మిహిర చంద్రావృత్తి రహి వహించు
నే యింతి ముఖ కాంతి యాయత హరినాక్షి జలజాతముకుళనాకలన నెఱపు
నేతల్లి తను వల్లి హేమచేల విశాల భుజ మధ్యమ కరాశ్మమున దనర్చు
నే నాతి దృగ్రీతి దానవాహిత మహా శృంగార రసకేళి రంగు మీరు

నట్టి కలశాబ్ధి జాత దయా సమేత నిఖిల నిగమాంత కాంత మణీ వతంస
పాదజలజాత పోషిత భక్తిజాత సిరులు కరుణించి మమ్ము రక్షించుగాత.

* * *

వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన చారు చంద్రోదయంబను మహా ప్రబంధంబునకు
కథాక్రమం బెట్టి దనిన

శా. శ్రీ నింపొందెడు నైమిశాఖ్య వన ధాత్రిన్ శౌనకాది వ్రతీ
శాను ల్సూతుని జూచి శౌరిసుత సంజాతంబులో నేఘనుం
డానందం బొనరించె వేల్పులకు దైత్య ధ్వంసియై తత్ప్రతా
పానూనోదయు దెల్పవే యన నతం డత్యంత సంతుష్టుడై.

గీ. చారు చంద్రుండు శౌరి కుమారులందు బుధ వినుతిగాంచె దైత్యుల పొంక మణచి
శుకుడు నీ యర్థ మభిమన్యు సుతున కాన తిచ్చె నది మీరు వినుడని యిట్టులనియె.

సీ. చంద్ర శాలాశరచ్చంద్ర బింబాననా సంస్థాపితా హారి సముదయంబు
గగనాబ్జ గేహినీ కటి కింకిణీ భవ గాంగేయ వప్రశృంగ వ్రజంబు
వియదవేలా మరుద్విభు చాపచాలన ప్రౌఢ రత్న నిశాంత బంధురంబు
హరిదశ్వ తాంత ప్రియంభావుకోదార గోపుర వర కేతు మారుతంబు

త్రిదశ కల్లోలినీ జారపద కలాప లాప రమణీయ మణి హర్మ్య లాసకార
కీర వాణీ వతంస సంక్రీడ దంఘ్రి నూపురం బౌర ద్వారవతీ పురంబు.

చ. స్థిరతర సత్త్వవాళముల బెంపగు కొమ్మలసందు వెంబడిన్
వరుస పతంగ మండలము వాలి చరింపగ మింట నంటుచున్
పరిఘ మహాలవాలముగ బంధుర కాంచన సాల మాదిరిన్
బరగు నరాతి జాతి మధుపప్రకరాతిభయంకరాకృతిన్.

చ. అగడత నీట దేలియును ప్రాప్తిగరంగెడు బోటి తాల్పు రా
నిగరపు పీటికోట డిగు నీటికి వే యెదురెక్కి వేల్పు చే
పగ మగమీల గూడుదురు బైకొని భోగవతిన్ నిజేశులన్
బెగడక నిద్ర బుచ్చి యట బేడస కోడి మిటారి గుబ్బెతల్.

క. వాసిగల కోట పొడు వా కాసేటయ్యె యెరుంగ నగడత లోతా
భాసుర మలయ సమీరము మేసేటయ్యో యెరుంగ మేదిని లోనన్.

ముగింపు :

గీ. విభుని కెంగేలు చెలి నీవి విడవబోయి చాపలంబున బలుమారు దోపబడియె
పోక ముడి మాత్రమునకింత బొరలనేల కొండలంతేని పనులపైనుండు టరుదె.

క. నీవియు కుచ దుర్గంబులు గావలెగా కలరుబోణి కరపల్లవముల్
లావరి యుండగ గైకొని కేవల మవ్విభు డురోజగిరి దుర్గంబుల్.

క. ఘన జఘన ధవళ వస్త్రము తను దానే వదలి జారె తరుణికి నపు డ
త్యనఘ గుణాశ్రయు లెయ్యెడ జన కుందురె యతను కలహ సంభ్రమవేళన్.

ఉ. గ్రక్కున గౌగిలించి తమకంబున వాతెర తేనెలాని లే
జెక్కిలి ముద్దుబెట్టుకొని చిక్కని చక్కని గుబ్బ లవ్విభుం
.... .... ....
దక్కమలాయతాక్షి మకరాంక సుఖాంబుధి దేల్చె నెంతయున్.

సీ. ఒక కొన్నినాళ్ళకు నొయ్య నొయ్యన చెలి యెలమితో మడుపు లందీయ నేర్చె
నొక కొన్నినాళ్ళకు చెకచెకల్ వెదజల్లు సొలపుజూపుల సారె జాడనేర్చె
నొక కొన్నినాళ్ళకు చికిలి ముద్దుల మొగం బును వాంచి మరుమాట లాడనేర్చె
నొక కొన్నినాళ్ళకు నుదుటు పెన్గుబ్బల గొబ్బున నెద రొమ్ము గుమ్మనేర్చె

సోలి తేనియమోవి పెన్సోనసోవ వాడి మొనబంటి నొక్కులవ్వారిగాగ
నించ నేర్చెను విభుని బొమ్మంచు మోవి బాలికామణి యొక కొంత ప్రౌఢిమించి.

గద్య:–

ఇది శ్రీ తాడిపర్తి గోపాలకృష్ణ కృపా కటాక్ష వీక్షా సమాసాదిత కవితా నూతన భోజ సంస్కృతాంధ్ర భాషా విశేష సార సారస్య పరిజ్ఞాన చాతురీధురీణ మానసాంభోజ చెన్నమ రాజకుమార శేషయామాత్య తనూభవ చెన్నమరాజ ప్రణీతం బైన చారు చంద్రోదయంబను మహా ప్రబంధంబునందు పంచమాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

ఈ కావ్యము తాడిపర్తి గోపాలకృష్ణునకు అంకిత మీయబడెను. ఈ కవి సంస్కృతాంధ్రముల యందు చతురుడనని ఆశ్వాసాంత గద్యయందు తెల్పుకొనెను. శౌరి సుతులలో దైత్యధ్వంసియై వేల్పుల కానందం బొనరించిన ఘనుడగు చారుచంద్రుని చరిత్ర ప్రతాపములు ఈ కావ్యమునందలి ముఖ్యాంశములు.

ఈ ప్రతియందు 5 ఆశ్వాసములును పూర్తిగా గలవు. పాతబడి కొద్దిగా నలుపు దిరిగినది. లిపి సుస్పష్టము గాదు. ప్రతి విలేఖరి కొన్ని పాదములను వ్రాయక ఖాళీలు వదలివేసెను.

# చిల్వసిడెంబుఆేని చరితము

## మరింగంటి వేంకటనరసింహకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4644 | కాల్ నెం | : టి 3-197 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము | పత్రములు | : |
| ప్రతి పరిమాణము | : 42×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 8 |

ప్రారంభము :–

గీ. .... ను నిచ్చలుబత్తి ... దే పక్కిజక్కెక్కుచో పాద భజన యదను
.... పుల చెలగుచుండు ఆళువారుల నె .... రకు॥

క. డెబ్బది .... నెల .... నిబ్బరముగ నిలిచి దయను నెగడెడి గుబులన్
నబ్బుర .... ందుచు నె .... లో గొబ్బున డెందమున .... బతిన్ ॥

వ॥ యిట్లా తెఱనోటి మెకంబు వోని .... మైగల సామికి
జం .... యగా .... వ్యం బూనిన చిలువ పడిగె జేని
చరితంబు .... రంగగు నచ్చతెనుఁగు
కబ్బంబు కత జరుగు సరవి యెయ్యాదంటేని ।

క॥ కరువలి తిండుల జన్నము నరలేకను సేయుచుండు న త్తఱియందున్
నరు మనుమని కొమఱుని కన నఱిజటి ఐత్తుండు వచ్చె నరు లఱుదందన్॥

ఉ॥ ఆ జడదాఱి రా కరసి ఆచక రా నెరసర్ల తోడుతన్
తే జెసగంగనున్ నెదురి తెచ్చటు కాళ్లకు సాగి ఐత్తితో
పూజ బిరాన జేసతని పుత్తడి గద్దియ నుంచి మొక్కిఁడన్
నోజను నాత డిట్లనియె నుబ్బెద గుబ్బటిలంగ మెల్లగన్॥

చలువల రేని వంగటపు సంతున బుట్టినవాడ వౌచు నీ
చిలువల జంపు జన్న మిటుచేసిన నిన్నను జేడు వచ్చునా
వల దుడు గుండు మింక వలరాయని యన్నయు మున్ను మోములం
గిలిపిన వాతులం జనక గిఱ్ఱున మళ్ళనె జీవి బొందికిన్॥

ముగింపు :

మరియును

గీ॥ .... య్య గోఱి యిల్లాంధ్ర కడగొట్టు బోటి పెబుత తగును బోటిక నుచు
జాచ జాఱు లెదల అంజిల్ల పాములు పెట్టిరపుడు పెబుత బెంపెసగంగ॥

వ॥ ఇట్లు పెట్టిన జోస్యులకు ప్రేముడి విడెమ్ము దచ్చనలతో నిచ్చిన నచటి నెల జేజ లెద నలఱి తమ తమ యునికి పట్లకుం జను తఱి నా చిలువ పడిగె జేడు వేల్పుదొఱ బోగంబు కెనయైన బాగెంబులను బోగింపుచుండె నని చదువు పులుగుకుంబుట్టిన తబిసి తండ్రి ఐత్తుఁడు జేజేల దొఱకొడుకు మనుమనితో పాప పడిగెజేని చెఱితంబు చక్కఁగ న్నుడివి యిట్లనియె.

మ. పుడమీ కబ్బము వ్రాసినన్ చదివినం బొల్పొప్ప గావింపుచుం
దొడవున్ సంపద బందువు ల్సకియలుం దోబుట్టువు ల్ఖ్యాతులుం
గొడుకు ల్మన్మలు పాడిపంట యశముం గోరైన భాగ్యంబునున్
నుడువున్ వారికి నబ్బునంచు నుడివెన్ నుబ్బున్నె దన్ నొందగా ॥

మఱియును

**విశేషాంశములు :**

ఇది చిలువ సిడెంబుతేని చరితము అను అచ్చతెనుగు కావ్యము. ఇది మరింగంటి వెంకట నరసింహకవి ప్రణీతము. కలలో స్వామి కన్పడి కోరగా కవి దీనిని రచించి యతని కే యంకితమిచ్చెను. ఇందు చిలువపడిగెతేని వివాహ వృత్తాంత మితివృత్తము. ఇది మూడు ఆశ్వాసముల గ్రంథము. ఈ ప్రతియందు మూడు ఆశ్వాసములు పూర్తిగా నున్నను, ఇది అసమగ్ర ప్రతి. ప్రథమ పత్రము చివరి పత్రము శిథిలమై యున్నది కనుక కొంత విషయము నష్టమైనది.

ఈ ప్రతి అధికముగ క్రిమిదష్టమై, కొన్ని పత్రములు శిథిలావస్థలో నున్నవి. లిపి సుస్పష్టముగా లేదు.

ఇందు ఆశ్వాసాంతమున మత్తేభ గద్య లున్నవి. అందు పద్య గద్య సంఖ్య సూచింపబడినది. తృతీయాశ్వాసము చివరి గద్యగల పత్రము శిథిలావస్థలో నున్నది. ఈ ప్రతి ఖరనామ సం॥న వ్రాయబడినది. ప్రతి విలేఖనమున స్వల్పదోషము లున్నవి. ఇది నాగకేతనుడైన దుర్యోధనుని వివాహ వృత్తాంతకథ. ఈ కావ్యమునకు "చిలువ తేని పేరణ" మను నామాంతరము కలదు.

# జగదేకప్రతాపచరిత్ర

## రొబ్బి వీరభద్రయ్య

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం : | 87 | కాల్ నెం | : బి 3-18 |
| ప్రతి : | కాగితము; సమగ్రము. | పత్రములు | : 113 |
| ప్రతిపరిమాణము: | 33×21 సెం.మీ. | పత్రపంక్తులు | : 18 |

**ప్రారంభము :**

శ్రీ గిరిజా మనః కుముద శీతకరున్ కరనీరజాంచితా
భోగ సుపర్వ పర్వత విభూజ్వలచాపధరున్ పరాత్పరున్
రాగవిదూరు జామి పురరాడ్విహరున్ త్రిపురాంతకేశ్వరున్
బాగుగ నామదిన్ దలచి ప్రార్థనజేసెద నిష్టసిద్ధికిన్॥

ఉ॥ ఎవ్వడు విఘ్నకర్త మరియెవ్వ డవిఘ్నకరుండు లోకమం
దెవ్వడు ఎల్లవేల్పులను నెన్నడిచే తొలిమ్రొక్కుగొన్నవా
డెవ్వడు రూపమయ్యెను నహీన లసత్ప్రణవంబు ద్వయుం
డెవ్వడు నవ్వినాయకు దభీష్ట ఫలప్రదుడౌచు బ్రోవుతన్॥

శా॥ క్రౌంచారాతి మయూర వాహనముతో గౌరీశు సేవింప నా
పంచాస్యాభరణాహి జాత ముభయ భ్రాంతిన్ దలల్ వంప వ్యా
పింపెన్ తత్ఫణదీప్తి శారద మహావిర్భూత శుభ్రాభ్ర మో
యంచున్ కేకి నటింప వెక్కసము జెం దార్యాపతిన్ గొల్చెదన్॥

వ. ఇట్లు ఇష్టదేవతా ప్రార్థనంబును, సుకవి బుధ స్తోత్రంబును। కుకవి జన విరసనంబును నొనర్చి। శ్రీజామిపురీ త్రిపురాంత కేశ్వరున కంకితంబుగా నానేర్చుకొలది రచింపం బూనిన జగదేక ప్రతాపు చరిత్రంబను కావ్యంబునకు కథాక్రమం బెట్టి దనిన.

గీ. రమ్యమై నట్టి నైమిశారణ్యమంద శౌనకాది మహాముని సంఘ మపుడు
రామహర్షణి గనుగొని ప్రేమ మీర మృదు మధుర వచో రచనల ముదమొనర్చి॥

ప్రణ్యా కథ యెద్ది మరియు నపూర్వమెద్ది యట్టి సత్కథ వినగల మాదరించి
శ్రవణ పుట రంజనముగాను చెప్పవయ్యా సత్యగుణపూత మృదు వచోజాల సూత॥

వ ఆనిన సూతుండు ప్రహృష్టాంతరంగుండై తన గురుండగు వ్యాసభట్టారకు మనంబున నిడుకొని వారల కిట్లని చెప్ప దొణంగె॥

క. వినరయ్యా యొక్క సత్కథ వినుపించెద మీరలకును వీనులవిందౌ
ననుచును కోర్కెం దెలుపగ వినుపింప దొణంగె వాక్య విస్ఫుర ఫణితిన్॥

సీ॥ ఒకవంక నకలంక మకరాంకుని కడంక గుందజేసెడి రాజనందనులును
ఒకచెంత హంసతూలిక తల్పముల ఛర్మ డోలికలను నాడుబాలికలును
నొకతావు పికకేకి శుకశారికా కర్ణ రవ పూర్ణ మారామ రాజితంబు
నొకచోట పటుచటులోగ్ర ఘటావ్యాఘ్ర భీకరార్భటుల నొప్పెడి వనములు

రత్న గోపురాట్టాలక రాజితంబు ఛర్మ సౌరభ్య కాసార భాసురంబు
కలిగి సురపురి కెనయగు గరిమ దనరి ఉదయ గిరియను పురవరం బుర్వియందు॥

ఉ॥ ఆపురినుండు విప్రులు నహఃపతితేజులు సర్వశాస్త్ర వి
ద్యాపరతంత్ర వేద్యులు సుధామధురద్యుజనాథ వర్ధిత
శ్రీపతి పాణి పాదసరసీరుహసేవన సుప్రసిద్ధులున్
దీపిత గీష్పతి ప్రతిభ ధీ బలశాంతి జవైక వర్ధనుల్॥

క. మది హీనత విధి ప్రణవము కుదురుగ బలుకంగలేక కొమరు నెదుట నె
ల్లిద మయ్యె క్రమముగా మే మది నుడి వెదమనుచు ద్విజులు నజుని హసింతుర్.

క. క్షత్రియులు సత్యవాక్యప విత్రులు శత్రులతికా లవిత్రులు బుధస
న్మిత్రులు రాజిత గాత్రులు పాత్రా పాత్ర ప్రదాన బంధుర కీర్తుల్॥

ముగింపు :

క. తన తండ్రిని సోదరులన్ వినయంబున దోడి తెచ్చి వేడుక మీరన్
మునుపటివలె పురమేలుట జనపతి నొనరించె నతుల సౌఖ్యము దనరన్.

వ. ఇట్లు తన తండ్రి జగత్పతి యెప్పటి యెట్ల సకల జనానురాగమున రాజ్యపరిపాలనంబు సేయుచు పత్నీసహితంబు కుమార వర్గంబుతోఁగూడ నిష్టోపభోగంబు లనుభవించి యనేక వత్సరంబులు చన జగదేకవీరుననుమతిని తన అగ్రపుత్రు వీరకేసరిని రాజ్యంబున కభిషిక్తుంగావించి యజ్ఞాది కృత్యంబు లొనర్చి భూసురులకు మనోభీష్టంబగునట్టి ధనంబొసంగి గోదానాద్యనేక దానంబులు విధ్యుక్తంబుగ నాచరించి యనేక అగ్రహారంబులు భూసురులకు నొసంగి దీనానేక జనంబుల ధనంబులం దనిపి వారల యనుమతిని పత్నీసహితుండై తపంబొనర్ప వనంబునకుం జనియె

సంపూజ్యంబగు రాజ్యంబు వీరకేసరి తొల్లింటి రాజులవలె ధర్మాచరణంబు దప్పకుండ సర్వజనాను రాగంబున పాలింపుచుండె। జగదేకవీరుండును తనపురంబున కేతెంచి రాజ్య పరిపాలనంబు సేయుచు భార్యలతో స్వేచ్ఛా గతిని వర్తింపు చుండె॥

క. ఈకథ వినినను వ్రాసిన చేకొని పఠియించెనేని శివుని కరుణచే
చేకురు కామ్యార్థంబులు ప్రాకటముగ మోక్ష పదము ప్రాపించు తుదిన్॥

మాలిని। రజిత గిరి విహారా రమ్య హేమాద్రిధీరా
కుజన దనుజహారా ఘోర సంగ్రామధీరా
వృజిన గణవిదూరా వేద వేదాంతసారా
భుజగ విపులహారా పుణ్య సంచారధీరా॥

క. జీవన జాలక హారా జీవన జాసన సుసేవ్య జీవన జల సు
స్థావర సతీశ నేత్ర సం జీవనజార్చిత పదాబ్జ శ్రిత సుర భూజా॥

క. జలధులు కులశైలంబులు కలువల చెలికాడు నుష్ణకరుడును ధరపై
విలసిల్లు నంత కాలము వెలయును నిక్కథయు విశ్వవిభు సత్కరుణన్॥

గద్య :

ఇది శ్రీమత్సకల జనానుగ్రహ పాత్ర దాసుమయ గోత్ర పవిత్ర రొబ్బి సాహెబువర్య పౌత్ర రామలింగార్య పుత్ర వీరభద్రయ ప్రణీతంబైన జగదేక ప్రతాపచరిత్రంబునందు సర్వంబు ద్వితీయాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

భూమిక॥ రొబ్బి చిన్నయ్యగారి వద్దనుండి ఎరువుతెచ్చిన పుస్తకమును చూచివ్రాయడ మైనది 20.11.24 బంకుపల్లె నరసింహం వ్రాలు.

భూమిక—రొబ్బి చిన్నయ్యగారి వ్రాత ప్రతిని చూచి కంపేరిచేయడమైనది. 3.12.24—బంకుపల్లె నరసింహం వ్రాత, చాగంటి వీరభద్రం వ్రాలు.

కాగితపుప్రతి. సమగ్రము. వ్రాతస్పష్టత అలతిగాకలదు. వ్రాతదోషము లధికముగా కలవు. వ్యాకరణ ఛందోదోషములు కలవు. ఇందు రెండాశ్వాసములు కలవు. కవి గ్రంథాదిని సుమారు ఎనిమిది పద్యములలో తన వంశావతారంబు వర్ణించుకొనెను. ఈ వర్ణన సంపూర్తిగాలేక తాతలవరకు మాత్రమే కలదు. మిగిలిన వంశక్రమము అనగా తన తండ్రిపేరు - తనపేరు ఆశ్వాసాంత గద్యయందు పేర్కొనెను.

సాహెబు
|
చిన్నయ — లత్సయ (భార్య) భ్రమరాంబ — రామలింగం

| మల్లికార్జున
| చిన్నయ (వీరమాంబ)
| వీరభద్ర
| అయ్యప

మల్లికార్జున → చినవీరభద్రయ, సాహెబు, లత్సయ
సాహెబు → రామలింగం → వీరభద్రుడు (గ్రంథకర్త)
చిన్నయ (వీరమాంబ) → సోమన
అయ్యప → త్రిపురాంతకరామలింగం, త్రిపురాంతకుడు

ఈ గ్రంథము శివున కంకితము చేయబడినది. గ్రంథకర్త నామము-అతని పూర్వుల నామములను చూచినచో గ్రంథకర్తతోబాటు—అతని పూర్వులుకూడ శైవులేయని గోచరమగు చున్నది. కేవల నామ సాదృశ్యమును బట్టియే కాక గ్రంథాది ప్రార్థనా పద్యములలో శంకరుని స్తుతియుండుటకూడ గమనార్హము.

# జైమిని భారతము

## పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సేషన్ నెం. | : 2799 | | కాల్ నెం. | : | టి 3-31 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | | పత్రములు | : | 123 |
| ప్రతి పరిమాణము | : 37×2.5 సెం. మీ. | | పత్రపంక్తులు | : | 6 |

ప్రారంభము :

శా॥ శ్రీ లావణ్య పయోనిధి త్రివళి వీచీ మధ్య రోమావళీ
వ్యాళానల్ప సుఖైక తల్పుడు జగద్వ్యాపార లీలావతా
రాలంకార విహారి శౌరి సదయుండై సాశ్వగుండక్షమా
పాలాగ్రేసరు నారసింహుని నదభ్ర శ్రీయుతుం జేయుతన్ ॥

చ। జడముడి జాహ్నవీ తటి నిశాకర పోతము జూచి యెవ్వరీ
కొడిమలు గట్టి పెళ్ళికొడుకున్ ఘడియారము మోవ జేసి రం
చడుగ వివాహవేదిపయి నంబిక నెచ్చెలి జూచి నవ్వన
మృడుడు నృసింహ శౌరికి సమిజ్జయముల్ గృపజేయు గావుతన్।

మ. పలుకుం దొయ్యలితోడి కూటములు పెంపం దమ్మి కూటంబులో
నలుమోముల్ సమకాల సౌఖ్యముల జెందన్ ప్రేమ నొయ్యారపుం
బొలయల్కల్ ముఖ మండలిం బొలుచు నంభోజాసనుం డిచ్చు భూ
తలనాథాగ్రణి నారసింహునకు నిత్యంబైన దీర్ఘాయువుల్।

వ. అని దేవతా ప్రార్థనంబును నాదిమకవి గతమునుం గావించి నిలిచి పెల్లగునుల్లంబునందు
నే నొక్క పురాణము చెప్పంగా నుద్యోగించి సుకవిజన హృద్యంబును, నాద్యంబును
ఇతిహాసానేక ద్యోతిపతద్యా వైశద్యంబై నదయునుంగా విచారించి మదిన్—

క। స్తుత్యము కలికల్మష రా హిత్యము నాఖ్యాదికా విహితబీజ చతుః
శైత్యము శ్రీహరి కథలను నిత్యంబును నైన జైమినీ భారతమున్.

శా॥ జంబూ ద్వీపములోన నెంతయు ప్రశ స్తంబైన దీనిన్నట
ప్రదుంబూ కుండల జూట కోటర కుటీ ధూస్వర్ధునీ వీచికా
లంబిస్విన్నన వేందు కందళ సుధాలంకార వాగ్వైఖరిన్
చంబూ కావ్యము జేసెదన్ బుధనుత శ్లాఘానిరాఘాటతన్।

క. సాళువ నరసింహమహీ పాలుని నత్యంత ఘన కృపాలుని ని సుహృ
త్పాలిత నగరీ పళ్య త్పాలుని నా చేయు కృతికి పతిగావింతున్.

వ. అని ప్రబంధంబు చెప్ప నుద్యోగించు సమయంబున

వ. అభ్యుదయం బాకల్పంబుగా నా కల్పింపంబూనిన జైమిని భారతంబునకుం గథావ తారిక యెట్టి దనిన నట్లు జనమేజయ మహీచక్రుఁడు శక్రుయాగంబు నిర్వక్రతం గావించిన యనంతరంబ సుఖాసీనుండై జైమినింగనుంగొని మహాత్మా సకల కలి కలుష లతికా లవిత్రంబైన కురుక్షేత్రంబునం దజాతశత్రుం డగు ధర్మపుత్రుండు ధార్తరాష్ట్రి బలంబు నష్టాదశవాసరంబుల ధూళిదూసరంబులు గావించి శాశ్వ తైశ్వర్య ధుర్యుండై విశ్వ జగన్నుతంబుగా నశ్వమేధం బెవ్విధంబున నాచరించె నెరింగింపు మనుటయు నమ్మునివల్లభుండు జనవల్లభున కిట్లనియె.

గీ. ధారుణీతలనాథ మీతాతయైన ధర్మసూనుని యశ్వమేధంబు వినుము
తన పితామహుడైన శంతన తనూజు డమర పురికేగ శోకాకులార్తు డగుచు.

క. ఉన్నంత నానృపాలుని సన్నిధి కేతెంచె వ్యాససంయమి తత వి
ద్వన్నుత బహుపుణ్య కథా సన్న పురాణేతిహాసశాలి యదృచ్ఛన్।

క. వచ్చిన మౌని నెదుర్కొని తెచ్చి యుచిత పీఠి నునిచి దీర్ఘతరంబై
హెచ్చిన శోకము మదిలో నచ్చర లాడంగ ననియె నమ్ముని తోడన్ ॥

ముగింపు :

క. సౌరదిన నాచారంబులు బురవగుచుం ప్రథమపాదము ....
.... ను వడ్లును గలిపిన కరణిన్ వర్ణాశ్రమములు క త్తర గరయన్ ।

క. ఆ సమయంబున ధర్మజు నీ సోమ కులంబునం జనించి కుటిలులన్
శాసించియు ధరణీ పా .... వ నృసింహబడ నగుచున్।

చ. అని వినుపించి శౌరి శమనాత్మజు దర్మిలి నిచ్చు పూజ గై
కొని సకుటుంబుడై నృపతి కోటి భజింపగ ద్వారకాపురం
బునక .... .... .... పథంబుల నిల్పె రాజులన్
జననుతు డా యుధిష్ఠరుడు సర్వధరిత్రియు నేలె నున్నతిన్।

మ. అను వారంబును ధర్మ పుత్రు హయమేధారంభమున్ యౌ ....
.... .... హీశ వర్తనములన్ సద్భక్తి పాటించి వి
న్నను రామాయణ భారత శ్రవణ కన్యాగో సహస్రక్షమా
ధన దానాధిక పుణ్యముల్ దొరకు మర్త్యశ్రేణి కశ్రాంత ....

క. .... ... వ త్తకు చామీకర హయము ధవళచామరములు నా
నామణి విభూషణంబులు గ్రామము గృపసేయవలయు గ్రంథసమాప్తిన్।

క. అని జైమిని వినిపించిన జనమేజయ జన వి ...
.... ని వరుని గారవింపుచు వినియెం దరువాత కథలు వేడుక ననుచున్।

సీ॥ నీకును మల్లమాంబా కుమారునకుసో మ కులాంబు నిధి పూర్ణిమా విధునకు
భరత కీర్తికి దు .... .... ... బాలిత స్థాన సౌధునకును
పరరాయ భీకర ధరణి వరాహున కాత్రేయ గోత్ర పవిత్రునకును
గుండయ నరసింహ మండలేశ్వరునకు నభ్యుదయ పరంపరాభి .... ....

గీ॥ .... .... తీర్థ గురు కృపాస మిద్ధ సారస్వతల సత్కవీంద్ర సఖుడు
కుకవి మల్ల శిరష్టోల్ల కుశల హస్త పల్లవుడు చెప్పె పినవీరభద్ర సుకవి.

శా॥ గౌశీ మానస .... .... .... .... చోశీ కవో
లాలంకార శశీ కరార్పిత విలాసాకల్పలాటీ కళా

కేళీ కౌతుక మాళవీ మధుర సంగీతాదర స్వాంతనే

పాళీ కుంకుమ పంకలిప్త కుచ కుంభస్త ....

గద్య :

ఇది శ్రీ భారతీ తీర్థ శ్రీ చరణ కరుణా పాత్ర గాదయా మాత్య పుత్ర వినయ విద్యా సముద్ర పినవీరభద్ర ప్రణీతంబైన జైమినీ భారతంబునం దశ్వమేధపర్వంబు నందు సప్తమాశ్వాసము.

విశేషాంశములు :

ఇందు గ్రంథ పాతములు కలవు. 8 ఆశ్వాసములు గలవు. 8 వ ఆశ్వాసమున ఆఖరి పత్రము లోపించినది. వ్రాత బాగుగా నున్నది.

కృతిపతి సాళువ నరసింగ మహీపాలుడు. ఆ రాజ పరమేశ్వరు డొక్కనాడు అర్థాసన సమాసన్న రాజన్య శిరః ప్రసవ వాసనా ముద్రింతంబైన భద్రాసనంబునం బేరోలగంబున నుండి పురాణేతిహాస కథా ప్రసంగంబుల వినోదించు సప్తసంతానములలో కవిత్వ సంతతికి సాటియగు సంతానము లేదని తలంచి భారత రామాయణ కథల పెక్కింటిని వింటిని గాని జైమిని భారతమును తెనుంగున చెప్పగల కవి యెవ్వడని సభాసదుల నుద్దేశించి పల్కను.

ఆ రాజ సత్తము చిత్తం బెరిగి వారిట్లు విన్నవించిరి. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు కబ్బములు సెప్పగ నేర్చు. వారి యింటి యందు శారదా పీఠము కలదని విన్నవింపగా సమీపంబున గొలిచియున్న వీరభద్రుని కృపాతరంగితాపాంగంబున విలోకించి మామక మనోరథం బెరింగినట్లు హృద్యానవద్య గద్య పద్యానుబంధంబుగా ప్రబంధం బాంధ్ర భాషను జైమిని భారతంబునం దశ్వమేధ పర్వంబు నిర్విఘ్నంబుగా రచియింపుమని ఆనతిచ్చెను. ఈ యాజ్ఞను మహా ప్రసాదంబుగా స్వీకరించి ఆతనిని కృతి భర్తగా జేసి పిల్లల మఱ్ఱి పిన వీరభద్రకవి జైమిని భారతంబును తెనిగించెను.

# జ్ఞానవాసిష్ఠ రామాయణము

## మడికి సింగన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 5384 | కాల్ నెం. | : టి. 3-350 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 102 |
| ప్రతి పరిమాణము | : 44 X 4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 నుండి 8 |

ప్రారంభము :

శా. శ్రీమద్దివ్య ... .... .... మనోనాయకమ్
వాల్మీక్యుద్భవ వాక్పయోధి శశి సంస్మేరాననం చిన్మయమ్
నిత్యం నీరదనీలకాయ మమలం నిర్మాణ సంధాయినమ్
శాంతం నిత్యమనామయంశి ... శ్రీరామచంద్రం భజే॥

శ్లో॥ అహోబల గిరీశాయ నిత్యాయ నిగమాత్మనే
శ్రీశాయ శాంత రూపాయ నృసింహ వపుషే నమః॥

ఉ. శ్రీకర లీల ప్రాణుల సృజింపదలంచి విరించి తానయై
చేకొని దాని బ్రోచునెడ శ్రీవిభుడై యవి సంహరింప భీ
మాకృత దాల్చి మువ్వురకు నవ్వల నొక్కటియై వెలుంగు సు
శ్లోకు బురాణ పుణ్య పురుషుం బరమాత్ముని భక్తి గొల్చెదన్.

వ. నిత్యపరంపర మంగళాభివృద్ధిగా నా విన్నపంబు చేయం బూనిన కథా ప్రారంభం బె .... .... నిర్యాణంబు నన నారు ప్రకరణంబులై యొప్పు నందు బాలలీలోత్సు కుండగు రామ చంద్రుండు ప్రసంగ రూపంబున నుపన్యసించిన వైరాగ్య ప్రకరణంబు తొలుతయ .... చెదా.

క. .... .... .... తశీలుడు బోధ నిధి భరద్వాజుడు వి
శ్రుతకీర్తి యొక్కనాడే కతమున వాల్మీకమౌని గని సంప్రీతిన్.

ముగింపు :

అన విని యవనత వదనుండై యనేక విధంబులం బ్రశంసించి రామచంద్రుని వీడ్కొని వసిష్ఠమహాముని నిజాశ్రమంబునకుం జనియె. నక్కుమార చూడామణియు సర్వజ్ఞ ముండును, శాంతుండును, జీవన్ముక్తుండునునై రాజ్య సుఖంబుల ననుభవింపుచు నిజేచ్ఛ విహరింపుచునుండె. నీవు నీయర్థంబు చిత్తంబున నిలుపుకొని సుఖివి గమ్మని యుపదే శించిన విని భరద్వాజుండు వాల్మీకి మునీంద్రునకుం బ్రణమిల్లి వీడ్కొని, పరమజ్ఞాన సంపన్నుండును, జీవన్ముక్తుండునునై నిజేచ్ఛ విహరింపు చుండెనని వాసిష్ఠ రామాయ ణంబు పదార్థ ప్రమేయంబులు సరణి దప్పక తెనుంగు బాసను గద్యపద్యంబుల రచి యించితి నవధరింపుము.

మాలిని. సుకవినుత కలాపా శుద్ధ బుద్ధ స్వరూపా
వికసిత జలజాక్షా విశ్వరక్షైక దక్షా
సకల రిపునిరస్తా శంఖ చక్రాబ్జ హస్తా
ప్రకటిత శుభగాత్రా పద్మ సద్మాక ళత్రా ॥

గద్య :

ఇది శ్రీనృసింహవర ప్రసాద లబ్ధ కవితా విలాస భారద్వాజ గోత్ర పవిత్ర సరసగుణ ధుర్య సింగనార్య ప్రణీతంబైన జ్ఞానవాశిష్ఠరామాయణంబునందు నిర్వాణ ప్రకరణం బన్నిది పంచమా శ్వాసము.

విశేషాంశములు :

ఇది మడికి సింగనార్య విరచితమగు జ్ఞాన వాసిష్ఠరామాయణపు ప్రతి. దీనిని గోపరాజు పెద వెంకటాద్రి వ్రాసికొనెను. ఇందు పూర్తి గ్రంథమున్నను, కొంత భాగము శిథిలమై, ఒక పత్రము సగము విరిగి పోయినది. ఈ ప్రతి నలుపు దిరిగి గ్రంథము చదువుట కష్ట సాధ్యముగానున్నది. లిపి అస్పష్టము. లేఖన దోషములు గలవు. ఇందు అయిదు ఆశ్వాసము లున్నవి.

# జ్ఞానవాసిష్ఠ రామాయణము

## మడికి సింగన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4623 | కాల్ నెం | : టి 3-351 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 184 |
| ప్రతి పరిమాణము | : 42×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 నుండి 7 |

**విశేషాంశములు :**

ప్రతి విలేఖనము

.... ప్రమోదనామ సం. శ్రావణ బ 13 యిందువారం వరకు .... .... .... శేషయ్య ఆత్మార్థం కొరకు వ్రాసుకొనెను.

ఇది అయిదాశ్వాసముల గ్రంథము. ఇందు వైరాగ్య, ముముక్షు, ఉత్పత్తి, స్థితి, ఉపశమన, నిర్వాణ ప్రకరణములను నారు ప్రకరణములు గలవు. గ్రంథాదిని రామాయణేతివృత్తము గలది గనుకను, వసిష్ఠ వాగ్విలాస భాసురమగుట చేతను దీని కీ పేరు పెట్టబడినట్లు చెప్పబడినది.

ఈ ప్రతి యందు మొదటి 9, 10 పత్రములు రెండు వైపుల శిథిలములై మధ్యభాగము మాత్రము మిగిలినది. గ్రంథాంతము సరిగా లేదు. ఉన్న పత్రములు కూడ అధికముగ క్రిమిద్రష్టమై విషయము నష్టమైనది. కొన్ని పత్రములు పూర్తిగా నిరుపయోగములై యున్నవి.

ఇందలి లిపి స్పష్టము. ప్రతి నలుపు దిరిగి శిథిలావస్థలో నున్నది.

ఇది సంస్కృత జ్ఞాన వాసిష్ఠ రామాయణమునకు సంగ్రహమైన తెలుగు అనువాదము. దీనిని కవి యహోబిల నరసింహస్వామి కంకిత మిచ్చెను. కవి వేదాంతము నందు సులలిత శైలిలో వివరించెను.

# జ్ఞానవాసిష్ఠ రామాయణము

## మడికి సింగన

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం. | : 502 | కాల్ నెం. | : టి. 3-582 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 90 |
| ప్రతి పరిమాణము | : 42×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

**విశేషాంశములు :**

గ్రంథము మిక్కిలి శిథిలమై యున్నది. పెక్కు పత్రములు లోపించినవి. కొన్ని పత్రములు శిథిలముగాను ఉన్నవి. గ్రంథముయొక్క ఆద్యంతములు లేకపోవుటచే కృతి పద్యాది నిర్ణయములు చేయుటకు వీలులేకున్నది.

# జ్ఞానవాసిష్ఠ రామాయణము

## మడికి సింగన

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 1799 | కాల్ నెం | : టి 3-593 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 15 |
| ప్రతిపరిమాణము | : 50 × 5.2 సెం.మీ | పత్రపంక్తులు | : 20 నుండి 25 |

**విశేషాంశములు :**

ఈ ప్రతి క్రోధినామ సంవత్సర మార్గశిరబహుళ ద్వాదశినాడు వ్రాయబడినది. ప్రతి చాల వరకు క్రిమిదష్టమైనది. కొన్ని పత్రములు విరిగినవి. అందుచే పంచమాశ్వాస పర్యంత మున్నను అసమగ్రమే. సంస్కృత జ్ఞానవాసిష్ఠమున కిది సంగ్రహానువాదము. లిపి చాల సూక్ష్మము. చదువుట కష్టము. లేఖన దోషములు కలవు.

# తారకబ్రహ్మరాజీయము

## చింతలపూడి రాధామాధవ కవి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 5568 | కాల్ నెం | : టి 3-24 |
| ప్రతి | : కాగితము; అసమగ్రము. | పత్రములు | : 107 |
| ప్రతి పరిమాణము | : 31×2.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 24 |

ప్రారంభము :

శా. శ్రీరాజీవ దళాక్షు కౌస్తుభమణి సింహాసనం బెక్కి య
ర్కారూఢ స్ఫుట దీప్తియున్ బలెన సొంపారన్ నభోమండలా
కార శ్రీ విలసిల్లు విష్ణుడు జగత్కల్యాణచారిత్రు గం
భీరున్ నంజయ తిమ్మమంత్రి వరలక్ష్మీయుక్తునిన్ చేయుతన్ ॥

ఉ. శ్రీత్రిదశద్రు మూలమున జెన్నెసలార బసింది గద్దెయున్
ధాత్రిజ నంకపాళి నిడి తమ్ములలో భరతుండు మౌక్తిక
చ్ఛత్రముదాల్చి చామర చామరముల్ ధరియించి భక్తి సౌ
మిత్రులు గొల్వనుండు జనమిత్రుని శ్రీరఘురాము గొల్చెదన్ ॥

చ. అభినవ పద్మహాటక మయామృత పూర్ణ గదాగ్ర హ....
యభయవర ప్రదాన సుముఖాయత దోర్లతయై కృపాళువై
అభిమత పద్మలాభము చిరాయువు నిర్భయమున్ వరంబులున్
శుభముఖి లక్ష్మి యిచ్చు గుణశుద్ధికి నంజయతిమ్మమంత్రికిన్॥

* * *

వ. సహస్ర సంఖ్యా నమస్కార పూర్వకంబుగా నా సమర్పించిన తారక బ్రహ్మరాజంబను
మహాప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన

ఉ. శ్రీయుత మాధవాన్వితము సిద్ధమునైన ప్రయాగ మొప్పు గం
గాయమునా సరస్వతులు గాలగళాచ్యుత ధాతృమూర్తు ల

త్యాయుత పుణ్యవాహినుల యట్లు జగత్తు బవిత్రమౌటకున్
బాయక కూడియున్న క్రియ పర్వమునన్ ప్రవహింపు చుండగన్ ॥

సీ. బ్రహ్మ యజ్ఞము చేసి ప్రథమ కాలబున అతి పవిత్రక్షేత్ర మనుచు నుండు
వైకుంఠమున కంటె వసతి మంచిదియని మాధవుం డచ్చోట.... నికిజేసి
అఖిలైక సంసేవ్యమగు త్రివేణీ సంగ మముగ మహీ మండలమున దనరి
కమనీయ ధర్మార్థ కామమోక్షదము ప్ర యాగంబయిచ్చోట నాగమంబు

భూమిగల యుత్తమక్షేత్రములకునెల్ల నుత్తమక్షేత్రమై తాపసోత్తములకు
నభిమతైక తపోభూమి యగుచునొప్పు నాప్రయాగంబు మహిమ యేమని నుతింతు ॥

చ. రవి మకరస్థుడైనతరి బ్రహ్మహణుడున్ హయమేధియున్ దదీ
య వినుత వేణికాత్రయమునందు మునింగిన వానిమేని వా
ర్లవములు మీద బడ్డపుడు బ్రహ్మపదస్థితి గాంతురన్నచో
నవలను తీర్థమాడిన మహాబల మెవ్వ డెరుంగ జెప్పగన్ ॥

ఆ.వె. అభిమతంబుగోరి యమ్మహాక్షేత్రంబు నందు ముక్తజీవు డైన వాడు
భూతలంబునందు జాతిస్మరత్వాది ఫలము గాంచి దాని బ్రస్తుతించు ॥

వ. అమ్మహా క్షేత్రంబున బరాశరముని శ్రేష్ఠుం డొక్కనాడు త్రివేణికా సంగమంబున.
మకర మాఘంబున తీర్థం బాడి సంధ్యానుపాంబులు నిర్వర్తించి తత్పులిన ప్రదేశంబున
శిష్యసహస్రంబులకు బ్రహ్మంబు బోధింపుచున్న సమయంబున వసిష్ఠమహాముని శిష్యుం
డగు వామదేవుండు వచ్చి యటకి మున్ను స్నానాది కర్మంబులు దీర్చి యమ్మునికుల
గ్రామణిం గాంచి ప్రణమిల్లి ప్రాంజలియై యిట్లనియె ।

ముగింపు :

మ. పటురోషంబున నిల్చి దానవ పతిం బ్రహ్మాస్త్రలూనాస్యు చే
యుటకున్ గారుడ బాణవైఖరి ని యయ్యుర్వీ తనూజాత దె
చ్చుటకుం జిత్తమువెట్టి యిట్టిపని యిచ్చోనేలలీలా మహో
త్కట సంగ్రామ మొనర్చి కాక యనుచున్ కాంతావియోగంబునన్ ॥

క. మది గప్పినమోహంబున తుది నేమియు దోప కపుడు దోర్బలలీలా
సదన మదన శరజాలక విదళితధృతియగుచు రామవిభు డిట్లనియెన్ ॥

చ. నెమనికగాక పంచవటి నీడల నిండెలు మున్నుగాగ వృ
క్షముల నికుంజ పుంజముల గాంతయు నేను రమించు నట్టి దే
శముల నటించు గ్రమ్మరి విశాల విలోచన గానలేక యా
శ్రమతల పర్ణశాల కడ సంచరి యింపుచు నశ్రు లొల్కగన్ ॥

చ. పవడపుమోవి నీనగవు పల్లవ భాగతుషార వారిబిం
దువు గతినున్న నీ వరిది తోయపుముత్తియమున్ గరంబిడ
న్దివియగ నీప్రకోష్ఠరుచి నింపుచు నుచ్చిత పండటంటివా
భవ దుచితోక్తి సత్క్రియలు బాయున నామది తోయజేక్షణీ ॥

గద్య :

ఇతి శ్రీమదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణ కృష్ణభట్టారక పౌత్ర చింతలపూడి కామప్రభు సుపుత్ర శుద్ధ సారస్వతవిభవ ప్రణీతంబైన తారకబ్రహ్మ రాజీయంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

అసమగ్రము. కాగితపుప్రతి. ప్రథమాశ్వాస గద్యక్రింద నీ విధముగా కలదు. "అంగీరస సం॥ జేష్ట శు. ౧౧ సోమవారం పగలు గం. ౨కు యీ తారకబ్రహ్మరాజీయము పట్నాల అప్పన్న ఆత్మార్థం కొరకు వ్రాయనైనది".

ఇందు మూడాశ్వాసములు సంపూర్ణముగాను, నాల్గవ ఆశ్వాసములో సుమారు 74 పద్యముల వరకు గలదు.

కవి యీకృతి నిష్టదైవతమగు శ్రీరామ విభుల కంకితము గావించెను.

# తారాశశాంక విజయము

## శేషము వెంకటపతి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 2750 | కాల్ నెం | :టి 3-78 |
| ప్రతి | : తాళపత్రము, సమగ్రము. | పత్రములు | : 26 |
| ప్రతి పరిమాణము | : 33×3 సెం.మీ | పత్రపంక్తులు | : 5 |

**ప్రారంభము :**

శ్రీరంగపతి పదాంబుజ సారంగచ్ఛిత్త చిత్తజాత జయంతా
కారా కవి మందార క్షీరాంభోనిధి గభీర సీనయధీరా।

వ. అవధరింపుము సూతుండు శౌనకాది మహామునుల కిట్లనియె । నవ్విధంబున బృహస్పతి దివస్పతి సదనంబునకుం జనిన యనంతరంబ యిక్కడ.

ఉ। ఒంటిగ నబ్బె చంద్రు డిపు డొంటిగ వాతెర జుంటి తేనియల్
గెంటని ప్రేమగ్రోలి రతికేళిని తేలకయున్న ముత్యపుం

గీ॥ బంట వలంతి వింటిదొర బారికి నోరువ లేనటంచు నా
తుంటరి గుబ్బలాడి వగతో విగతోరు వివేకపాకయై ।.
గురునివెంబడిగా నొక కొంతదూర మరిగి యాతని యనుమతి నంబుజారి
క్రమ్మరగవచ్చు నాలోన కంబుకంఠి పట్టగూడని తమకంబు నెట్టుకొనగ।.

సీ॥ సరసాన్న పాకముల్ శాకపాకంబులు వింతవింతలు జేసి దొంతినునిచి
వొప్పైన నలుగులు నుష్ణోదకంబులు నొనర మజ్జనగేహమున నమర్చి
చెలువొందు వలువలు వెలహెచ్చుసొమ్ములు పొందక్కుటట్టల పొందుపరిచి
కుంకుమంపు రసంబు గోవ జవ్వాదియు రతనాల గిన్నెల జతనుపరచి

గీ॥ పువ్వుటెత్తుల పొట్లముల్ నివ్వటించి పొంకమున కేళిగృహము నలంకరించి
యింతి యాతనిరాకకు నెదురుచూచు చుండ తారామనోవల్లభుండు వచ్చె ॥

.... .... ....

ముగింపు :

ఉ। చెయ్యక సేయు చిక్కులను చిన్నిమిటారపు గోటినొక్కులన్
నెయ్యము దొల్కు జూపులను నిచ్చలు మెచ్చుల నిచ్చువైపులున్
ద్రొయ్యని కూర్మలున్ దనర తొయ్యలియున్ శశియున్ దివానిశం
బయ్యెడ నుండి రిట్లు మదనాహవమోహవశానురక్తులై ।

వ. అనుటయు.

శా॥ ఆచంద్రాచల చందనాచలధరణ్యాకల్పకీర్తిప్రభా
శోచిష్కేశ పటుప్రతాప శలభస్తోమాకృతారి ప్రజా
ధీచాతుర్యలసద్వచోవిజితమాధ్వీగోస్తనీప్రాణితా
సౌచిత్యాంచితసత్కవి ప్రవర వాగ్జాల ప్రియంభావుకా॥

క॥ స్వామి ద్రోహరగండా సామాదిక చతురుపాయ సాధన శౌండా
శ్రీమద్గుణ ప్రకాండా హైమగృహాళిందపూర్ణహయవేదండా ॥

స్రగ్విణీ॥ దానరాధాసుతా ధర్మ సత్యవ్రతా
దీనరక్షప్రియా ధీరభవ్యోదయా
భానుభాస్వద్ఘృణీ బ్రహ్మవంశాగ్రణీ
మీన లక్ష్యాకృతీ మేరుభూభృద్ధృతీ॥.

గద్య :

ఇది శ్రీ జానకీ రామచంద్ర చరణారవింద వందన కందళితానంద కందాళ రామానుజ గురుచరణ సేవా సమాసాదిత సాహితీవైభవ శేషము కృష్ణయార్య తనూభవ సుకవిజన విధేయ వేంకటపతినామధేయ ప్రణీతంబైన తారాశశాంక విజయంబను శృంగార ప్రబంధంబునందు తృతీయాశ్వాసము.

విశేషాంశములు :

ఈ ప్రతియందు తృతీయాశ్వాస మొక్కటిమాత్రమే కలదు. వ్రాత తప్పులు కలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

# తారాశశాంక విజయము

## కెళ్ళ కప్పయ్యకవి

| ఆక్సెషన్ నెం | : 3316 | కాల్ నెం | : టి 3-21 |
|---|---|---|---|
| ప్రతి | : కాగితము; అసమగ్రము. | పుటలు | : 77 |
| ప్రతిపరిమాణము | : 21 X 16.5 సెం.మీ. | పుటపంక్తులు | : 23 |

ప్రారంభము :

శ్రీ రఘురామ రక్షిత సజ్జనస్తోమ తారకనామ సుందరకోటికామ
యిలను కెళ్ళక కులాధీశుడైనట్టి మల్లయపౌత్రుండ సన్యాసిపుత్రుండ
అతులిత చతురపండిత విధేయుండ భవదంకితముగ ధర్మాంగచరిత్రంబు
తగ ముందు నర్పించి కరమర్థి పిదప శతకంఠయుద్ధంబు శ్రీశైలవాసుడౌ
శ్రీ మల్లికార్జునస్వామికిని కృతిని సమర్పణ జేసినాడ
పారిజాతమును నలధారుణీ చరితంబు భద్రకరమైన సముద్ర మథనంబు
ప్రవరాఖ్య చరితంబు రఘురామ శతకంబు కృతియొసంగితినీకు నతిముదంబలర
కూరిమితో శ్రీయర్ధనారీశ్వరీకలాప మును నీలకంఠేశ్వరుని కిచ్చినాడ
నతి తారాశశాంకవిజయము నేడు పదముగా నీకు నర్పణ చేయదలచి
చెప్పబూనితి నన్ను చేబట్టి కాపాడు ఘనదయాసాంద్ర రాఘవరామచంద్ర
శ్రీ జానకీరామ శృంగారగుణధామ కలుషవిరామ కవికులసార్వభౌమ
పుషితామరస్తోమ బుధజనావనసీమ కారుణ్యరసభూమ కళ్యాణనామ
ఫాలాక్షనుతపాత్ర భాసురచారిత్ర వనజాతదళనేత్ర వసుధాకళత్ర
అతిభక్తి నీదుపాదారవిందంబులను వదలక ననిశంబు నెమ్మది పాదుకొల్పి
పొందుగా జిహ్వాగ్రమందు వసియించుమని వాణినబ్జజు కూర్మిరాణి నుతియించి
అంతరాయములెల్ల నణచి కృపనేలుమని గజముఖుని పాదవారిజములకు మ్రొక్కి

శ్రీరామచంద్ర రక్షించి నను చేకొట్టు  అవనీతలమున నీకంకితంబుగను
బొంకముగ తారాశశాంకవిజయము పదము  గావింతు తత్కథాక్రమ మెట్టిదనిన
మౌనిజనజేగీయమానమై దనరారు  నైమిశారణ్యంబునందు సంతతము
కొమరొప్ప శౌనకాది మహామునీశ్వరులు  సూతముని వీక్షించి స్తోత్రంబుజేసి
బ్రహ్మాంశమున నత్రిభార్యయౌ ననసూయ  గర్భమున చంద్రుడే కరణి జనియించె
గురుపత్నియనక తా కూర్మి తారాదేవి  నెట్లు బట్టెను దాని కెంతయును కినుక
తారాధిపతి దేవతా సమూహమునెల్ల  ధీరుడై యేకరణి పోరున జయించె
అది దెల్పు మనిన మంచిదె యంచు సూతుండు  హర్షమిగురొత్త నిట్లనిజెప్పదొణగె
వర్ణింపగా బ్రహ్మవంశ సంభూతుండు  గల డత్రియను పేర జెలగు నొకమౌని
యతనికి కులపత్నియై యొప్పుననసూయ  సలలిత భక్తిసేవలు జేయుచుండె
చెలగి తపోనిష్ఠచే ప్రొద్దుబుచ్చుచును  కొంతకాలంబునకు నంతరంగమున
తనమదిని పుత్రలాభము బొందగాక్షించి  భార్యాసమేతుడై ధైర్యంబు మించి
హిమశైలమునకేగి యలమి తచ్ఛైలముల  గలుగు చిత్రములన్ని కాంత కెరిగించి
తరిని ప్రాంతమున దనరారు బదరికాశ్రమములో జొచ్చి  యచ్చటను నివసించి
చక్కగా నొకపర్ణశాలను నిర్మించి  స్వర్ణదీజలములను స్నానంబుజేసి
పరువడిని వాతాంబుపర్ణాశనుండగుచు  విపులతరముగ ఘోరతపమాచరింప.

ముగింపు :

వ. బృహస్పతి దేవలోకమునకేగి జరిగిన వృత్తాంతంబు దేవేంద్రునితో జెప్పి విలపించుట—
పదము ఏమి జెప్పుదును యింకేమి యున్నది బ్రతుకు వినరానిమాట వినుపింపగా వలసె
విను మత్రి సన్మౌని తనయుడగు సోముండు తంద్రి బంపినను మాదరి కేగుదెంచి
భావంబులోన సద్భక్తి సంధిల్లగను  మముగొలచి సకల శాస్త్రము లభ్యసించి ।

* * * *

విశేషాంశములు:

అసమగ్రము. పుస్తకము మంచిస్థితిలో నున్నది. కవి తన్ను గురించి గ్రంథాదిని చక్కగా పేర్కొనెను. తన ఇతర కృతులనుగూర్చికూడ గ్రంథాదినే పేర్కొనెను.

ఇది తెలుగులో పద్యకావ్యముగా ఇదివరకే ప్రసిద్ధినొందినది. అట్టి ప్రసిద్ధ కావ్యమును కెళ్ల కప్పయ్యగారు పదముల ఫక్కీలో వ్రాసిరి. వ్రాతదోషము లధికముగా గలవు. ఇందు శృంగారరస మధికముగా వర్ణింపబడినది.

# తారాశశాంక విజయము

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 230 | కాల్ నెం | : టి3-84 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 91 |
| ప్రతి పరిమాణము | : 35×3. సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

ప్రారంభము :

శ్రీకరంబైన తుండ మూగించి, లంబ కర్ణములచే ప్రకాశించి,
కరి కరిణి గుణములు ముఖమున నుంచి, దంత కాంతి చేతను చంద్రు మించి,
జన్నిదముగ పాములు ధరియించి ఆఖు వాహనముపై నధిష్ఠించి
త్రిశూలంబు కేల సంధించి భక్త జనుల ప్రార్థన నాలకించి
విఘ్న మను కరులపైకి లంఘించి మోద మలరంగ వాటి బడద్రుంచి
దాస వరుల విడువగ పోషించి వొప్పుతుండేటి గణనాథు నెంచి
యిందు విజయంబు చేయగ దలంచి ముందు పూజింతు నే మనము నుంచి ॥
ధాత్రిజావరా ధైర్య సాగరా॥ ౹ ॥
పూర్వ కవి సంఘముల సంస్తుతించి గురు శరణ సేవయు బుద్ధి నుంచి
బుధ వర్గంబు శలవునను మించి తారా శశాంక విజయ మూహించి

శారధీ పద్యములు గాను రచియించి చెప్ప దొణగెదెను రాము దయ నుంచి॥ధాత్రి॥4॥

. . . . . అయోధ్య పురముకు మోదము నను
నేగ వలె ననుచు తన మనములోను నూహించు చును వేగంబు గాను

శిష్య సంఘముతో పైన మై తాను జటా వల్కలంబులు చాలాను
శిరము నందు అల్లల నాడగాను ఘనమై నట్టి తన పురము నాను
రుద్రాక్ష పేరులు మెరయగాను మౌని వర్యుండు యిట్లేగె తాను॥ధాత్రి ॥౬॥

ముగింపు :

ఇంద్రదూత యిట్లని పల్కగాను అచట గల పెద్ద లెల్ల తమలోను
యేమి జరుగునోయని దలచగాను కలహ హేతు వనుచును వోల్చగాను
తార వద్ద యుండె చెలుల లోను పెద్ద చెలికత్తె వకతొచ్చితేను
దానితో వారు యిట్లనంగాను కుముద మిత్రునితో మాట్లాడగాను
యింద్రు డొక్క దూతని బంపితేను ద్వారమున నిలిచె నతడు త్వరగాను
సమయ మిమ్మను మన్త్రిసుతుతోను నీవు జెప్పవలెనని బల్కగాను ॥ధాత్రిజావరా॥

మేలు ॥

ఆ మాటలు విని దాసీలు వర మణి మయ సోపానాలు
దాటే గిరంతిపురి వీలు యేమందు రందు చోద్యాలు
ఆ మేడల దర్వాజాలు ఘన బలభిన్మణి చీడీలు
బల్ పద్మ రాగ ద్వారాలు బార్హ్మముకురపు కవాటాలు
మరకతముల పావంచాలు సీతాంశు రత్న కుడ్యాలు
ఆ గోడలగల చిత్రాలు మేల్ పొగడలతల శోభాలు
సౌవర్ణస్థగిత గుండీలు పంజరముల పికకీరాలు
మదన రణ నిపుణ భేదాలు నవి పల్క సరస వాక్యాలు
హీరముల తీరు దూలాలు ఆ గోడల గల చిత్రాలు
దర్పణము లకృత పద్మాలు ఆ మ్రోల నిలువుటద్దాలు
ఆ చుట్టును కురు విందాలు చౌషష్టి బంధ భేదాలు
లిఖి యిం . . . . . . . ,

**విశేషాంశములు:**

ఈ ప్రతియందు గ్రంథాది గలదు. కాని గ్రంథాంతము లేదు. మధ్య మధ్య పత్రములును నష్టమైనవి.

కవి గ్రంథాదిని విఘ్నేశ్వరాది దేవతా ప్రార్థనము సుకవిస్తుతియు గావించి తాసీ గ్రంథమును శారదీ పద్యములుగా రచింతునని నుడివెను. ప్రతి పద్యము చివర "ధాత్రీజావరా" అను మకుట మున్నది. ఈ పద్యములలో ప్రతి పాదమునను అంత్య ప్రాస యున్నది. ఆప్రాస పద్యప్రారంభమునకు ముందే తెలుపబడుచున్నది. ఇంద్రుని దూత వచ్చుట వరకు మాత్రమే యిందుగలదు.

ఈ ప్రతి నలుపు దిరిగి యున్నది. లిపి స్పష్టముగా నున్నది. ప్రతి విలేఖనమున దోషములు గలవు. కాని ప్రతి బాగుగానున్నది.

# తాళాంకనందినీ పరిణయము

## మరింగంటి వేంకట నరసింహాకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4643 | కాల్ నెం | : బి 3-194 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 125 |
| ప్రతి పరిమాణము | : 46×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 8నుండి 9వరకు |

ప్రారంభము :

వ॥ సంతత నితాంత కల్యాణ పరంపరాక్రాంత దిగంత విశ్రాంతం బగునటుల నే రచియింపం బూనిన తాలాంకనందనీ పరిణయం బను శృంగార ప్రధాన ప్రబంధమునకు కథాసూత్ర ప్రారంభప్రకారం బెట్టిదంటే ...

క॥ జనమేజయ నరపతి భూ జనమే జయ జయకర ప్రశస్థితి పొగడం
గ నమేయ దయాకీర్తుల గన మేయడ నితని తెలియగా నన నెగడెన్ ॥

చ॥ అత దతుల ప్రభావ మహి వ్యాప్తిని సాత్యవతేయ వా గుదీ
రిత నిఖిలాగమాంత సపరిష్కృతమైన పురాణకోటి సం
తతము తదీయ శిష్యులు యథావిధిగా వినుపింప వించు సు
స్థితి నతినీతి సంయుత మతి న్నుతికెక్కు కుతూహలోన్నతిన్ ॥

క॥ ఆ యనఘుడు కృష్ణ ద్వై పాయన ముని వలన బొదము భారత మమృతో
పాయనముగ వినె వైశం పాయన జైమిని సుమంత పైలుల వలనన్ ॥

క॥ వారల నలుపురి లోన న పార దయాశీలు దుష్టభవ నిర్మూలున్
శౌరి పదభక్తి లోలున్ సీరద వాగ్జాలు పైలునిం గని పలికెన్ ॥

చ॥ అనవిని పైలు డిట్లను నృపాగ్రణితో నభిమన్య రేవతీ
తనయ వివాహ సత్కథ యథా విధిగా విశగోరి తీపు పా
వనుడు పరాశరాత్మజుని వల్లను నాకు లభించినట్లు బో
ధనపడగా వచింతు ప్రమద స్థిర బుద్ధిని నాలకింపవే ॥

మ॥ కల దభ్రంకష సౌధయూథ విహర త్కాంతాజనాలోకితో
జ్వల గంగాతటినీ తరంగ చయ చంచ ద్దోలికామాలికా
కలన క్రీడిత రాజహంస మిథునాక్రాంతంబు నా ద్వారకా
విలసన్నామక రాజధాని యలరున్ విక్రాంత సంపద్గతిన్ ॥

ముగింపు :

శా॥ ఈలీలన్ బహువాసరంబు లతి భోగేచ్ఛా విహారంబులన్
తాలాంకాత్మజతో మెలంగు నటమీదన్ పాండుసూనుల్ జయ
శ్రీలన్ జెంది . . . . . . బారిన్ దేరి సౌభద్రు ను
త్తాల ప్రక్రియ తల్లితో మగుడ నింద్రప్రస్థమున్ జేర్చియున్ ॥

చ॥ కొడుకును కోడలిన్ గని యకుంఠకుతూహలులౌచు నక్కలం
విడుకొని ధర్మజప్రముఖ . . . . దామువివాహ కాలమం
దెడపడి యుంటచే మది నొకింత గొరంతన నుత్తరాసతిన్
దడయక పెండ్లిసేయగను దానికి గల్గె పరీక్షితీశుడున్ ॥

క॥ అతడె భవజ్జనకుండై యతులిత భరతాన్వయంబు నలరి త
త్సుతినిధివి నీవు నిఖిల క్షితి పాలనసేయు సుప్రసిద్ధుడవు కదా ।

క॥ ఆయా వృత్తాంతము వా క్ప్రియుక్తి సవిస్తరముగ జెప్పితి మునుపే
వేయు విధంబుల నీ మది నేయడ మరుపొందునే మహీతల నాథా ॥

క॥ ఈ పగిదిన్ జనమేజయ భూపతికిన్ పైలు దమ్మతపుంజ రసోక్తుల్
చూపట్ట దెలిపి తత్పతి చే బూజితుడై నిజేచ్ఛచే జనుదెంచెన్ ॥

మ॥ ఇది ధారాళ మరంద మాధురి వచోఽహీన ప్రదారాఘవా
ర్యదినేశానుజ భావనార్యతనుజ ప్రౌఢాంక మౌద్గల్యభూ
విదితోద్వేల్లితకీర్తిసారస రమాద్వి నారసింహార్యపా
పదతాళాంకసునందినీ పరిణయాశ్వాసంబు షష్ఠం బగున్ ॥

గద్య :—
ఇతి శ్రీమచ్ఛేషధరాధర సౌధ వీథీ విహరణ వేంకటరమణ చతుర్విల క్షణాక్షీణ కృపా కటాక్ష వీక్షణా పరిలబ్ధ లక్ష్య లక్షణానవద్య విద్యావిలాస శ్రీనివాస గురు చరణాభ్యసన రదసనా వికాస నిస్తుల్య కల్యాణ సాకల్య మౌద్గల్య గోత్ర పవిత్ర భావనా చార్య పుత్ర పర్వత్రయ కైంకర్యవిధాన వేంకట నృసింహార్యాభిధాన ప్రణీతంబైన తాలాంక నందినీ పరిణయం బను మహాప్రబంధంబునం దుషష్ఠాశ్వాసము.

విశేషాంశములు :

ఈ కావ్యము ఆరు ఆశ్వాసముల గ్రంథము. ఇది శశిరేఖా పరిణయమే. ఈ ప్రతి యందు కథారంభమునకు ముందుండు అయిదు పత్రములు ఇరు పార్శ్వములు తునిగి మధ్యముక్కలు మాత్రము కొంత మిగిలియున్నవి. కథారంభము నుంచి మాత్రము పూర్తి గ్రంథము గలదు.

క్రిమిదష్టమై కొన్ని పత్రములలో కొద్ది విషయము నష్టమైనది. మొత్తము మీద ప్రతి బాగుగానున్నను కొంచెము నలుపు దిరుగుచున్నది. ఇందలి లిపి స్పష్టము.

ప్రతి విలేఖనమున చాల దోషములు గలవు.

ఇందు ఆంధ్ర గృహస్థుల యిండ్లలో జరుగు సన్నివేశములు కవి హృదయంగమముగా వర్ణించెను.

# తాళాంకనందినీ పరిణయము

## మరింగంటి వేంకట నరసింహాచార్యులు

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం. | : 6116 | కాల్ నెం. | : టి.3-614 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 141 |
| ప్రతి పరిమాణము : | 42.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు : | 7 నుండి 8 వరకు |

విశేషాంశములు :

చ. కలియుగ శాలివాహన శకంబులు వేదరసాచలేందు సం
ఖ్యలు జను నందు నాంగిరస హాయన భాద్రపదాసితాష్టమిన్
కలిత మృదూక్తి నీ సరసకావ్యము పూర్ణముగా రచించె న
త్యలఘుడు శేషశైల శిఖరాగ్రవిహారి లసత్కృపామతిన్.

ప్రతిలో మూడు పత్రములు లోపించినవి. కొన్ని సగమే యున్నవి. కొంత క్రిమిదష్ట మైనది. లిపి స్పష్టము. లేఖన దోషములు కలవు. ఈ ప్రతి యందు పైపద్యమున విశేషముగా వ్రాయసకాడు ప్రతి విలేఖన విషయాదులు తెలియజేసెను.

# తెలుగువారి ఆదిచరిత్రము

# (లేక) ఆదిఖండము

## తేకుమళ్ల రామచంద్రరావు

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 6175 | కాల్ నెం | : టి3-608 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పుటలు | : 114 |
| ప్రతి పరిమాణము | : 20×32 సెం.మీ. | పత్రపంక్తులు : | 33 |

ప్రారంభము :

## ప్రథమాశ్వాసము (లేక) ఆది ఖండము

కం. శ్రీవాణీ గౌరీయుతు లే విష్ణు బ్రహ్మలు శివు డీ విశ్వప్రే
యో వాప్తికరులౌ వారిని నే విశ్వాసమునఁ గొల్తు నిర్మల భక్తిన్.

## శ్రీమహావిష్ణువు

సీ. పాల పాథోధి యప్రాకృతాకాశంబు కాకోదర మనంతకాల లహరి
బొడ్డు కెందామరపూవు బ్రహ్మాండంబు పటు భవ త్ప్రభుశక్తి భార్య లక్ష్మి
గగనంబు నీ నిరాకార చిహ్నము మేఘ నీలిమ నీ మహాఖిల కాంతి
నీశుభాంగము విశ్వనిఖిలంబు శయనంబు తత్కాంతి రక్ష నీ తమ్మికనులు
నైన నిను విష్ణు భవభయహరు సురేశు యోగి హృద్ధ్యాన గమ్యు నచ్యుతు ననంతు
సర్వ లోకైక నాథుని సన్నుతింతు నిపుడె సఫలంబు చేయ మదీప్సితములు.

*　　*　　*　　*

వ. భక్తితో నంకిత మొసంగిన యీ కావ్యమునకు కథా ప్రారంభ మెట్టిదనిన—

## కథాప్రారంభము

శా. శ్రీశుం డాద్యుఁ డనంతుఁ డచ్యుతుఁడు భాసింపంగ నవ్యాకృతా
కాశం బందున, కోటి సూర్యుల మహాకాంతిచ్ఛటల్ చిమ్మి నా
నాశా వ్యాప్తముగా, నటన్ బ్రకృతి డాయన్ వచ్చె నందుండి త
న్నాశం జూచుచు ముక్తికై పరగె జీవానీకముల్ దుస్థితిన్.

తే.గీ. వారిలో'రమ' యర్హతన్ బట్టి ముక్తి వెంటనే యిచ్చి విష్ణు వాపిదపి యర్హ
జీవియగు 'బ్రహ్మ' నేర్పర్చె జీవులెల్ల స్వీయసాధనచే ముక్తిచెందు నర్హ
తను బడయుటకు సృష్టిమొదలిడ నతఁ డజాండము సృజించె తారకాద్యఖిలయుతము
అంతరిక్షము నాకస మనెడు చోట నలమ నీ యజాండము విశ్వ మనెడు పేర.

చ. అలరె మహాంతరిక్ష హృదయంబునఁ బావక మండల ద్వయం
బలఘు ఖగోళ 'మగ్ని'యయి 'యంగిర'సాఖ్యధరించె చిన్నదౌ

జ్వలన ఖగోళ మంగిరస వహ్ని జనించి ద్రవంబు ధూమమున్
గలసిన గోళమై యెసఁగి కాంచె మహోన్నతి నాకసంబునన్.

* * * *

**ముగింపు :**

మంజరి: విష్ణుగోపుండును విష్ణువర్ధనుండు యుద్ధమల్లుండు కులోత్తుంగ చోళుఁ
డోరుగంటిప్రతాపుఁ డుర్వినాయకులు రారాజు లెందఱో రాజ్యంబు లేల
భట్టి యుగంధర భట్టబాణులును హరిహర బుక్కతిమ్మరుసు మంత్రులును
అల కుమారిలుఁడు విద్యానాథ బుధులు ఆర్యదేవగుణాఢ్యహాలాది కవులు
క్ష్మాస్థలి నున్నత కవిపంక్తి నగ్ర గణ్యుఁ డౌ ఘనుఁడు శ్రీకాళిదాసుఁడును
తిక్కనయెఱ్ఱనాది మహాంధ్రకవులు జనులకు సేమంబు జ్ఞానంబుఁగూర్చి
తమ యాంధ్రత ఫలింపఁ దరలిరి దివికి మన పునర్ఘనతకై మనల దీవించి.

వ. ఇన్నూరేండ్ల క్రిందటి వఱకును అత్యున్నత స్థితిలోనున్న తెలుఁగువారు క్రమముగా దీనాతి దీనమైన స్థితికి దిగజారి తమశక్తిని తమలోతాము కలహించుకొనుటకు, వినియోగించుచు, నేఁడు అందఱకు అలుసై, తమ అధోగతిని గుర్తింపఁ జాలని అంధులై హీన స్థితిలో పడియున్నారు. పూర్వోన్నత్యమును, కలసికట్టు తనమును, ఇతర గుణములను జ్ఞప్తికి తెచ్చి, వీరిలో తెలుగుతనమును, ఆంధ్రత్వమును పునరావిర్భింప జేయఁగలదను నాశతో నీ కావ్యమును రచించితిని. ఈ ఆశ నెరవేరునుగాక !

* * * *

## ఆశ్వాసాంతము

చ. తెలుగుల పుట్టుపూర్వములు తెల్గులు నాంధ్రు లభిన్నులౌటయున్
దెలిపితి నాంధ్రవిష్ణుని యతీత మహత్తర శక్తి దెల్పితిన్
తెలిపితి నేఁటి తెల్గుజన దీనపరిస్థితి సాదరమ్మునన్
తెలుగుల మేలుకై సతము దీవన లిమ్ము సరస్వతీసతీ.

## భరతవాక్యము

మంజరి: అణగారి యున్నట్టి యీ యాంధ్రజాతి
తేలగ్గుడ్ల తొనుమ తెలుగుల జాతి

కోల్పోయినవి తెచ్చుకొనుగాక మఱల
　　పూర్వసాహస ధైర్య సర్వస్వమాది
గా తెల్వితేట లైక్యమును వర్ధిలు త
　　అభివృద్ధి యగుఁగాక ఆంధ్ర ధరిత్రి
పాడి పంటల తోడ వసుధ వర్ధిలుత
　　భారతప్రజ లెల్లప్రాపంచ జనులు
మైత్రితో సుఖముగా మనుదురు గాక.

*　　*　　*　　*

గద్య :

ఇది శ్రీ శ్రీవత్సస గోత్రాంతర్గత తేకుమళ్ళాన్వయ సంజనిత రాజగోపాలరావు తనూభవ రామచంద్రరావు నామధేయ ప్రణీతంబైన శ్రీ'తెలుగు వారి ఆది చరిత్రము' అను 'తొలి కథ' యందు సర్వంబును 'ఆంధ్రవిష్ణు ఖండము' అను పంచమాశ్వాసము.

స మా ప్త ము

*　　*　　*

విశేషాంశములు :

ఈ గ్రంథము ఆధునికము. చివర అనుబంధము గలదు. కవి 'సాహితీ సుధాకర' బిరుదాంకితుడు. ప్రతి బాగున్నది. లిపి స్పష్టము.

# దశరథరాజ నందన చరిత్ర

## మరింగంటి సింగరాచార్యులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4011 | కాల్ నెం | : టి 3—270 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 71 |
| ప్రతి పరిమాణము | : 31×3.5 సెం. మీ | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

ప్రారంభము :

చ॥ .... .... .... ....
　.... .... .... జూడగా

జనును పసిండి బొమ్మక్రియ సంతస మొప్ప వసించు నట్టి యా
ననవిలుకాని తల్లియగు నాతుక మాగృహసీమ నుండుతన్ ॥

చం॥ హరికి పయోధిపుత్రికి నుదంచిత తల్పకమై సహస్రభో
గరుచిర రత్నదీప కళికా ప్రకర ప్రభవ ప్రకాశ వి
స్ఫురణత లోక నిర్మలత బూనగ జేయుచు సర్వదాస్య వై
ఖరి రచియింప శేషఫణి కాంతుడు మాకు శుభంబు లీవుతన్.

సీ॥ ఉక్కు చెనె యనంగ నూర్ధ్వలోకంబును బ్రహ్మాండ భాండ కర్పరము నంట
వాలంబు పురివిప్ప చాల దిక్పాలుర పట్టణంబులు పరవంజి గప్ప
పక్షముల్ విసరెడు పవన వేగంబున గిరులు గృధ్రంబుల కరణి నాడ
(నుం) కించి త్రొక్కంగ నుర్వీతలంబెల్ల నహిలోక పర్యంత మడుగు మ్రోవ

గీ॥ తనర విశ్వ ప్రపంచ మంతయును (నిండ న) గు విరాడ్రూప సంపత్తిన్ యచ్చుతునకు
వాహనంబై నిశాటులవడి జయించు గరుడుని భజింతు క్షేమముల్ గందు కొనగ॥

ముగింపు :

క॥ నారాయణ సత్కృశచే నారా జచలంబు నించె నఖిలాశాలే
.... రాతి ఘటల నందఱి నారసి గ్రడించె సంశయ క్రియలెల్లా ॥

చ॥ అని ఘట కర్ణశైల నజిదాజి నిశాచర నేతలందఱున్
చనిరి హయచ్ఛటల్ నలసి సైనిక కర్త లడంగి రచ్ఛకాం
చన రథరేఖ లీడిగిలె చండ గజేంద్ర ఘటల్ నశించె నిం
కనయిన నీర్ష్యడించి నయ కార్యగతిం గనరాదె చక్కగన్ ॥

ఉ॥ ఆతత కీర్తి సంస్థిత దయారస సన్నిధి యార్తచేతన
త్రాత ధరాధరేంద్ర ధృతి దాశరథ క్షితినాథ హేళికిన్
సీతను నీతినిచ్చి నుతిచేసి గణిం .... దచ్ఛకాం
క్షాతిశయ క్రియల్ ఘనత యయ్యెడి చిల్లర గాథలై ....

మాలిని :

జనన లయ విదూరా సర్వలోకైక వీరా
వనరుహదళ నేత్రా వార్థికన్యా .... ....
.... తబెలా క్రమగోపాల బాలా
యనత గుణ వికర్ణా కాండ భాండత్ర ....॥

గద్య :

ఇది శ్రీ లక్ష్మీ నృసింహావతార .... టేశ్వర వర ప్రసాద లబ్ధ సకలైశ్వర్య ధురీణాంధ్ర భాషా నిరోష్ఠ్యాది వింశతి ప్రబంధ నిర్మాణ పారీణ మౌద్గల్యగోత్ర పవిత్ర తిరుమలదేశిక పాత్ర వేంగళాచార్యపుత్ర మరింగంటి సింగరార్య .... ....

విశేషాంశములు :

ఈ కావ్య మైదాశ్వాసముల గ్రంథము. కవి దీనిని శ్రీహరి కంకితము గావించెను. నిరోష్ఠ్యనియముతో సంక్షిప్తముగా రచించినాడు. కవి తన బిరుదములు గద్యలలో ప్రకటించినాడు.

ఈ ప్రతి యందు గ్రంథము యొక్క ఆద్యంతములు లేవు. మధ్య మధ్య పత్రములు మాత్రము 71 గలవు. అవియును వరుసగా లేవు. పత్రముల పార్శ్యములు శిథిలములై యుండుటచే నవి క్రమ రాహిత్య పద్ధతిలో నున్నవి. కొన్ని పత్రములు తునకలై యున్నవి. లిపియు స్పష్టముగ లేదు. ప్రతి విలేఖనమునను దోషములు కలవు. రెండవ పత్రము, అంత్య గద్య పత్రము, పంచమాశ్వాస పత్రములు కొన్ని యున్నవి. మఱియొక సమగ్ర ప్రతితో పోల్చుటకుపయోగింప వచ్చును. ఏది ఏమైనను నిది యెక్కువ ఉపయోగకారి కాదు.

# దశావతార చరిత్రము

## ధరణిదేవుల రామమంత్రి

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆక్సేషన్ | : | 4654 | కాల్ నెం | : | టి 3-154 |
| ప్రతి | : | తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : | 12 |
| ప్రతిపరిమాణము: | | 48.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు : | | 6 నుండి 7 |

ప్రారంభము :

సీ॥ క్రతువులందు హిరణ్యకశిపవే స్వాహా య టంచు వేల్తురు సోమయాజులెల్ల
హవనాదులను హిరణ్యకశిపు ప్రీత్యర్థ మనుచు సంకల్పింతు రవనిజనులు
నన్ములగని హిరణ్యకశిపూ రక్షతు త్వా మని దీవించు తజ్జ్ఞజనము.
కరుణాలయ హిరణ్యకశిపో ప్రసీద మే యనుచు ప్రార్థించు నానార్థగణము

గీ॥ తను భజించిన స్వర్గపదంబొసంగు కొలువకుండిన రౌరవములను ద్రోయు
బ్రహ్మదీవించ జనుదెంచు బ్రత్యహంబు హరుతెరువుబోడు భిక్షుకుండగుట నసుర॥

గీ॥ లచ్చి కడకంట వాణి నాల్కను వసింప గిరిజ జెరబట్టకుండునే సురవిరోధి
యర్ధతను వంగనయుగడ మర్ధతనువు పురుషుడై కన్పడ జుగుప్సవొడమె గాక॥

సీ॥ వాన లేదనరాదు వడి బట్టి తెప్పించి పర్జన్యు జబుకులపాలుసేయు
తలనొప్పి యనరాదు ధరలోన నెవ్వారు విరిచి కట్టించు నశ్వినుల నొకట
చిమిడె నం చనరాదు శిఖవట్టి యీడ్చి య గ్నిని నీళ్ళవైచి త్రొక్కించి బంపు
నపమృత్యు వనగరా దాగ్రహవ్యగ్రుడై శమనుని యుసురు గాలమున వైచు

గీ॥ కడమ కిన్నరగంధర్వఖచరసిద్ధ సాధ్య పన్నగ యక్ష నిర్జరుల జీటుకు
మన్న నడ్డము వట్టించు నసురవిభుడు చండశాసను డగుట నుద్దండు డగుచు॥

ముగింపు :—

శా॥ ఆదిత్యు ల్సుమవర్షము ల్గురియ తూర్యారావము ల్మీర భృ
గ్వాదు ల్మంత్రము లుచ్చరింప మణిపీఠారూఢు గావించి ర
క్షోదక్షుండని దైత్యదానవ మహాసామ్రాజ్యమేలంగ ప్ర
హ్లాదు న్పట్టముగట్టె బ్రహ్మ జగదాహ్లాదంబు సంధిల్లగన్॥

క॥ ధరణీశ్వర వినుపించితి నరహరి చరితంబు పావనం బిదినరు లె
వ్వరు విన్న వారి కొదవున్ హరిభక్తిచిరాయు రీహితైశ్వర్యంబుల్॥

వ॥ అని వైశంపాయన ముని ముఖ్యుడు దెలుప విని ప్రమోదాన్వితుడై జనమేజయు
డవ్వలి కథ యనఘా దెలుపుమని యడుగుటయున్॥

శా। ఆత్మానాత్మవిచార చారుతరమేధాధార ధారాధరై
కాత్మత్వ ప్రతిపాదన ప్రవణదానాసార సారంగవా
హాత్మంచర్యధినాథ నిర్మల తరవ్యాహార హారస్థగా
రుత్మద్రత్నవిభా నిదర్శితవృథా ....

క కవిరాజరాజ కృతకృతి కవిరాజ విరాజిత నుతఖల పథికపురః
కవిరాజరాజ సమధని కవిరాజ విరాజితాస్య కమనీయయశా॥

పృథ్వి॥ ఫణాధర ఫణాస్ఫురద్బహురుచిరత్న రత్నప్రభా
రుణారుణవిదారణాగుణభుజామహాభీషణా
.... గణ భయానక క్రమజయానక ప్రస్ఫుట
ధ్వణంధణధణార్భటీదళిత చిత్తవిద్వేషణా॥

గద్య :

ఇది శ్రీరామభద్ర దయాభిరామ భద్ర కరుణా కటాక్ష వీక్షా పరిప్రాప్త దీప్తత రాష్ట్ర
భాషా కవిత్వ సామ్రాజ్య ధౌరేయ సకలవిద్వత్కవిజనవిధే .... ధరణి
దేవుల నాగనామాత్య సుధాసముద్ర సమున్నిద్ర పూర్ణిమాచంద్ర రామమంత్రీంద్ర

ప్రణీతంబైన దశావతార చరిత్రంబను మహాప్రబంధంబునందు నరసింహావతారము చతుర్థాశ్వాసము.

విశేషాంశములు :-

అసమగ్రము. గ్రంథములోని కొన్ని పత్రములు శిథిలములైనవి. కొన్ని క్రిమిదష్టమైనవి. ఇందు చతుర్థాశ్వాసమునకు సంబంధించిన పత్రములు కలవు. చతుర్థాశ్వాసాది భాగము కూడ లేదు. చతుర్థాశ్వాసాంతము మాత్రము గలదు. ఆశ్వాసాంత గద్యను బట్టి చూడగా ఒక్కొక్క అవతారమునకు ఒక్కొక్క ఆశ్వాసముగా కవి రచించినట్లు గోచరించుచున్నది. ఇందు నరసింహావతారమును గూర్చి వ్రాయబడినది.

# దశావతారచరిత్ర

## ధరణిదేవుల రామమంత్రి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3691 | కాల్ నెం | : టి3-249 |
| ప్రతి | : తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | : 20 |
| ప్రతి పరిమాణము | : 31 × 3 సెం.మీ. | పత్ర పంక్తులు | : 4 నుండి 5 |

ప్రారంభము :

శ్రీయుక్త ధర్మ కృష్ణా నాయమణీ కృష్ణ హృదయనాయక కృష్ణా
నాయక జాధిప సూచక నాయకమణి కృష్ణ పద్మనాభుని కృష్ణా॥

గీ॥ ఆపధరింపుము జనమేజయ క్షితీశ శేఖరున కిట్టులను వ్యాస శిష్యమౌని
ధారుణీనాథ కూర్మావతార మికను తెలియ జెప్పెద వినుమని తెలుప దొణగె.

గీ॥ జగములు సృజింప పోషింప సంహరింప జాలు మూర్తుల గని పెంప జాలినట్టి
యత్రి కనసూయకును సాటియైన పౌని దంపతులు గల్గుదురె జగత్రయంబునందు.

కII ఆ దంపతులకు గిరిక న్యాదయితాంశమున బుత్రు డన బొడమి స్వతః
ప్రాదుర్భూత జ్ఞానుం డై దుర్వాస _స్తపోధనాగ్రణి వెలయున్॥

*  *  *  *

ముగింపు :

కII నిస్సత్వుడ వీ వతడతి దోస్సారుడు మీకు సంధి దొరకించుటకుం
దుస్సహము దప్తయోరుభ యోస్సంధి యనంగ వినవె యో దివిజేంద్రా.

కII ఐనను నా బెనగు గతిన్ నానావిధములను దనుజనాథుడు నెయ్యం
బూనగ జేసెద నని తా బూనుక చనియె న్నుపర్వపుంగవు డంతన్॥

కII ఒక పర్వతగుహ దిజ్ఞా యక సహితుండగుచు గురుని యాగమనము చూ
చుక యున్నతరిని శుభ సూ చకముగ గురు డంత వచ్చి శక్రుని కనియెన్.

సీII అమరేంద్ర నీ వనుప ననుకంప జనియింప పొలదిండి నెల దారి పురము జేరి

— — —

*  *  *

**విశేషాంశములు :**

ఈ దశావతార చరిత్ర వ్రాత ప్రతిలో కూర్మావతారము మాత్రమే యున్నది. అది కూడ అసమగ్రము. లిపి స్పష్టము. ప్రతి బాగున్నది. లేఖన దోషములు కలవు.

# దివ్యదేశమాహాత్మ్య దీపిక

## వేంకటు దాసు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం : | 537 | కాల్‌నెం : | టి 3-92 |
| ప్రతి : | తాళపత్రము; అసమగ్రము. | పత్రములు : | 23 |
| ప్రతిపరిమాణము : | 40.5×3 సెం. మీ. | పత్రపంక్తులు : | 4 |

ప్రారంభము :—

శ్రీ రామచంద్ర యాశ్రిత సన్మసీంద్ర కారుణ్యసాంద్ర భాస్కర వంశచంద్ర
కోదండ రామ సద్గుణ వరస్తోమ నాదు విన్నపమును నయముగా నాల
కించి నా నేరముల్ కినుక తోడుతను యెంచక మన్నించి యేలుకో దేవ
నిన్ను సన్నుతిచేయ నేనెంత వాఁడ పన్నగాధిపునకు బ్రహ్మకునైన
తరమె మీ మహిమలు తగ గొనియాడ సరసిజాక్షాశ్రిత సజ్జన రక్ష

ముగింపు :

నా ఘనుండు వివాహమయ్యె ముదమున శ్లాఘనీయ కృపావలంబను లింగ
మాంబ నాదంపతు లర్థి నన్గాంచి రంబుజోదర పదధ్యాన పారీణు
శ్రీవెంకటేశ భూరి కటాక్ష లబ్ధ పావన కవితానుభావుని గౌడ
నామ వేంకటదాసు నయము దీపింప ధీమంతులెల్ల నెంతే సంతసింప
మున్ను నే చేసిన పుణ్య ఫలమున వెన్నున కిచ్చితి ద్విపద గావించి
దివ్యదేశ మహాత్మ్య దీపికా కావ్య మవ్యయ సౌఖ్యదమై రాజ సభల
పూచిన సంపెంగ పోడిమిదాల్చి నాచంద్ర తారార్కమై యొప్పుగాత.

విశేషాంశములు :

ఈ కావ్యము స్తోత్ర రూపముననున్నది. ఇందు విష్ణు మహిమ లుగ్గడించబడినవి. గ్రంథాంతమున దీనిని వెన్నునకే యంకిత మొసంగినట్లు కవి వ్రాసికొనినాడు. ఈతని వంశవర్ణనము గ్రంథాంతమున గలదు. ఈతని వైష్ణవ భక్తి ఇందు వెల్లడియగును. ఇది భక్తి రస ప్రధాన కావ్యము.

ఈ ప్రతి చాల వరకు క్రిమిదష్టమైనది. పెక్కు పత్రముల యందలి అక్షరములు కానవచ్చుటలేవు. ప్రతి చాల శిథిలావస్థలో నున్నది. అక్షర దోషములు స్వల్పముగ నున్నవి

# ద్రౌపదీ కల్యాణము

## కుమార వేంకటరాయకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 475 | కాల్ నెం | : టి 3-203 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 190 |
| ప్రతి పరిమాణము | : 44×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6. |

ప్రారంభము :

శా॥ శ్రీవత్సాంకము భూమి భామ యను దృష్టిం జేష్టలం దత్స మీ
ఇా వృత్తిం దన దివ్య కౌస్తుభమణి చ్ఛాయ న్నిరోధించి లీ
లా వైముఖ్యముదోపకుండ నలమేల్మంగం బరీరంభ సౌ
ఖ్యావిర్భూతి నలర్చు వేంకట నగాధ్యక్షుండు మమ్మేలుతన్॥

ఉ॥ మాయం జిక్కి మోహదశమాయని లోకుల కెల్ల నెల్లెదన్
రేయు బగల్ సుబోధ మొనరించుటకై దెర నోట జ్ఞాన ము
ద్రాయత వృత్తి భక్త సులభాకృతి గీర్తి ముఖంబు గన్న యా
మా యిల వేల్పు నిష్టద సమాహ్వని రంపల నృసింపల గొల్చెదన్.

వ. అభ్యుదయ పరంపరాభి వృద్ధ్యంకుర నవరసాలం కారాకృతంబుగా నా రచియింపం బూనిన....ద్రౌపదీ కళ్యాణంబను మహాప్రబంధంబునకుం గథా ప్రారంభం బెట్టి దనిన॥

క॥ శ్రీకర నానా లోక వ రాకల్పన నటనజ్రశియాప నయన లీ
లాకలన కరణ సుకర క రాకర కటివలయ వేంకటాచల నిలయా.

క. వెన్నుని మనమున నిడి వి ద్వన్నుత మృదుమధుర రచన వచన సుధా సం
పన్నముగ దిన్నగ బరి క్షిన్నరవర సుతున కిట్లు జెప్పం దొడగెన్.

సీ. శ్రిత జనతా మనోహిత వాసనా విని ర్భరహరి చందనారామములను
నకలంక తర సువర్ణాంభోజవలన భా స్వర మరుద్దీర్ఘి కాసారములను

నిర్మల ప్రమన స్సుధర్మాసనాసీన నానా విధ బుధ ప్రతానములను
స్థిర కళాధర సుకేశీ మంజు ఘోషాను గీత సంగత రాజ గేహములను
బొలుచు గోపుర శృంగార కలన గాంచి సార సౌభాగ్య దర్శనాస క్త జగద
ధీశ దక్షిణ పాంచాల దేశమునను భూషణ కరంబు కాంపిల్యా పురవరంబు

ముగింపు :

సీ. సకల దిగంత విశ్రాంత ప్రతాపులై మొనసి నల్ దమ్ములు పనులునెరప
కాలోచితాచార కర్మ కర్మతులయి వ్యాస ధౌమ్యులు గౌరవంబు నెరప
....తరంగ కార్యాలోచనాత్ములై యెనసి బావమరందు లితవు నెరప
నభిమత భోగ భాగ్య సమృద్ధి కరులయి వాసవాదులు బాంధవంబు నెరప

నతిథిజన పూజనా పరాయణులు నగుచు పత్ని ద్రౌపది యనుగుణ భ క్తి నెరప
మహిత మహిమాద్య భూతోపమాను డగుచు ధరణి బాలింపు చుండె నా ధర్మరాజు.

పుష్పమాలికా బంధము:

క. ముర....   ....   సుఖ కామద మదమ
త్సర సరణి రహిత నతరత ధర ధర పర హృదయ దమద దరద రదర వా.

గద్య :

ఇది శ్రీమ ద్వేంకటేశ్వర ప్రసాదోపలక్షిత లక్ష్మీకళా విరాజమాన సకల సుకవిజన జేగీయమాన పెన్నాల గోత్ర పవిత్ర బోయినిపల్లి కులకలశ పారావార కైరవమిత్ర రామమాంబా గర్భనిర్భర శు క్తిము క్తావతారానవద్యవిద్యా విశంకట వేంకటరాయకుమార గండ భేరుండ బిరుదాభిధేయ కుమార వేంకటరాయ ప్రణీతంబైన ద్రౌపదీ కల్యాణం బను మహా ప్రబంధంబు నందు సర్వంబును పంచమాశ్వాసము.

విశేషాంశములు :

ఈ కావ్యమును కవి వేంకటేశ్వరున కర్పితము గావించెను. ఇది అయిదాశ్వాసముల కావ్యము.

కవి గండ భేరుండ బిరుదాంకితుడు. ప్రతి చాల శిథిలావస్థకు చేరుచున్నది. మధ్య 43 పత్రముల వరకు నశించినవి. ఆద్యంతములున్నవి. చాల పత్రములు క్రిమి దష్టమై కొంత విషయ నష్టము జరిగినది. కొన్ని పత్రముల తునుకలు మాత్రమున్నవి. లిపి స్పష్టము. ప్రతి విలేఖన దోషములు కలవు.

# ద్విపద భాగవతము

## తరికొండ వెంకమాంబ

ఆక్సెషన్ నెం : 590 కాల్ నెం : టి 3–585

ప్రతి : తాళపత్రము - అసమగ్రము. పత్రములు : 126

ప్రతి పరిమాణము : 47×3.6 సెం. మీ. పత్రపంక్తులు : 5

ప్రారంభము :

శ్రీ గణపతిని శ్రీక్షేత్ర పాలకుని బాగొప్ప దుర్గను భవుని ప్రార్థించి
వారక మా నందవర కులం బిలను సారంబుగా బ్రోచు చౌడాంబ దలచి
వరుస సూర్యాది నవగ్రహంబులకు మురు వొప్ప కరములు ముకుళించి మ్రొక్కి
మేలుకై వ్యాస వాల్మీక్యాదు లైన లాలిత కవులను లక్ష్య మందుంచి
సర్వమతాచార్య సముదయంబులను సర్వపండితులను చాల కీర్తించి
ఘన మైన తత్కథా క్రమ మెట్టు లనిన వినరయ్య కవులగు విద్వాంసులార
వెలయు సృష్టిస్థితి విలయంబు లెవని వలన నేర్పడు నను వర్తనంబునను
వ్యావర్తనమున కార్య ములనభిజ్ఞు డై వేడ్క తారాజన .... .... చి
యెవ డిచ్చె వేదంబు లెలమి పద్మజున కెవనిపై మోహింతు రిలను సద్బుధులు
అట్టి పర బ్రహ్మమైన మాధవుని పట్టుగా నమ్మినే ప్రార్థింతు నిట్లు

ముగింపు :

.... .... .... యవాంతర కల్పములును
అది గాక మన్వంతరాది రూపముల నొదవు విభాగంబు లొనర జెప్పెదను
అది పద్మ కల్పమౌ ననదగు నంచు విదితంబుగాగ నవ్విజయ పౌత్రునకు
చిరము .... .... సరవిని సూతుండు శౌనకాదులకు
వినిపింపగా నదివిని శౌనకుండు ఘనుడై న సూతుని గాంచి యిట్లనియె
ఓ సూత భాగవతోత్తము డనగ భాసిల్లు విదురుం ....
.... గములను నిరసించి పోయి నిఖిల తీర్థంబుల న్నియును సేవించి
మగుడి తా వచ్చి కౌమార దేశమున నగణిత యోగ నిష్ఠాగ్ర గణ్యుండు

నై నట్టి మైత్రేయు నపు డాశ్రయించి .... ....
వడసి నాడందు రా వర్త లేర్పడగ నదర దెల్పు మటన్న నలరి సూతుండు
మొనసి యా శౌనక మునిని వీక్షించి విను సంయమీంద్ర యవ్విజయ పౌత్రుండు
శుక యోగి చంద్రుని జూచి .... .... నరీతి
నరుదుగా నడుగగా నపుడా నృపతికి నెరుగ జెప్పిన రీతి నెరిగింతు ననుచు
దొరకొని శౌనకాదులకు సూతుండు తిరమైన మతి తోడ దెల్పగా దొణగె
ననియిట్లు సకల లోకాధీశు డగుచు తను నేలు తరిగొండ ధాముని పేర
ధరణి పై వెలయు నంద వరాన్వయుండు గురుతర సువసిష్ఠ గోత్ర సంభవుడు
తా నాల వంశ సాగర హిమాంశుండు నై .... .... తోడ
నంగన యగు మంగమాంబ గర్భమున సంగతి కృష్ణుండు సైదోడు గాగ
వెంగమాంబిక ప్రభవించి లింగాంగ భంగంబు కొరకు సుబ్రహ్మణ్య గురుని
చరణాబ్జయు ... ... యరసి పూజించి తదను మతి వడసి
వరుసగా నింజేటి వంశ భూషణుడు గురుతర శ్రీవత్స గోత్ర సంభవుడు
ఘనుడైన తిమ్మయార్యాగ్రణి పుత్రు డనగ జను లెన్ను .... ....
.... గ్మంబు బావంబు నందుంచి యనుపమం బైన మోక్షా సక్తితోడ
వలనొప్ప శ్రీ భాగవతము నందొనర నిల ద్వితీయ స్కంధ మిరవుగా ద్విపద
గా విరచించి వేంకట.... .... .... ....జంబులకు
శరణని మ్రొక్కి సజ్జనులు మోదింప పరమ భక్తిని సమర్పణము గావించె

విశేషాంశములు :

'శ్రీ పింగళనామ సంవత్సర శ్రావణ బ ౨ సౌమ్యవాసరం నరికి శ్రీ భాగవతము ద్విపద ద్వితీయ స్కంధము జవిళి గురువప్పకొ.... ....'

ఈ ద్విపద భాగవతము తరికొండ వెంకమాంబ కృతము. గుర్వాదేశానుసారము ఆ వేంకటేశ్వరుని కృపవలన పామరులకు గూడ నర్థ మగునట్లు తేటగా తత్వముల సంక్షేపించి హరి యవతార, పరాక్రమ, విహార, మహిమాదులతో రచించెను. దీనిని తరిగొండలోని వేంకటేశ్వరునికే సమర్పించెను.

ఈ ప్రతియందు మొదటి రెండు స్కంధములే యున్నవి, ఈ ప్రతి చాల వరకు క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. కొన్ని పత్రములు తునుకలైనవి. లిపి స్పష్టము. కాని ప్రతి విలేఖనమున స్వల్పదోషము లున్నవి.

# ద్విపద భాగవతము

## కొండపార్య కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3449 | కాల్ నెం | : టి 3-586 |
| ప్రతి తాళపత్రము ; అసమగ్రము. | | పత్రములు | : 161 |
| ప్రతి పరిమాణము | : 46.5×3.8 సెం.మీ | పత్ర పంక్తులు | : 8 నుండి 9 |

ప్రారంభము :

శ్రీ కరంబుగ ముని శ్రేష్ఠుల కెల్ల ఆ.... థి.... .... ....
....నట్లు భూవిభునికి వేడ్క దనరంగ శుకయోగి ధవు డిట్టు లనియె
క్షితినాథ నీ ప్రశ్న సిద్ధంబు నార్య హితమును శ్రేష్ఠంబు నెన్న భద్రంబు
విన నొప్పిదము పెక్కు వేలును గలవు గనుపట్టు నందులో ఘనము నీమతము
సంసారు లగువారు సదసంబు లందు హింస నొందుచు తత్వ మెరుగజాలకను
అతివేల రీతుల నిద్రాసక్తి రాత్రి గతమౌ కుటుం బార్థగతుల యహంబు
జను కళత్ర సుపుత్ర సద్బంధు మిత్ర జనములు తమకును సత్యమటంచు
బొలుపొంద గాపురంబులు చేసితుదను పొలియుదు రా కాలమును కని కనక
కావున విష్ణుండు కంజలోచనుడు సేవింప నాలింప చెలగి వర్తింప
తగను ఘోరౌఘ వితానంబు బాయ పొగడంగ తగు జనంబుల కెల్ల శుభము
బడయుటకును మానవాధిపతొల్లి పుడమిపై ఖట్వాంగ భూ వల్లభుండు
నిలయేడు దీవులు యేలుచు నుండి బలభేది ముఖ్య దిక్పాల కామరులు
అమరారులకు నోడి యట చనుదెంచి తమకు తో డడిగిన ధారుణీవిభుడు
ధర నుండి దివికేగి దానవ విభుల దురములో నందర దోరి మర్దింప
వరమిత్తు మనుచు దేవతలు భాషింప ధరణీ విభుండు నత్తరి వారికనియె

ముగింపు :

.... .... .... వెలయంగ సంసారి విధమున నుండె
ఆ వసుధామరుం డటు మేను విడిచి దేవలోకమున కేగె తెగ వాని భార్య
పతితోడ నగ్నిలోపల జొచ్చి పోవ నతని యెరుంగక నటు పెను తల్లి
కొడుకులు మిక్కిలి కుమతులై చాల నడవెడు శాస్త్ర విద్యలు నేర్వలేక
కసటు గైకొని గృహ కర్మంబులందు వెస నియమించిన విప్రవరుండు
తమవారు జెప్పిన తద్విధం బరసి క్రమము దప్పక గృహకర్మ మేమరక
అనయంబు నెరపుచు నతి ప్రీతితోడ అనుపమమును .... నైన
కాదన .... ధమ శుష్కాన్నంబుయైన యేది బెట్టిన నాల్క కింపుగా దలచి
భక్షింపు గాకొండు పల్కడు రుచుల వీక్షింపబోడు యా విప్రసుతుండు
దనరార నాత్మ నిత్యానంద సౌఖ్య ఘనలాభమును పెంపుగల్గియు చాల
రిహసుఖ దుఃఖంబు లిచ్చలో గొనక సహజశీతోష్ణ వర్షానిలంబునకు
కలిగియు పైచీర గప్పబోవకను చెలువొప్పు వృషభము చెన్ను వహించి
భూతి గప్పిన నిప్పు బోలిక దనరి ఖ్యాతి మీరిన నభివ్యక్త సద్బ్రహ్మ
విద్యగల్గియు జన వితతుల నరసి నాద్యుండు నష్టబ్రహ్మణ్యుండు యితడు
యని పల్కగా లోకమందు .... రిం .... తన వారు జెప్పిన తరి దప్పకుండ
వ్యవసాయ కర్మంబువలన వర్తించి తివిరి హితాహిత స్థితులెరుంగకను
పెనునూక తౌడును పిండియునాది గను ద్రవ్యముల రుచిగాను నెన్నకను
మరియును నమృత సమానంబుగాను యరసి భుజింపుచు నతిముదమునను
పండినచేని కావలి యుండునపుడు నిండిన వేడ్కతో .... శ్వరుడైన

విశేషాంశములు :

ఇందు 161 పత్రములు గలవు. 105 పత్రములు సంఖ్యలు గలిగియున్నవి. కాని అన్నియు వరుసగా లేక మధ్యమధ్య పత్రములు పోయినవి. 56 పత్రములు క్రమ సంఖ్యలు లేక క్రిమిదష్టమై కొంతభాగము మాత్రమే మిగిలియున్నవి. ఈప్రతి ద్వితీయ స్కంధమునుండి ప్రారంభమగుచు 41వ పత్రమునుండి 211 వ పత్రము వరకు మాత్రమే గలదు. ఇది ఆద్యంతములు లేని ప్రతి. ప్రతి మిక్కిలి శిథిలావస్థలో నున్నది.

# ద్విపదభారతము - విరాటపర్వము

## తిమ్మయ

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. : | 723 | కాల్ నెం : | టి 3-452 |
| ప్రతి : | తాళపత్రము; అసమగ్రము. | పత్రములు : | 110 |
| ప్రతిపరిమాణము : | 39 సెం.మీ. | పత్రపంక్తులు : | 5 |

ప్రారంభము :

.... .... .... .... మరి కార్యహాని

ప్రాజ్ఞుడు హితుడు బంధుడు తీర్చ రనక ఆజ్ఞమీరినవారి నణచుభూవిభుడు
చనువారు రాజు తో చర్చించు నపుడు తనకు నడమ చొచ్చి తగ వాదరాదు
పలువురతో గీడు బడసిరాజోద్య మెలగువానికి నేలమేలు సిద్ధించు
పొలసి భూపతివద్ద పూరకుండుటయు పలుమాటలును గావు పరిపాటిగాని
విభుని యేకాంతంబు వెలిబుచ్చరాదు విభునితో నారుమాట వివరింపవచ్చు
అంతఃపురంబులో నతిమైత్రి వలదు కాంతలు సభవున్న గామింపరాదు
వస్తువాహనములు వుత్తమాశ్వములు యెప్పుడు .... డీకయే కంగరాదు
మన్నించుచో నుబ్బి మనుజేంద్ర లేక తన్నుజెందినజాలు దైన్యంబు వలదు
వోజతో కరుణించి నుబ్బించె ననుచు రాజు చిత్తము జెప్పరాదు మున్నాడి
యెండైన వానైన హిమమున కోర్చి మండలేశ్వరు పంపుమరిసేయవలయు.

ముగింపు :

.... .... .... అమరేంద్ర సుతు బాణహతిచేసి తెగియు
కలయంగ నొకని కొకడు దాపుగాను నిలిచి వాములకట్ల నిలిచిన యట్ల
తొనుకాడు మణులతో తునుకలై తలలు పునుకలు గొనిపోవ పొదవుగా నెగసి
వడి ప్రజ్వరిల్లు కవ్వడి ప్రతాపాగ్ని కడునొప్పు విస్ఫులింగములుగాదోచె
కాలెడు శిఖిజొచ్చి కనక ఖడ్గములు కాలుష్యములు మాని కడుకొప్పినట్లు
అని జొచ్చి వీరులై అర్జునాస్త్రములు మనుజభావముతోడ మరి దివ్యులగుచు
రమణతో కొందరు రంభ కౌగిటను రమణితో కొందరూర్వసి సౌధమునను
మేలవు కొందరు మేనక యింట చలమొప్పి కొందరు సౌజన్య యింట.

గద్య :

అర్థిమందార సాహస విక్రమార్క పార్థివసుత శౌరి పంట వంశేంద్ర
కలకాల కర్ణబాగల బాలగోత్ర కలియుగ రఘురామ గాంభీర్య ధైర్య
పరమేశ్వరారాధ్వాన పరవీరహరణ పురవరతాడిత భూమి ప్రతాప
ఇది సదాశివభక్తహిత గుణాసక్త సదయస్వరూప కాస్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచిత విరాటపర్వమున నాశ్వాస ముచితార్థయుతముగా నొక్కటి యయ్యె।

**విశేషాంశములు :**

గ్రంథము మిక్కిలి క్రిమిదష్టమై యున్నది. వ్రాతదోషము లధికము.

గ్రంథమున కాద్యంతములులేవు. గ్రంథ శైథిల్యము, గ్రంథపాతము కలదు.

ఇందు సుమారు 4 ఆశ్వాసములు గలవు.

భారతమునందలి విరాటపర్వమును ఈ కవి దేశిచ్ఛంద స్సగు ద్విపదలో వ్రాసెను.

# ధర్మఖండము

## ఈదులపల్లి భవానీశుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 3661 | కాల్ నెం | : టి 3-99 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము, | పుటలు | : 175 |
| ప్రతిపరిమాణము | : 45.5×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 6 |

**ప్రారంభము :**

ఆ.వె, .... .... .... .... .... .... .... .... మేలపుశక్తి
ధనము గలుగు దానమొనరించు శక్తియు వర తపః ఫలములు వసుధ యందు.

ఆ.వె. రోగ పీడయును కురూపతా ప్రాప్తియు దీనతయును వృత్తిహీనతయును
సారశూన్య గృహము సర్వానుసరణంబు నలఘు దురిత కర్మఫలము గాదె.

క. పరగేహ నివాసంబును పరులన్ యాచింపుటయును బరదేశములన్
దిరుగుటయు గుపుత్రా ప్తియు దరిద్రతయు దుఃఖములు సదా యూహింపన్.

గీ. అతిథి పూజ యొనర్చుచు నధికనిష్ఠ తపము సల్పుచు సత్కర్మతా నిరూఢు
లైన మీ కీ దరిద్రత యర్హమగునె కావున ధనార్జనంబుపై కాంక్షమేలు॥

ముగింపు :–

క. ఆ లక్ష్మణా గ్రజుడు ప్ర త్యాలీఢ స్థానవసతి నమరి పలాశిన్
వాలమ్మున వ్రేయుటయున్ హా లక్ష్మణ యనుచు వాడు నసువులు దొరగున్.

వ. ఆ మృగ కళేబరంబు గొనుచు నతండు నిజాశ్రమంబునకుం జనుదెంచుచుండె. ననిన
విని నైమిశేయులట మీదటి కథా వృత్తాంతం బెట్లయ్యెనని యడుగుటయును.

వసంత తిలకావృత్తము.

తారాగ మందిర విధాతృ కిరీట కోటి
స్ఫారాబ్జరాగ రుచి బంధుర....రేఖా
నీరాజితాచ్ఛపద నీరజవేదవాహా
వారాశి తూణనిధివల్లభ సఖ్యలోలా ॥

గద్య :

ఇది శ్రీమద్గురు కరుణాతిశయ లబ్ధ కవితావైభవ యాదులపల్లి శంకర మంత్రి తనూ
భవ సుధీజన విధేయ భవానీశ నామధేయ ప్రణీతంబైన ధర్మఖండం బను మహాప్రబం
ధంబునం దష్టమాశ్వాసము.

విశేషాంశములు :

ఈ ప్రతియందు ద్వితీయాశ్వాసములోని కొంత భాగము, తృతీయ, చతుర్థ, షష్ఠ,
సప్తమ, అష్టమాశ్వాసములు గలవు. పంచమాశ్వాసము, మరియు గ్రంథాద్యంత
ములు లేవు. ప్రతి కొంత క్రిమిదష్టమై శిథిల మగుచున్నది. లిపి స్పష్టము. కాని ప్రతి
నలుపు దిరుగుటచే సులభగ్రాహ్యము కాదు. లేఖన దోషములు గలవు.

# ధర్మరాజాశ్వమేధ విధానము

## కృష్ణ ప్రధాని

ఆక్సెషన్ నెం : 586 కాల్ నెం : టి 3-218

ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 197

ప్రతి పరిమాణము : 39.5×3.5 సెం.మీ. పత్రపంక్తులు : 5 నుండి 6

ప్రారంభము :

శ్రీలక్ష్మి యను .... వు వహించు నీలమేఘస్ఫూర్తి నెటి మించు మూర్తి
కావేరి నడుమ .... తా నెలకొనియున్న ధర్మాను పర్తి
అనుపమ .... చక్రాది .... ఘన సాధనంబులగనుపట్టు ధీరు
ప్రణవ మంత్రాస్పద ప్రాభవో .... .... .... దారు
పెనుపొంద దిన ... . . ... ... ... ... ...
సగుణ నిర్గుణముల జాడల .... విలి ... ... ... ...
. . ... ...విష్ణు కలిత నామ ... ... ...
ధర్మజు నశ్వమేధ విధాన మెల్ల నిర్మలోక్తుల నాకు నెమ్మితోనీవు
వినిపింపు వీనుల విందుగాననిన మనుజ వల్లభు సమ్మతి నిరీక్షించి
నైమిశారణ్యంబు నను తొల్లి సూతు ని డామోదమున శౌనకాది మౌనులకు
విమల వాక్యంబుల వివరించినట్టి క్రమ మాత్మ నూహించి కథకు డిట్లనియె
విను ధరణీశ యీ విశ్వంబులోన వినుతికెక్కిన యట్టి విమల గాత్రుండు
అనుపమ గాత్రు డగు ధర్మపుత్రు డనుజులు దాను శ్రీహరి సహాయమున
శ్రీకరం బగు కురు క్షేత్రంబు నందు భీకర రణభూమి పెంపు వాటించి
కర బాణ లాఘవ క్రమవిక్రమముల వరుస నష్టాదశ వాసరం బులకు
కురుబలాధికులైన గురుముఖ్యయోధ వరుల నిజ జ్ఞాతి వర్గంబు నెల్ల
బలువిడి చతురంగ బలములతోడ చలమున మర్దించి జయసిద్ధిగాంచి

ముగింపు :

అంత నబ్బాలకు దమ్మహాఘోర కాంతారమునతనకాలి వేల్పట్టు
తునిసిన నొప్పి కుత్తుకయెండి నేత్ర జనిత భాష్పంబు లాస్యము ముంచి కొనగ

పొదరింటి లోపల పొక్కుచు పడిన కదసి విహంగమగణము లంతంత
వనదేవతలు దైవ వశమున జేరి ఘన కృప రక్షింపగా నుండునెడను
శతమన్యు విభవుండు .... పతి చందనావతి పట్టణమేలు
విష్ణు భక్తుడు దయాన్విత మానసుండు వైష్ణవపాద సేవాదురంధరుడు
ముష్కరుండగు దుష్ట బుద్ధికి కనక నిష్కంబు లేటేట నెఱి మిడుచు
ననలొప్ప చెల్మిచే నడచు పులిందు డను నరేంద్రుడు మృగ వ్యాసక్తి బలము
కొలిచిరా కానలకుంజ పుంజముల గల మృగావళి బట్టి కడిమి జంప్పచును
వచ్చి యా కానన వసుమతి జొచ్చి నచ్చట పొదరింట నతి దైత్య వృత్తి
చరణాంగుళి విభేద జనిత వేదనల హరి దలంపుచు నుండు నబ్బాలుగాంచి
సలలిత రాజలక్ష్మణ కళాప్రౌఢి గలిగినా డిట్టి చక్కని పిన్నవాడు
యెక్కడి వాడని యెక్కిన హయము గ్రక్కున డిగివచ్చి కరుణ బాలించి
హరిభక్తి నిరతుని యనఘుండునేను హరిదాసదాసుడ ననపత్యగతిని
హరివేడు కొనగ నాదైన పుణ్యమున హరి కృప గల్గెనీ యర్భకు డిచట.

**విశేషాంశములు :**

ఈ కవి తిరుమల వేంకట దేశికుని శిష్యుడు. ఇనుగండ్ల సోమమంత్రి కుమారుడు. ఈతడు తన కృతిని శ్రీరంగపతికి నంకితము గావించెను.

ఈ ప్రతియందు ఆది నుండి షష్ఠాశ్వాసమున గల చంద్రహాసుని కథ వరకు గలదు. ఇందలి లిపి స్పష్టముగ లేదు. ప్రతి మిక్కిలిగా క్రిమిదష్టమై కొన్ని పత్రములు పూర్తిగా నిరుపయోగముగను, శిథిలావస్థలో నున్నవి. గ్రంథాది యందలి పత్రములు నిరుపయోగములే. ప్రతి అంతమున గలవి గూడ అట్టి స్థితిలోనే యున్నవి. ప్రతి పార్శ్వ భాగములు శిథిలమై యున్నవి. ప్రతి నలుపు దిరిగి యున్నది.

# ధర్మాంగద చరిత్ర

## బొమ్మకంటి నరసింహకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం : | 2300 | కాల్ నెం : | బి 3-103 |
| ప్రతి : | తాళపత్రము; సమగ్రము. | పత్రములు : | 61 |
| ప్రతిపరిమాణము : | 34×3.5 సెం.మీ. | పత్రపంక్తులు : | 6 |

ప్రారంభము :

శ్రీరుక్మిణీశరాజిత కీర్తి సార సారసదళ నేత్ర సజ్జనాధార
ధారా ధరశ్యామ ధర్మ సంచార చారు మంజుల భాష జగదేకపాల
పాలితామర సత్యభామినీలోల లోల మానవరూప లోకమందార
ధారుణి కంసారిదైత్య సంహార హారకౌస్తుభ వక్ష అఖిల లోకేశ
కేశవార్చిత హృషీకేశ శ్రీవాస వాసవార్చిత భక్త వరద ముకుంద
కుందకుట్మల దంత గోపికానంద నంద నందన తీర నరహరిరూప
రూపాది సౌందర్య రూఢిప్రతాప తాపసార్చిత నరదైత్య సద్భావ
భావజ జనక వైభవ దేవ దేవ దేవతా రార్చిత దివ్యావతార
తారకాదిప వరతాప విదూర దూరీకృతాంతక దుర్జన హరణ
రణరంగధీర సురాజిత భరణ కరణి నూపుర మహాలంకార పురుష
పోషిత గంధ గజేంద్ర వరపుణ్య పురుష పురుషోత్తమాచ్యుత పోషిత భర్గ
భార్గవికుల రామ భాస విసర్గ స్వర్గమగోపాలు చాలనుతియించి
ఒకనాడు గౌతముండుచిత సద్గోష్ఠి నకలంక చిత్తుడై యాహల్యతోను
ఉన్న వేళను పతికి నువిదయిట్లనియె సన్నుతి కెక్కిన సౌజన్యనిధివి
ఒకటి నీ వెరుగని దుర్వి పై లేదు ద్రౌపది యాసీత తారల కంటె
యచ్చమండోదరి యెగురుజగతి యేపున జగతిలో యెన్నంగ దగిన
పరమ పతివ్రత బాగుగా గలదె అరయంగ యీకథ ఆనతిమ్మనిన
అంతనా గౌతము డాయింతి జూచి సంతోషచిత్తుడై చెప్పగా దొడగె
చెలియరొ వొక కథ చెప్పెద వినుము తెలివైన కాశ్మీర దేశంబునందు
కనకాపురంబను ఘనపట్టణంబు ధనధాన్యములచేత దనరుచు నుండు

కనకాంగి ఆ పురి కల్యాణ మగుచు నొనర నాకము బోలి వున్నతంబైన
కోటలు మేడలు కొత్తడంబులును మేలైన భావులు నిండు చెరువులును
ఘోటక హయభట కుంజరంబులును తోటలు బావులు తొంగలింపుచును
శ్రీయుక్తమైన శాశ్వత వస్తువులును యే యింట జూచిన యింపొందుచుండు
గలిగి నూతన రత్నకాంతులచేత యెందును రాత్రులు యరుగరాకుండ
చూడ నింపగు సూర్యసోమ వీధులును యాడ జూచిన కొనియాడు మాగధులు

**ముగింపు :**

అవని చిత్రాంగదుండను నామధేయ మవిరళంబుగ బెట్టి యానందమునను
ధృపమైన .... .... బెట్టి అవనీశ్వరుం డంత యా బంధువరుల
దొరల యా రత్నాంగదుని యాజ్ఞచేత కరమర్థి శుభలగ్న కాలంబునందు
పొలుపొంద శ్రీగంధ పుష్పాక్షతల వెలయంగ కైకొని వేదమంత్రముల
అవనిలో బ్రాహ్మణు లందరుగూడి శ్రవణించి మంగళాష్టకములు చదివి
అభినవనీత తోయములతో నపుడు అభిషేక మొనరించి అప్పు డిట్లనిరి
యెందాక హిమగిరి లెందాక సూర్యు లెందాక నదులును నెందాక ధరణి
యెందాక కులగిరు లింపొందుచుండు లందాక యీ రాజ్యమతి వేడ్కతోను
భూసురోత్తములును బుధులును గురులు ఆశీర్వదించి యా యవని కంతటికి
పట్టంబు గట్టిరి భాసురంబుగను గట్టిగా పట్టంబు గట్టిన వెనుక
భూనాయకుల వేడ్క భూసురోత్తముల దానంబులిచ్చి యాదరమున బంపి
కవులు భట్లకు మంచి కట్నంబు లిచ్చి నవమోహనాంగులౌ నాట్యకాంతలకు
అడిగిన త్యాగంబు లందరికి నిచ్చి తడవు సేయకను నందరిని బంపించి
అటు మీదరత్నాంగదాదిబాంధవుల పటు భక్తి యుక్తి తాత్పర్యంబుతోను
కనకాంబరాదులు ఘన భూషణములు వినయ విధేయుడై వేర్వేర మరియు
పూజించి వందనములు జేసి ననుప తేజంబుతో తమ దేశంబునకును
అరిగిరి వారంత హర్షంబుతోను చిరవైభవంబున చిత్రాంగదుండు
పరమహర్షంబున ప్రజల మన్నించి అరయగా తలిదండ్రు లానందమంద
తరిమిడి యత్యంత ధర్మంబుతోను చిర కీర్తి చెన్నొంది క్షితి యేలుచుండె
అనుచు గౌతమముని యాహల్యతోను పెనుపొందగాను జెప్పిన సంతసించె
అనిరమాధిపు డైన అబ్జాక్షుపేర గొనికొని స్వర్గమగోపాలుపేర

గద్య :

ఘనముగా శ్రీ బొమ్మకంటి నరసింహ దనువాడ శ్రీ విష్ణు కర్పితంబుగను
రచియించి చెప్పితి రమ్యంబుగాగ యుచితార్థయుతముగా నొనరిన యట్టి
యీ పుణ్యకథ భువి నెవ్వరు భక్తి నేపొద్దు చదివిన యిష్టమై వినిన
వరుసతో వ్రాసిన వారలకెల్ల సిరియు నాయువు గల్గిచెంగు చుండుదురు
పరువడి సతులతో బంధులతోడ వరుస పుత్రులతోడ వలనొప్ప మరియు
కామితార్థంబులు గలిగి హర్షించి దామర తంపమై దనరు చుండుదురు.

విశేషాంశములు :

గ్రంథ మచ్చటచ్చట క్రిమి దష్టమై యున్నది. వ్రాత తప్పులు, వ్యాకరణ దోషములు కలవు.

గ్రంథకర్త వంశ క్రమము.

సరసతయదువంశ సత్కులజుండు గురుతైన కౌండిన్య గోత్రంబునందు
కరమర్థి శ్రీ బొమ్మకంటి వంశాబ్ధి వరచంద్రు డగు మాధవాఖ్యుం డనంగ
పరమవైష్ణవమూర్తి భవ్యసద్వర్తి నతని పత్నినరసమాంబ యనంగ
పతి భక్తి గలిగిన భవ్య చారిత్రి పుడమి యా ఘనులకు పుత్రుడై యేను
తడయక నరులెల్ల దయ చాల గూర్చి అరయంగ నరసింహు డందురు నన్ను
హర్షించి శ్రీకృష్ణ కర్పితంబుగను గొనకొని యేను నాకృతియొనర్చెదను.

# ధర్మాంగద చరిత్ర

## బొమ్మకంటి నరసింహకవి

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 324 | కాల్ నెం | : టి 3-107 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 65 |
| ప్రతిపరిమాణము | : 32.5× 3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

ప్రతివిలేఖనము :

వర్తమాన వ్యావహారిక క్రోధినామ సంవత్సర మాఘశుద్ధ ౨ గురువారం మొదలుచేసి ఫాల్గుణ శుద్ధ ౨ సోమవారం వరకు బుగదిపురపు బుచ్చన్న కుమారుడు వేంకట రాముడు ధర్మాంగ చరిత్రంబను ప్రతి క్రమాన శోధించి వ్రాసినాడు.

బొమ్మకంటి నరసింహకవి పాడుకొనుటకు వీలగునట్లు ధర్మాంగద చరిత్రయను పేరుతో ఒక పతివ్రతామతల్లి కథను (స్త్రీల పాటగా) ద్విపదలో రచించినాడు. కవి గ్రంథా రంభమున హరికీర్తనచేసి, తన యీ కావ్యమును హరికే యంకితముగ వ్రాయు చున్నానని తెలిపినాడు. ఈతని ద్విపద కావ్యమందు ముక్తపదగ్రస్తాలంకారము కాన వచ్చును. పామర జనులకుకూడ సుబోధితమై స్త్రీలు పాడుకొన గల్గు రీతిని కావ్య రచన జరిగినది.

ఈ ప్రతియం దనేకమగు అక్షరదోషము లుండుటయేగాక ప్రతికూడ శిథిలావస్థలో నున్నది. కొన్ని పత్రములు తునుకలగుటకు సిద్ధముగనున్నవి. కొద్దిగా క్రిమి ద్రష్టము గూడ నైయున్నది. లిపి స్పష్టముగ నున్నది.

# ధర్మాంగద చరిత్ర

## తెళ్ళ కప్పయ

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3286 | కాల్ నెం | : టి 3–204 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 88 |
| ప్రతి పరిమాణము | : 37×3.5 సెం.మీ | పత్రపంక్తులు | : 5 |

ప్రారంభము :

శ్రీరామ రఘురామ ధారాధర శ్యామ కాకుస్థకులధామా లోకాభిరామ
రామజయరామా తారకనామ రణరంగ భీమ సూత్రామ నుతనామ గుణధామ
నీరజదళనేత్రా నిర్మల చారిత్ర దండంబు దండంబు దశరథ సుపుత్ర
త్రిపుర సంహార యాశ్రితజన జన మందార పారద దేహ శ్రీ గోరాజ వాహ
శ్రీ యుమానాథ పోషిత సర్వమునినాథ పరమార్థ సంవేద్యా భవరోగ వైద్య

రాజిత ధర్మాంగ రాజ చరిత్రంబు పదములుగాగను తెనుగు పదములను గూర్చి
నీ కర్పితము జేతు నిఖిల లోకేశ్వరా తప్పు లెల్లను దిద్ది దయ చిత్తగించు
భానుకులాధీశ జానకి ప్రాణేశ కామరొప్ప తత్కథాక్రమ మెట్టిదనిన
నిష్ఠాగరిష్ఠుండు నిరుపమ జ్ఞానుండు ధర్మపాలుండు గౌతమ మునివరుండు
యనయంగ తన కాంత యగు నహల్యాదేవి తోడ నిష్ఠాగోష్ఠితో నుండు తరిని
మోదమున పతితో డా ముదిత యిట్లని పల్కె సకల పురాణేతి శాస్త్రంబులందు
నీకు తెలియగరాని నీతిమార్గములేదు సర్వంబు తెలిసినా సద్గుణసముద్రా
సీత తారలు కన్న చెన్నుమీరిన పతివ్రత లెందు గలరే యానతి యిమ్ముదేవ
అనిన విని గౌతముం డాహల్య గనుగొని పరమాదరమున జప్ప దొణంగె నపుడు
సిరులచే మించు కాశ్మీరదేశమునందు రాణించు కనకాపురం బొకటి గలదు
పరమ ధనధాన్య సంపదలచే తండోప తండమై సన్నులకు పండువైయుండు

*   *   *   *

ధీరుండు ధారుండు దినకరతేజుండు మన్మథాకారుండు మహిత సద్గుణుడు
కరుణాలవాలుండు హరిపాద భక్తుండు కర్మాభిలాషుండు ధర్మాంగదుండు
భాసురరత్న సింహాసనాసీనుడై ధర్మంబు నాల్గుపాదములు దప్పకను
సతతంబు "నాత్మవ త్సర్వ భూతాని" యనియెడు మాట నేమరక యవని పాలించె

*   *   *   *

ముగింపు :

వీరణంబులు మ్రోయ వెలయాంధ్రు లాడంగ తాళ మృదంగ వాద్యములు మీరగను
తన సతియు తన సుతుడు తన కోడలును వేగ మానుగా మంగళ స్నానముల్ జేసి
పుణ్యాంగనలు బాడ భూసురోత్తము లెల్ల మహనీయ మగు వేదమంత్రముల్ జదువ
కొడుకు కోడలును సొంపడరంగ నవరత్న పీటపై గూర్చుండబెట్టి శీఘ్రమున
అవని చిత్రాంగదుం డని నామకరణంబు గావించి సత్యవతిగా సతిని బిలిచి
అకలంక రత్నముద్రిక చేత ధరియించి సింధోదకంబుల నభిషేకంబు చేసి
యెందాక సూర్యుండు యెందాక చంద్రుండు యెందాక కులగిరులు యెందాక ధరణి
యెందాక తారలు యెందాక భూతములు నందాక సకల రాజ్యము నేలుమనుచు

యుర్వీసురాళి యాశీర్వాదములు జేయ సుమహితంబుగను పట్టమ్ము గట్టి రవని
కవి సద్విబుధ బట్టు గాయకులకు చాల కట్నంబు లిప్పించి కడు వేడ్క నిలిపి
మోదముగ రత్నాంగదాది బంధువులకు మహిత వస్తువులు బహుమానంబు లిచ్చి
వినయంబుగా నంప ఘనముగా నెవరెవరి రాజ్యంబులకు నేగి రందరావేళ
ధర జనులు మెచ్చ తలిదండ్రు లానందింప ధర యేలుచుండె చిత్రాంగ భూవిభుడు.
అని గౌతముడు యహల్యాదేవితో జప్పె నని యీ కథాక్రమం బతిభక్తి మీర
నగినేటి శ్రీరామచంద్ర భూవరునేలు అతి కృపావాలు రామార్పణంబుగను.

## గద్య :

పరగ వేయిన్ని యనబది నూట డెబ్బది నాలుగో వరుషంబునకు సమంబైన
భావ వత్సర జేష్ఠ వర శుద్ధ యష్టమీ స్థిరవాసరము వరకు శ్రీరాము కృపను
తేజమగు ధర్మాంగరాజ చరిత్రంబు నయమొప్ప కెళ్ళ కప్పయ పదము జెప్పె
యిదియు వ్రాసిన విన్న ముదముతో జదివినను సిరియు నాయువుగల్గి చిరకాలమునను.
ధర మిత్ర పుత్ర పౌత్రాభి వృద్ధిగ జనులు యుల్లమలరగను వర్థిల్లు చుండుదురు.

## విశేషాంశములు :

ప్రతివిలేఖనము :

ఈ ధర్మాంగ చరిత్ర నలనామ సం॥ కార్తీక బ ౧౨ బుధవారం నాటికి దారపురెడ్డి వీరన్న వ్రాయడము అయినది.

ఈ కావ్యమునందు ధర్మాంగదునకు పుత్రోదయము, (పాము జన్మించుట) వివాహము, తీర్థయాత్రా మహిమచే పాము మానవరూపము ధరించుట తుదకు అతనికి చిత్రాంగదుడని పేరిడి రాజ్యాభిషేకము గావించుట యిందలి వృత్తాంతము. ఇది స్త్రీల పాటల కుపయుక్తమైన ఒక పతివ్రత కథ. ఇది శ్రీరామచంద్రునకు అంకితము. ఆర్యోక్తులను, లోకోక్తులను కవి చాల వాడెను.

ఈ ప్రతియందు సంపూర్ణమగు కావ్యమున్నది. ఇందలి లిపి సులభగ్రాహ్యము కాదు. అక్షర దోషములు, పాద దోషములు ఉన్నవి. కొద్దిగా క్రిమిదష్టమైనది.

(....)

## అనుబంధము - I

# గ్రంథకర్తృ సూచిక

# అనుబంధము - II

## ప్రతివిలేఖన వివరముల పట్టిక

| క్రమ సంఖ్య | ప్రతి విలేఖకుడు | విలేఖకుని తండ్రి | లేఖన కాలము | పుట | ఆక్సెషను నెం. |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| 1. | — | — | సాధారణ నామ సం॥ భాద్రపద శుద్ధ॥ గురువారము | 12 | 491 |
| 2. | ఈ. స. శర్మ | — | 1-3-1953 | 14 | 3678 |
| 3. | వెంకయ్య | పాపయ్య | అంగీరస నామ సం॥ ఫాల్గుణ శుద్ధ 10 | 17 | 2306 |
| 4. | ముక్కామల రుక్మేశ్వర శాస్త్రి | — | — | 27 | 1906 |
| 5. | నూగూరి రామమంత్రి | కరుణమంత్రి | ప్రమోదూత వత్సర వైశాఖ బహుళ 10 హరివారము | 33 | 810 |
| 6. | గురునాధపిళ్ళ | — | రక్తాక్షినామ సం॥ చిత్రి నెల 29 తి. శుద్ధ చతుర్దశి భౌమవారము | 35 | 4576 |
| 7. | — | — | సిద్ధార్థినామ సం॥ ఫాల్గుణ శుద్ధ 8 బుధవారం | 41 | 228 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 8. | వీరేశం | సులేగామ సంగణ | మన్మథనామ సం॥ చైత్ర శుద్ధ 1 ఇందువారం నుండి ఆషాఢ శుద్ధ 13 సౌమ్యవారము | 46 | 3978 |
| 9. | భీమణ్ణ | శింగన్న | రక్తాక్షినామ సం॥ మార్గశిర శుద్ధ 15 భౌమవారము | 49 | 762 |
| 10. | చల్లాకిష్టయ్య | — | విజయనామ సం॥ మాఘ బహుళ 10 | 53 | 756 |
| 11. | — | — | ఖర సం॥ కార్తీక బహుళ 10 మంగళవారము | 54 | 458 |
| 12. | గింటె కూర్మనాయకులు | — | — | 55 | 147 |
| 13. | తిర్ణభురి రంగన్న | — | వికృతి నామ సం॥ కార్తీక శుద్ధ 10 భానువారము | 56 | 393 |
|  | పెద్దగొల్లపాల అచ్చన్న |  |  |  |  |
| 14. | సీతారాముడు | — | ఖరనామ సం॥ ఆషాఢ శుద్ధ 15 భానువారము | 57 | 5929 |
| 15. | వరు కోటయ్య | — | ప్లవనామ సం॥ మాఘ బహుళ 2 స్థిరవారము | 60 | 3982 |
| 16. | అంతన్న | — | శుక్లనామ సం॥ కార్తీకబహుళ 13 | 61 | 285 |
| 17. | — | — | వికృతి నామ సం॥ మాఘ శుద్ధ 5 ఆదివారము. | 63 | 330 |
| 18. | తిర్మలపురి రామన్న | దేపరాజు పాపయ్య | కాళయుక్తి నామ సం॥ ఆషాఢ శుద్ధ 13 గురువారము | 64 | 4583 |
| 19. | దాసు మహంతి | — | వికారినామ సం॥ వైశాఖ శుద్ధ 5 గురువారము | 65 | 270 |
| 20. | విస్సుల శివ్వన్న | — | విరోధి నామ సం॥ చైత్ర శుద్ధ 7 | 69 | 2739 |
| 21. | లక్కరాజు పాపయ్య | రమణయ్య | ఖరనామ సం॥ మాఘ శుద్ధ 1 | 71 | 333 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 22. | — | — | నలనామ స॥ ఫాల్గుణ బహుళ 5 గురువారం | 72 | 1670 |
| 23. | — | — | ప్రభవనామ సం॥ ఆషాఢ శుద్ధ 5 శుక్రవారము | 75 | 3984 |
| 24. | పుల్లయ్య | బుచ్చన్న | క్రోధనామ సం॥ శ్రావణ బహుళ 3 | 78 | 3451 |
| 25. | బుత్తాడ అచ్చుతరాముడు | — | విక్రమనామ సం॥ చైత్ర బహుళ 11 ఆదివారము | 78 | 2740 |
| 26. | కింకన్న | — | నందననామ సం॥ భాద్రపద శుద్ధ 2 గురువారము | 79 | 1585 |
| 27. | వేంకటప్పయ్య | వేంకట రాఘవుడు | నలనామ సం॥ కార్తీకశుద్ధ 10 నుండి పింగళనామ సం॥ ఆషాఢశుద్ధ 7 | 80 | 3318 |
| 28. | — | — | కీలకనామ సం॥ పుష్య బహుళ ఇందువారము | 82 | 377 |
| 29. | రాయప్రోలు వేంకటాచలం | — | నందననామ సం॥ భాద్రపద బహుళ 14 శుక్రవారము | 83 | 1805 |
| 30. | రాజనాయుడు | పోతులపాత్రినాయుడు | సర్వధారి ఆశ్వయుజ బహుళ 7 బుధవారమునుండి మాఘశుద్ధ 12 ఆదిత్యవారము | 85 | 3296 |
| 31. | పెండేకట్ల వేంకట చలపతి | — | మన్మథనామ సం॥ భాద్రపద బహుళ 2 గురువారము | 89 | 1804 |
| 32. | — | — | పరాభవనామ సం॥ ఆశ్వీజ బహుళ 10 ఆదివారము | 92 | 709 |
| 33. | గడివేముల రామన్న | — | — | 95 | 427 |
| 34. | — | — | శార్వరినామ సం॥ జ్యేష్ఠబహుళ 3 గురువారము | 96 | 612 |
| 35. | ముంగర నర్సన | — | మన్మథనామ సం॥ ఆశ్వయుజ శుద్ధ 10 గురువారము | 96 | 428 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 36. | — | — | సిద్ధార్థినామ సం॥ పుష్యశుద్ధ 10 | 98 | 3977 |
| 37. | సీతారాముడు | ముంగర నర్సయ | క్రోధినామ సం॥ మాఘ బహుళ 16 గురువారము | 101 | 426 |
| 38. | నడిమించి చిన్ననరసింహులు | — | — | 105 | 2742 |
| 39. | రాజన్న | పోతులపాత్రినాయుడు | బహుధాన్యనామ సం॥ కార్తీక బహుళ 7 నుండి పుష్య శుద్ధ 18 శనివారము | 107 | 3297 |
| 40. | కొమ్మనాపల్లి కృష్ణమ్మ | సన్యాసి | రక్తాక్షినామ సం॥ చైత్రశుద్ధ 5 సోమవారము | 113 | 2748 |
| 41. | వెంకట నర్సయ్య | శేషయ్య | విరోధికృత్‌నామ సం॥ పాల్గుణ శుద్ధ 5 బుధవారము | 114 | 5282 |
| 42. | రంగనాయకుడు | పాపయ్య | భావ సం॥ పుష్య బహుళ 5 భౌమవారము | 116 | 3412 |
| 43. | దెందులూరి కనకయ్య | — | విజయనామ సం॥ కార్తీక బహుళ 5 శుక్రవారము | 128 | 5 |
| 44. | పెగడరాజు శేషయ సుబ్బయ | — | ఆశ్వీజ శుద్ధ 14 గురువారము | 134 | 5932 |
| 45. | — | — | క్షయనామ సం॥ భాద్రపద శుద్ధ 1 నుండి శ్రీముఖనామ సం॥ శ్రావణ బహుళ 1 మందవారము | 150 | 3879 |
| 46. | పెదరాజి నాయుడు | పోతులపాత్రినాయుడు | పింగళనామ సం॥ భాద్రపద బహుళ 12 జయవారము నుండి కాళయుక్తినామ సం॥ చైత్ర బహుళ 8 జయవారము | 152 | 3291 |
| 47. | — | — | సాధారణనామ సం॥ మార్గశిర శుక్ల 5 మంగళవారము | 152 | 3980 |

